సంస్థాపకులు
కీ॥ శే॥ వి.వి. రాఘవయ్య

మేనేజింగ్ ఎడిటర్
శ్రీమతి వి. లీలావతి
రాఘవయ్య



మే 1979

సహకార సంపాదకుడు : వేమూరి సత్యనారాయణ

సంపుటి 17 సంచిక 4

## విషయసూచిక



నవలానుబంధం

### నవలల పోటీలో తృతీయ బహుమతి పొందిన నవల

### వేలాడిన మందారం—జ్వాలాముఖి

ముఖచిత్రం: 'బంగారు చెల్లెలు'లో శోభన్‌బాబు, జయసుధ

జ్యోతి, 17-B రాజారాం కాలనీ, P. B. నెం. 2650, మద్రాసు-600 024.
ఫోన్: 423123. సంవత్సర చందా (ప్రత్యేక సంచికతో రు. 42/)

# కోరకుండానే యివ్వబడిన సువేగా యూజర్స్ యోగ్యతా పత్రములు మీరు సువేగా కొన్నప్పుడు తనిఖీకై మిమ్ము బండిపై తీసికొనిపోరు. అదే మీకు నిదర్శనము

పై మూడున్ను సువేగా మోపెడ్స్ యోగ్యతా పత్రములు. మీరు కోరునట్లు సువేగా మంచిదే కాకుండా అందమైనది కూడా అనుటకు మీకు చక్కని నిదర్శనములు.

అవును మోపెడ్స్ అన్నియు ఒకే విధంగా వుండేట్లు ఉత్పత్తి కాలేవని మీకు తెలుసుగదా. అందుచేతనే సువేగా భేదాలను గమనించి చూడండి.

సువేగా పొదుపుగల మోపెడ్. ఇది ఒకే ఒక లీటర్‌నకు 70 కిలోమీటర్లు పోతుంది. కారణం, ప్రత్యేకతగల ఎస్‌ఎస్ సీరిస్ కార్బొరేటర్.

సువేగా భద్రతగల మోపెడ్—అధిక స్థిరత్వమునకు చెయిన్ ప్రయాణము మరియు లోవైపున బలమైన పెట్టె రూపమున సెక్షన్ ఫ్రేముగలది.

సువేగా మన్నికగల మోపెడ్—దిట్టమైన క్రోమ్డ్ అల్యూమినియం మిశ్రమ సిలిండర్లు మరియు వెనుక తాకిడికి తట్టుకొను మేలైన అబ్జార్బర్లు—షా డీలక్సునందు గలవు. అందుచేత గతుకులుగల రోడ్లలో కూడా కదలకుండా సుఖంగా ప్రయాణం చేయవచ్చు. మరియు మెయింటెనెన్సు మరియు మరామత్తుల ఖర్చులు తక్కువ.

సువేగా—డీలక్స్ జంట సీట్ల మోపెడ్—రెండు విధాల పొదుపు సాధించవచ్చు.

సువేగా తేలికగా బయలుదేరు మోపెడ్—వెనుక చూపు వద్దు—సువేగా కొనండి.

వివరములకు మీ సమీపమందలి సువేగా డీలరులను కలుసుకోండి.

**Suvega**

**సువేగా సాటిలేని మోపెడ్‌కు మరొక పేరు.**



మోపెడ్స్
ఇండియా
లిమిటెడ్

తిరుపతి, ఆంధ్రప్రదేశ్

SAA/MIL/120 TEL



అది యెంత అందంగా వుంది అనేందుకు ముందే అది యెంత మంచిది అనే మాట రావాలి. అయితే సువేగా రెండు విధాల మంచిది.



దానిని నేటివరకు కొనకుండుటకు నాకు ఒకే ఒక కారణం వుండేది. అది యిప్పుడు మాయమై పోయింది సువేగా డీలక్స్ యిప్పుడు రెండు సీట్లు గలది.



తక్కువ పెట్రోల్‌తో యెక్కువ దూరం పోవాలని నేను కోరుకొన్నాను. సువేగా కొనేవరకు నా కోరిక ఫలిస్తుందని నేను అనుకోలేదు.

# తొలిమాట

ఉగాదికి — ఆలస్యంగానే ఐనా — రచయితలకు పాఠకులకు, ప్రకటనకర్తలకు, ఏజంట్లకు మా శుభాకాంక్షలు. తెలుగువారికి కొత్త సంవత్సరం ప్రారంభం అవుతున్న ఆనందాన్ని మిగలనీయకుండా అంతకు ముందే వచ్చి 'బడ్జెట్' అడ్డుకొంటుంది ఎప్పుడూ. ఈసారీ అదే జరిగింది. దేశీయాంగశాఖ చేపట్టి, కొంతకాలం ప్రభుత్వానికి దూరమై తిరిగి ఆర్థిక మంత్రిగా జనతా ప్రభుత్వంలో ప్రవేశించిన చరణ్ సింగ్ ప్రవేశపెట్టిన బడ్జెట్, రైతులకెంతో ఉపయోగకరమైనదని ప్రభుత్వం చెప్పినా, మధ్య తరగతి ప్రజల జీవితంపై అదనపు భారాన్ని బాగానే పెంచింది. అయితే భారత ప్రభుత్వం తన దేశప్రజలకు ఒక సాయం మాత్రం చేస్తూనే వచ్చింది కాంగ్రెస్ పాలనలోనూ, జనతా పాలనలోనూ కూడా! టాక్స్‌లు పెంచి ప్రజలపై అదనపు భారం మోపబడుతున్నది ఆనవాయితీ అయింది. ప్రజలు 'షాక్' తినడం మానేశారు. అలవాటు పడిపోయారు. రాజీపడి బ్రతకటం నేర్చుకొన్నారు.

* * *

ఈనెల నవలానుబంధం ప్రచురించాక, పాకిస్తాన్ మాజీ ప్రధాని భుట్టో ప్రస్తావన లేకుండా ఉండలేకపోతున్నాము. భుట్టో నిర్దోషి అని చెప్పలేకపోయినా. కోర్టువారు విధించిన ఉరిశిక్షను ప్రశ్నించలేకపోయినా (న్యాయస్థానాన్ని ప్రశ్నించలేము మరి!) భుట్టోను ఉరినుంచి తప్పించ గలిగిన, పాకిస్తాన్ ప్రెసిడెంట్ జియా, అలా చేస్తేనే బాగుంటుందని మేము భావిస్తున్నాము.

* * *

జాగ్రత్త! ఆషాడభూతులుంటారు. మర్యాదకు పోయారో నెత్తి కెక్కి కూర్చుంటారు! శాంతి లేకుండా చేస్తారు. అంతేకాదు... ఇంకా.... చూడండి 91వ పేజీ.

* * *

'రాజకీయ సంగీత కుర్చీలు' అంటే తెలుసా మీకు? పోనీ పార్టీ మార్పిడి అంటే తెలుసు కదా! పార్టీ మార్చుకొందామనుకొన్నా ఇబ్బంది ఎదురౌతుంటే రాజకీయ నాయకుడేమౌతాడు పాపం! మీరే చెప్పండి! పూర్తి వివరాలు కావాలంటే 66వ పేజీ చూడండి.

# ఉత్తరాలు

నేను పుట్టినది ఆంధ్రదేశమైనా మెట్టినది తమిళనాడు. అందువల్ల జ్యోతి (April) చదివే అదృష్టం నిన్ననే కలిగినది. వినోద కరములు వినోదాయకములు అయిన విభాంశాలతో ఎంతో బాగుంది. "జగదాంబ"ని తల్చుకుంటే జాలివేస్తూంది. ఎన్. లక్ష్మిగారు. క్రికెట్టు గురించి సరళమైన శైలిలో విశదంగా వ్రాసేరు. ఆమె Players ని పరిచయంచేసిన విధానం చాలా బాగున్నది. ఆమెకి అభినందనలు.

—రాంభట్ల ఛాయాశ్రీధర్, కొడిముడి.

మార్చినెల జ్యోతి సంచికలో ప్రారంభమైన చర్చా వేదికకు నాదీ ఓ ఆక్రోశంతో కూడిన ఆవేదన.

ఉత్తమ సాహిత్యం వారపత్రికల ద్వారా, మాసపత్రికల ద్వారా రావటంలేదు అనే వాదనని పూర్తిగా ఎవరూ సమర్థించలేరు. ఎందుకంటె నేటి సాహిత్యం అంతా వాటిలోంచే వెలుగులోకి రావాలి కనుక. రచయితలనూ, రచయిత్రులనూ తయారుచేసే కర్మాగారాలు అవే కనక.

కానీ, ఫలానివిధంలో కథ రాస్తేనే కానీ వేసుకోదీ పత్రిక, ఫలానా పత్రిక విప్లవ కథలనే లేదా స్లేంగ్ ఉన్న కథలనే వేసుకుంటుంది అనే ధోరణి ప్రబలం చేసిన పత్రిక పాలసీలు కూడా ఉత్తమ సాహిత్యం రావడానికి ఆటంక పరుస్తున్నాయ్. ఫలానా విధంగా కథ రాసి ఏదో విధంగా అచ్చేసుకొని డబ్బులు సంపాయించుకుందామనే రచయిత(త్రు)ల నుండీ కూడా ఉత్తమ సాహిత్యం ఆశించటం అనవసరం. నా కథలు యిన్ని ప్రచురించబడ్డాయి అని చెప్పుకొందాం అనే ధోరణి లేని రచయిత కాని ....త్రి కాని కనపడదు. ఇంటింటా సాహిత్య హనుమంతరావ్‌లు, గాయత్రీదేవులు వెలుస్తున్నపుడు, ఫలానా విధంగా కథ రాయండి మేం వేసుకొంటాం అని పత్రికలు రచయిత(త్రు)లను తమ పథానికి లాగేసుకుంటున్నపుడు ఉత్తమ సాహిత్యం ఒకటీ అరా తప్పితే, లేదా ఫలాని శాస్త్రి అని చెప్పుకోటం తప్పితే సాహిత్యం అని చెప్పుకోలేని రచనలు రాక మానవు.

రచయిత పేరునికాక రచనని, రచన ఏ పాలసీకి చెందిందని కాక అందులో వైవిధ్యాన్నీ, త్వరితంగా పరిశీలించగలిగిన నాడు ఉత్తమ సాహిత్యం రాగలుగుతుంది. ఫలానా నా నవలల హక్కులు నాదగ్గరే ఉన్నాయ్ అని పబ్లీకున ప్రకటనలు చేసే గాయత్రీదేవులు,వాళ్ల నవలలకోసమే పత్రికలన్నీ ఎగబడ్డం మానేసిన రోజున, రచయిత(త్రు)లలో సృజనాత్మక కళ రచన చేయించిననాడు ఉత్తమ సాహిత్యం వస్తుంది.

అలా క్కాదూ—హనుమంతరావ్
జిందాబాద్

గాయత్రీదేవి జిందాబాద్.

—[నం॥పా॥సా॥కి క్షమాపణలు]
—జితేంద్ర, శ్రీకాళం.

మార్చ్ 'జ్యోతి'లో 'శేషప్రశ్న' కథమీద రచయిత వినయ్‌గారి వుత్తరం చూసాను.

విప్లవం అంటే 'తుపాకీ', 'రక్తం' అనుకొని ఆయన రచనను పరిశీలించలేదు కనుకనే ఆయన కథను 'మంచి ప్రయత్నమే' అని 'నిజాయితీ'తో అనగలిగాను. (ఫిబ్రవరి సంచిక) విప్లవం ప్రతిహింస (హింసకాదు) ద్వారా

మాత్రమే వస్తుందని తెలిసినా, విప్లవమనగానే యిట్లా జడుసుకునే వాళ్ళుంటారనే, 'విప్లవం' అని రాసి బ్రాకెట్లో 'మార్పు' అని రాసాను.

విప్లవ కవుల గురించి నేనడిగిన ప్రశ్నలకు జవాబే రాయకుండా అనవసర విషయాలు ప్రస్తావించారు వినయ్‌గారు. అట్లాగే, మార్క్సిస్టు సిద్ధాంతాల్ని చర్చలోకి లాక్కొచ్చారు.

"కళను మత్తుమందుగా జోలపాటగా కాకుండా శక్తిదాతగా మేల్కొలుపు పాటగా" మార్చబూని, "భావివేదముల జీవనాదములు" చవిచూపించబూని, తనలో కదిలే 'నవ్య' కవిత్వాన్ని శ్రామిక వీరులకూ, కార్మిక ధీరులకూ సమర్పణం చేయబూని 1937లో శ్రీశ్రీ చేసిన 'ప్రతిజ్ఞ' విలువ పిల్లకాయలకు అర్థం కాకపోవచ్చు. "పారిశ్రామిక మహాయుగంలో కవిత్వం మడి గట్టుకొని మడిని నమ్ముకొని కాల్పనిక భావనా సౌఖ్య పరవశమై వుండకుండా, యంత్రాలనూ వాటి దర్పాలనూ, కార్మికుణ్ణి వాడి దోపిడీనీ, వర్గాలనూ వాటి వ్యత్యాసాలనూ దర్పణమై చూపవలసి వుంటుందని గమనించి వెనువెంటనే అలా చేసి చూపిన మొట్టమొదటి 'నవ్య' కవి శ్రీశ్రీ" ఆ "ప్రతిజ్ఞ" యీనాడు ఏం బతుకులు మనయిరో అన్నలార చెల్లెలార" (గద్దర్) లాంటి పాటలకు ప్రాణం పోస్తున్నది.

"వరవరరావుగారు రాసిన పుస్తకాల్ని చదివే ఆదిలాబాద్, కరీంనగర్‌లలో విప్లవంవచ్చింది" అని వరవరరావుగారే అనరు.

రచనల ద్వారా విప్లవం రాదు. ప్రజలు ఎప్పుడూ విప్లవకారులే. "ప్రజలనుంచి ప్రజలకు" అనేది విప్లవ రచయితల పాటకూ, మాటకూ బాట.

"చెక్కభజనలకూ, ఈ విప్లవ కవిత్వాలకూ ఏమాత్రం వైవిధ్యం వుంది?" అంటే అర్థమేమిటో? 'వైవిధ్యం' అనే మాటకే అర్థం తెలియని వినయ్‌గారితో ఈ విషయంలో ఏం చర్చించాలి?

విప్లవ కవులు విప్లవాన్ని 'మాటలు'గా మారుస్తున్నారని అక్కసా? వినయ్‌గారు 'ఈసెలు'గా మారుస్తారా? అట్లయితే ఆయన కోరని 'రక్తం' ప్రత్యక్షమవుతుంది కదా, మరి? 'తుపాకీ' వద్దుకానీ నక్సల్బరీ వుద్యమం పట్ల (అర్థంలేని/అర్థంకాని) 'ఆవేదన' ఎందుకు?

**Dialectic Materialism** అంటే **Dialectical Materialism** అని భావమేమో? అట్లాగే, **dialects** అంటే **dialectics** అనుకున్నారేమో వినయ్‌గారు? మార్క్స్ చెప్పిందీ, లెనిన్ చేసిందీ ఏమిటో యిపుడు ఎందుకుగానీ, ఈ పదాల అర్థాలు ముందు నేర్చుకుంటే తర్వాత మార్క్సిజం మీద చర్చ చేయొచ్చు.

వ్యక్తిత్వం లేని వాళ్ళవల్ల విప్లవం వస్తుందనలేదు నేను. ఆత్మద్రోహమంటే పదాలకు అర్థాలు తెలియకపోవడమా?

రచయిత వుత్తరంలోని రెండో పేరాలో చివరి వాక్యం ఆయనకైనా అర్థమైతున్నదా?

ఇవన్నీ కూడా అచ్చుతప్పులేనా?

ఉపమానాన్ని సాగదీయటం ఏ అలంకార శాస్త్రప్రకారం తప్పో చెప్తే తెలుసుకుంటాను. "ఎండిపోయిన చెరువు పల్లె ప్రజల మెదళ్ళలాగే వుంది" అన్న మాటకు ముందూ, వెనుకా వున్న మాటలు కలిపి చదివితే వేరే అర్థం రాదు. పల్లెప్రజల మెదళ్ళు ఒకనాడు ఖాళీగా వుండడమేమిటి?-తర్వాత ఎపుడో వీలైతే నింపడానికి!

"కుహనా సిద్ధాంతాల్లాగా వున్నాయి అక్కడొకటీ, ఇక్కడొకటీ మబ్బులు" అని రాయబోయి 'కుహనా' పదం మరిచిపోతే చిన్న తప్పే; దిద్దుకోవచ్చు కాని, "ప్రజల్ని ఆలోచింపచేసి, వాళ్ళలోకి చొచ్చుకుపోయిన ఒక్క సిద్ధాంతం చూపించండి ఎవరైనా?" అని అడగడం యింట్లో కూచుని సిద్ధాంత చర్చలు చేయడమే.

పోరాటాలు సిద్ధాంతాల గిరుల్లో వుండకపోవడమా? ప్రజలకు పనికి వచ్చే సిద్ధాంతం వ్యవస్థ గీసిన గిరులను చెరిపేసేందుకే పోరాటం చేయమంటుంది. సిద్ధాంత జ్ఞానం లేకుండా చేసే పోరాటాలు సంపూర్ణ విజయాలనివ్వవు.

దూరంగా ఆకాశంలో తేలే సిద్ధాంతాలను రచయితే చూసి చెప్పారు పాఠకులకు-కథలో. అవి తనకు కనిపించలేదని యిపుడు అంటున్నారు! కనిపించని విషయాలు కనిపిస్తున్నాయని చెప్పడం ఎట్లా సాధ్యం? 'చైతన్య' మూర్తులకు 'స్పందన'ల ద్వారా సాధ్యపడుతుందా?

కథను "తెలంగాణా భాషలో మాత్రమే రాస్తున్నానని" (తెలంగాణా భాష అని ఒకటుందా?) ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. కథలోని సంభాషణలు చూస్తేనే తెలుస్తున్నది. మరి, ఆ సంభాషణలన్నీ అదే మాండలికంలో వుంటే బాగుంటుందనడం, "కలం గారడీ కైతల వలలు" అల్లడమా? కళ ప్రజలకోసమనే అనుకుంటే ప్రజల భాష వాడొద్దా? "చెబుతాను" 96వ పేజీలో వున్నది. వినయ్‌గారంటున్న అచ్చుతప్పుల విషయం 'జ్యోతి' చెప్పాలి.

ముందే కొన్ని అభిప్రాయాలు ఏర్పరచుకొని చర్చకు దిగితే, తప్పులు చెప్పవలసి వస్తుంది, ఎదుటివాడిని చర్చనుండి విరమించుకునేలా చేసినట్లూ అవుతుంది.

—విజయ్, వరంగల్.

## యామిని—ప్రొద్దుతిరుగుడు పువ్వు

నవల చివరి రచయిత్రి పరిచయం చదివిన వారెవరైనా ముందర పెన్‌నేమ్ అయికమత్యం చూసి ముచ్చటపడి తిరిగిలేచే తీరికలేకుండా, భార్యాభర్తలు కదా, సంసార సాగరాన్ని మధించినవాళ్ళు, కాస్త బాధ్యతగా రాస్తారు అనుకుంటే వాళ్ళ తప్పుకాదు-అట్లా బాధ్యతగా రాయని ఆ జంట తప్పే.

కథ మొదటినించీ చివరివరకూ సంఘంలోని స్త్రీస్థితిపై మొగవాడిచ్చే కామెంటరీ వినిపించిందే తప్ప, స్త్రీహృదయం కథా వస్తువుతో స్పందించిన స్పందన వినిపించలేదు. ఇంక బాధ్యత ఎక్కడ?

కథలో రవి, ప్రేమరాజు మన తమలపాకు హీరోలే. సరోజ, గీత చెలియల కట్ట దాటలేని సముద్రాలే. స్త్రీని ప్రపంచంలో అందరూ ప్రకృతి స్వరూపిణి అని గుర్తించారు. గౌరవించారు—మన "సత్యం వద, ధర్మం చర" అన్నట్టు కొటేషన్లమధ్యే వుంచారు. ఆచరణలోకి తేనేలేదు. కొంతవరకైనా మన భారతీయులే నయం, మొన్నటి లండన్ సంఘటన మర్చిపోరు కదా?

రంగనాయకమ్మగారి విమల అన్నట్టుగానే "స్త్రీని నువ్వు అంతదానివి, ఇంతదానివి, సుకుమారివి, అంటూ అబలాత్వం అంటగట్టారు"—ఈ సరోజ, గీతలు గూడ కొంపమునిగేదాకా స్పందించి నోరు విప్పలేని జీవులు. నవలలో పాత్రలు చాలావరకు రైటర్ యిష్టం.

నిజానికి "దిరిసెన పువ్వు"లోని కథ కావాలంటే మూడురూపాయలు పెట్టి జ్యోతి కొనే చదవక్కర్లా. 50 పైసలు కూడా కాకుండా 'ఈనాడు' వస్తుంది. ప్రస్తుతం లండన్ వ్యవహారం హెడ్‌లైన్సులో జరుగుతోంది.

చైతన్యం కావాలంటే ప్రాబ్లమ్ చెప్తే సరిపోదు. దీనిని జీవితంతో అన్వయిస్తూ, సమాధానాన్ని సూచించాలి. అది చెప్పటం చాతకాకపోతే జర్నలిజం డిప్లమా తీసుకుని ఒక డైలికి జర్నలిస్టుగా చేరాలి. చేరనివ్వకపోతే స్వంతప్రెస్, పేపరూ పెట్టుకోవాలి, "సాహిత్య హింసావలోకనం" (నండూరి పార్థసారథిగారిది)లో హనుమంతరావు — వాళ్ళ ఆవిడలాగా.

సమస్యలు, జ్యోతి పుస్తకంలో లేవు. print అక్షరాల్లో వుండవు. సజీవంగా ముందుకు నడవటానిని నిరాకరించే ఆడా, మగవాళ్ళ, వారివారి అహంకారాల్లో వున్నయ్. వాళ్ళ పరిధిని దాటలేని సంకుచిత తత్వాలలో వున్నయ్.

"నూతిలోపలి కప్ప, పాతగొప్పలు తప్ప, మెచ్చదితరుల గొప్ప" అని ఆరుద్రగారు నిట్టూర్చింది ఈ జ్యోతిలోనే కూనలమ్మ పదాల్లో. దాని తరువాత "రెలెటివిటి" అనే అప్పారావు (గురజాడకాదు) మాట మర్చిపోతే జరిగిందంతా గందరగోళం.

మధ్యతరగతి వాళ్ళకి, వాళ్ళ చాకళ్ళు, పనిమనుషులు పూటకి గతిలేనివాళ్ళు. టాటా,

పిల్లలకి మనం కూడా అంతేకదా? ఏ చెడ్డ అలవాట్లు లేనివాడికి, పొగలమోతుబరి రౌడీ. ఆ మోతుబరి దృష్టిలో ఈ మంచిబాలుడు అసమర్థుడు.

అట్లాగే ఆడ మగా కూడా. కాకపోతే హిపోక్రసీ కదా? వున్నదున్నట్టు చెప్పుకోలేరు. సరోజ—కూడా అంతే. మనసు చివుక్కుమన్నప్పుడు, అదే "ఆ గుర్తుదొరికిన రోజు" మొగుణ్ణి కొట్టచ్చుకదా. practicalగా యే యిల్లాలైనా అలాగే చేస్తుంది fail అవుతుంది.

ఎందుకు fail అవుతుందో చెప్పాలి. ఆ చెప్పలేకపోతే, పోవటం అంటే రచయిత్రికి తన పరిధి దాటిపోవటం—సాధ్యం కాలేదు. అని అర్థం. పెళ్ళికాని అమ్మాయి అయితే సాధ్యంకాలేదని ఒప్పుకోవచ్చు. సంసారంలోకి వచ్చాక, గృహిణిగా తను జీవిస్తూ చెప్పలేక పోతే, షెర్లాక్ హోమ్స్ లెవెల్లో యెన్ని డిడక్షన్స్ అయినా చెయ్యవచ్చు. సరోజ అన్నట్టు రచయిత్రి కూడా ఆడపిల్లేకదా—భారతంలో ఒక అమ్మాయా?

రచయిత సర్వతంత్ర స్వతంత్రుడే. అయితే అది తను 'రచయిత' అయినంత వరకే. జర్నలిస్టు, థింకర్, ప్రాఫెట్ కలిస్తే logic కూడా కలుపుకుని ఒకవ్యక్తి, తన పరిధిలో రచయిత కావడం జరుగుతుంది ఎవరి గుర్తింపు వున్నా లేకున్నా. ప్రతి ఆర్టిస్టుడియో ఆర్టిస్టూ, బాపో, రవివర్మో, లినార్డో, డావిన్సీనో కాలేడు కదా.

కనీసం సూటిగా చెప్పినా చెప్పకపోయినా ఒక్క హాస్టల్ మేడం చెప్పిన జాగ్రత్తకు, సలహాకు రచయిత్రికి ఫస్ట్‌ప్రైజ్ ఇవ్వచ్చు.

మేడం: "సరోజా! ప్రపంచంలో అన్నింటి కంటే త్వరగా అంతర్థానం అయిపోయేది.... దాంపత్యం తల్లీ" అంటూ వచ్చి నిజాన్ని చెప్పేస్తూ, అది అంతర్థానం కాకుండా చూసు కోవడం కళ అంటూ వచ్చి అబద్ధం చెప్పి స్తుంది. అది కళకాదు. కామన్‌సెన్స్. అది లోపించే 90 శాతం జంటలు యాంత్రికంగా తయారౌతున్నయ్.

ఇద్దరు ఫ్రెండ్స్, జీవితాంతం ఫ్రెండ్స్‌గా వుండగలుగుతున్నారు. భార్యకీ, భర్తకీ, చెప్పుకో లేనివి ఫ్రెండ్స్‌కి చెప్పుకుంటున్నారు. భార్యా భర్తలెందుకిలా ఉండలేకపోతున్నారు.

3 సంవత్సరాలు కాపరం చేసిన సరోజ, రవి అలాంటి 'ఎందరో ఎందుకు క్రమంగా దూరం అవుతున్నారు? అన్నది సమస్య. ఈ నవలలో లాటరీ తగిలినట్టు, స్వతహా సంస్కారం కలిగిన రవి, ఒక్క లెక్చర్‌తో బాగుపడిపోతాడు. ఇది జరిగేదా?

అవుతే గిరీశం లెక్చర్లు చదివాక తెలుగులో రేడియో నాటికలకంటే అధ్వాన్నమైన సినిమా లెలా తీస్తారు? అక్కడ జరిగినది లెక్చర్ వల్ల కాదని తెలుస్తూనేవుంది ప్రతివాడికీ. తెలియని వారికైనా ఒక్కసారి అనుభవంలోకి వచ్చిందా తెల్సిపోతుంది. అంతెందుకు మా యిద్దరి జంటా చాలాబాగా వుంటాం. సిగిరెట్లు నేను బాగానే కాలుస్తాను. అది తన కసహ్యం. అంతవరకూ margin ఇస్తాను. అది దాటి తనూ జోక్యం చేసుకోదు. దాటి జోక్యం చేసుకుని మానెయ్యమంటే, నాకోసం నువ్వు అలవాటు చేసుకోమంటే? గొడవ ఆగిపోయింది. సిగిరెట్టు చెడ్డ అలవాటే. కాఫీ కాదా? సరోజ కాఫీ తాగదా? మానేద్దామన్న ఆలోచన ఏల రాలేదు? మొగుడుకి కాఫీ అలవాటు లేక, భార్యని తాగద్దంటే మరి రాక్షసుడైపోయాడే మా అందరిలో?

నో, నవలలలో మల్లే లాటరీ తగిలి జీవితం బాగుపడితే బాగుపడ్డట్టు. లేకపోతే లేదా? సజీవకళే, చైతన్యం గుర్తుకదా? ప్రయత్నించే దోవవుండే వుండాలి. సృష్టిలో ఇంతవరకూ సమాధానం లేని సమస్య చావు ఒక్కటే. మిగిలినవి వ్యక్తులశక్తిని బట్టి, సిన్సియారిటీని బట్టి దొరుకుతై.

ఆనాసిన్ కావాలని బయల్దేరి పెట్రోలు తీసుకురావన్నంతవరకూ బాధలేదు.

ఆవిడ కథనే సమస్యగా స్వీకరించి పాఠకుడి జిజ్ఞాసను గౌరవించి "జ్యోతి" చదివే మహిళాలోకాన్ని దృష్టిలో పెట్టుకుని అంత భీభత్సంగా తెలుగుసినిమా అల్లే వున్న

కథ సడన్‌గా క్లైమాక్స్‌లో ఎలా సుఖాంత మయిందో.

సరోజ, రవీ; ప్రేమరాజు, గీత; వాళ్ళ వాళ్ళ భావాల్ని హఠాత్తుగా అహంకారం అనే కళ్ళద్దాలు తీసేసి, ఏ కళ్ళద్దాలు ఎలా వేసు కున్నారో దానికి ఏ ట్రిక్ వాడి అవి తొడిగిం కారో చెప్పమని సిన్సియర్‌గా అడుగుతున్నాను- కాదు డిమాండ్ చేస్తున్నాను.

స్వీట్ హోం 003 వచ్చింది మీ కలంనించే అని మర్చిపోకుండా ఈ సమాధానం చాత నయితే చెప్పండి — irresponsibleగా పారడీలు రాయడం అనుకున్నారా రచనలంటే? లేకపోతే జర్నలిజం అనుకున్నారా?

కాకపోతే 2000- కంటే ఎక్కువ విలువైన 'మేడం' కొటేషన్ ఇచ్చిన రచయిత్రికి- ఇకనైనా బాధ్యతగల రచనలు వస్తాయన్న ఆశతో. —అభినందనలతో—పాఠకులు

సాయిలలిత, రమణమూర్తి, నంద్యాల

నందమూరి నగుమోముతో నవ, నవలాదే జ్యోతి మాసపత్రిక చాలా ఆకర్షణీయంగా వుంది.

వసుంధరగారి నవలానుబంధం నవరస భరితంగా వుంది. అటు రాజకీయధోరణి, ఇటు విద్యార్థులధోరణి భుజాలు తడుముకునేలా వుంది. శ్రీనివాస్‌రావును దుర్యోధనుడితో పోల్చడం సమంజసంగా వుంది. వందన ద్రౌపది కాలేదు. ప్రేమించిన వాడికి దూరమై పరవాడికి పత్ని కావలసివచ్చింది. కడదాక ద్రౌపది అన డానికి వీలులేదు. క్లయిమాక్స్‌లో కట్టుబట్టలు లేకుండా చేసినపుడు ద్రౌపది అయింది. నాటి ద్రౌపదికి కృష్ణుడు చీరలిచ్చి మానం కాపాడాడు. వందనకు అలాంటి అన్నలు లేనందుకు అవ మానం భరించవలసి వచ్చింది. నందనవనంలా వుండే శ్రీనివాస్‌రావ్ జీవితాన్ని వందన తన పగ, ద్వేషాలతో వందన సమర్పణ గావించిం దని మేమూహించుకొన్నాం.

మిగతా కథలన్నీ చెప్పతోతగ్గటులేవు. మామూలుగా వున్నాయి.

జ్యోతి ప్రచురణ కర్తలకు, జ్యోతి పాఠకులకు ఉగాది శుభాకాంక్షలు తెలియచేస్తూ.

—యం. ప్రభాకర్, బెంగళూరు.

మార్చినెల ప్రహేళికలో ఒక ఆధారం తప్పుగా యిచ్చారు. "8 అడ్డం" "గమ్యం" అవుతే 9 నిలువు "వ్యంగ్యవైభవం" యెలా అవుతుంది? ఆ గడిలో రెండవ అక్షరం "మ్యం" అవుతే "వ్యం"గా ఎలా వూహించుకోగలం? ఎంతో మందిని ఇన్నాళ్ళూ "తప్పు"లో కాలే యించిన శ్రీశ్రీ ఈసారి వారే ఆ పని చేశారు.

శ్రీశ్రీతో ముఖాముఖి బాగుంది. కానీ "పిచ్చాసుపత్రి" కట్టించింది "ఐరిస్ డేన్ స్విఫ్" అని శ్రీశ్రీగారు వెనక అన్నట్లు నాకు గుర్తు. "జొనాదన్ స్విఫ్ట్" కాదు (లేక ఇద్దరూ ఒక రేమో నాకు తెలియదు).

ఫిబ్రవరి ప్రహేళికలో 4 నిలువు ఆధారం కూడా తప్పని నా అభిప్రాయం. వారిచ్చిన ఆధారం ప్రకారం "మామ్మలు" జవాబు రాదు.

—ఎన్. కె. రామారావు, నల్లకొండ.

---

[మార్చినెల పదబంధ ప్రహేళికలో 8 అడ్డం 'గమ్యం' గానూ 9 నిలువు వ్యంగ్యవైభవం గానూ జవాబు ఇవ్వడం జరిగింది. ఇది కూర్పులో పొరపాటే. ఈ విషయం మా దృష్టికి తెచ్చిన పాఠకులకు కృతజ్ఞతలు. ఈ విషయాన్ని పదబంధ ప్రహేళిక నిర్వాహకులు శ్రీశ్రీ దృష్టికితేగా 'తొందరలోపొరపాటు పడినట్లుంది ఆ రెండు గదులూ వదిలేసి ఆల్ కరెక్ట్ ఎంట్రీ లేవైనా వున్నా వారికి బహుమతి ఇవ్వండి.... సారీ ఇలా జరిగినందుకు' అన్నారు. అయితే అప్పటికే ఏప్రిల్ పదబంధ ప్రహేళిక సమా ధానాల పరిశీలన పూర్తి అయి విజేతల జాబితా కూడా తయారయిపోయిన కారణంగా, మార్చి పదబంధ ప్రహేళిక సమాధానాలు పునః పరిశీలించలేదు. జరిగిన పొరపాటుకు చింతిస్తున్నాము. —ఎడిటర్]

## "నెజ్హా" తేదీ మార్పు

జనవరిలో జరగవలసిన "నెజ్హా" నాటక కళాపరిషత్తు అనివార్య కారణాల వలన మే నెలకు మార్చబడినది. ఈ సందర్భముగా రాష్ట్రి స్థాయిలో నాటక, నాటిక ఏకపాత్రాభినయ పోటీలు జరుగును. వివరములకు నెజ్హా నాటక కళాపరిషత్తు, నియర్ లీలామహల్ నెల్లూరు 524001కు వ్రాసి తెలిసికొనవచ్చును. 



# మయసభ

## కంప్యూటర్ సాహిత్యం

సుప్తచైతన్యపు చీకటి కోణాలను వెలుగులోకి తేవడానికి యత్నించిన సిమండ్ ఫ్రాయిడ్, మెంతికూర మాధవీలతగారి బహుమతి నవల- "ఎర్రని ఆకాశంలో నల్లని మేఘశకలాలు—" చదివాడా అంటే చెప్పలేముగాని.... ఆయన 'డ్రీమ్ తియరీ' మాత్రం మొన్నొక రోజు గుర్తుకొచ్చింది.

ఆ రోజు రాత్రి మాంచి నిద్రలో వుండగా-

"సాహిత్య అకాడమీలాటి నలభై దళాల పద్మం మీద కూర్చున్న ఒక మూర్తి దర్శనమయింది. ఆ మూర్తి అర్ధనారీశ్వరుడిలా సగం మగ, సగం ఆడాగ వుంది. దానికి నాలుగు చేతులున్నాయి.

"ఒక చేతిలో పెద్ద కలంవుంది. సుమారు 200 అరతావులు ఒకేసారి రాయగల సిరా పట్టేంత పెద్ద కలం అది. ఆ చేతిలోని ఆ కలం చకచకమని రాసుకుపోతుండగా, టెలిప్రింటర్ నుంచి వచ్చినట్లుగా కాగితం చుట్టలు చుట్టలుగా నేలకు రాలుతున్నది.

"ఇంకొక చేతిలో మార్క్స్, హెరాల్డ్ రాబిన్స్, ఈనిడ్ బ్లైటన్‌ల రచనలు తెరిచి పట్టుకున్నట్లుగా వున్నాయి.

"మూడవ చేతిలో చెక్‌లు, డ్రాఫ్టులు, కరెన్సీ నోట్లు, ప్రేమతో ప్రొడ్యూసరు కట్టిచ్చిన ఇంటి రిజిస్ట్రేషన్ కాగితాలు — ఇత్యాది ఐశ్వర్య సంకేతాలున్నాయి.

"ఆఖరి చేతిలోని సినిమా నెగిటివ్ రీలు ఒక జపమాల వలె అలంకరించివుంది.

"ఈ నాలుగుచేతులూ చైతన్యపు మూర్తుల వలె చకచకమని ఆడుతోండగా ఆ అర్ధనారీశ్వర మూర్తి "సాహిత్యము - ప్రయోజనము" వంటి భారీ విషయాలపై అభిభాషణలు వర్షిస్తూంటే పత్రికలవాళ్ళూ, అకాడమీలవాళ్ళూ ఆ ముత్యాల నేరుకుంటున్నారు. ఆ మూర్తి కీర్తి కాంతుల్ని చూడాలంటే కళ్ళు భ్రమిసి పోతున్నాయి. ఆ లక్ష్మీ - సరస్వతీ సంగమ వైభవాన్ని వినుతించాలంటే భాష చాలడం లేదు—"

హఠాత్తుగా మెలకువ వచ్చింది.

గ్లాసెడు మంచినీళ్ళు తాగాను.

'నిన్నంతా హాయిగానే గడిచింది, తృప్తిగా భోంచేసి పడుకున్నాను కదా, మరి యిలాంటి పీడకల ఎందుకొచ్చింది చెప్మా'—అని ఆలోచిస్తుంటే గుర్తుకొచ్చింది.

నిన్న సాయంత్రం మిత్రుడు నారాయణరావు, వాడిభార్య నిర్మలా వచ్చారు. ఏదో కాసేపు కులాసాగా గడిచింది. అప్పుడుచెప్పాడు వాడు "మేమిద్దరం కలిసి "నానీ" అనే పేరుతో

ఏ. రామసంజీవి

నవలలు రాస్తున్నామోయ్——"

నేను ఆమాట జీర్ణించుకోకముందే "రెండు నవలలు వారపత్రికల్లో మొదటి బహుమతులు తెచ్చుకున్నాయి, ఒకటేమో ఆకాశవాణి సీరియల్ చేస్తూంది. ఇంకోదాన్ని దానాలపాటి అప్పయ్యచౌదరిగారని మాంచి 'పేస్తున్న సినిమా ప్రొడ్యూసరులే ఆయన "లేపుకు రా!" అని వందరంగుల కావ్యఖండం తీస్తున్నాడు. ఇంకో మూడు రాయడానికి ఆరేసి వేలు చొప్పున అడ్వాన్సు పుచ్చుకున్నాం" అన్నాడు.

మరో అరగంటవుండి, "నానీ" దంపతులు వెళ్ళిపోయారు. మరి వారికి కాలమే మూల్యం కదా!

అదీ సంగతి! ఆ రాక కారణంగా రాత్రి ఆ కల వచ్చింది. 'అమ్మ ఫ్రాయిడూ బలే వాడివోయ్' అని నవ్వుకున్నాను.

ఇది రెండేళ్ళనాటి మాట.

కాని గతవారం ఒకచోట ఈ కవిత చదివాను.

"ఈ జీవితం సృజిస్తున్నవి
అవి ఏమిటి?
అబద్ధాల
శాశీల
ప్రతిబింబాలు!
మంచి పనుల మీంచి
కాలం సాగిపోతుంది
నక్షత్రాలు దిగాలుగా
ఆకాశంలో తిరుగుతున్నాయి
జనులు, పాపం
నవ్వలేకుండా వున్నారు."

ఆహా ఏమి ఆ పదును! ఏమి ఆ సరికొత్త ఇమేజరీ

ఈ కత రాసిందెవరు?
అది ఒక కంప్యూటరు
దానికి పేరులేదు; నెంబరుంది
ఆ నెంబరు ఆర్ సి ఏ 301
ఆ కంప్యూటర్ యంత్రానికి తెలిసిన మొత్తం పదాల సంఖ్య 130 మాత్రమే!

నాలుగేసి పాదాలున్న కవితలను నిముషానికి 150 చొప్పున అవలీలగా అల్లి అవతల పారేస్తుందిష!

కేవలం 130 పదాల జ్ఞానంతో నిముషానికి 150 కవితలు అల్లడం అంటే మన నవలాకారులు, కారిణులు ఎంత వెనకబడివున్నారో తెలుస్తుంది.

నవల రాయాలి అంటే ఆ వ్యక్తికి కనీసం 500 పదాలయినా తెలిసి వుండాలా? పోనివ్వండయ్యా, చచ్చి చెడి అ-యి-దు-వ-న్-ద-ల పదాల్ని నేర్చుకున్నారు. వాటితో ఒక నవల రాయాలి అనుకోండి "200 అరరావులకు మించకూడదు" అని కదా సంపాదక మహాశయులు నిర్దేశిస్తుంటారు. అంచేత ఈ 500 పదాలతో 200 పేజీల నవల రాయాలి అంటే కనీసం రెండు రోజులన్నా పడుతుందో లేదో అన్నది నా ప్రశ్న!

అంటే ఏమిటి?

మన ఫాస్టెస్ట్ రచయిత్రికి 48 గంటలు పడుతుంది ఒక నవల రాయడానికి; అదే ఆర్‌సిఏ-301 కంప్యూటర్, అయితే నిముషానికి 600 పంక్తుల చొప్పున (600 పంక్తులు 30 అరరావులు అనుకుంటే) 200 పేజీలను మహా అయితే ఆరేడు నిముషాల్లో కానిచ్చేస్తుంది. కాకపోతే నవలకు "చిమ్మని చీకటిలో కమ్మని కాంతిరేఖ" అనో లేక "చెల్లని గవ్వలలో చల్లని గువ్వలు" అనో, ఏమి టైటిలు పెట్టాలి అనే ఇంపార్టెంట్ కొశ్చెన్ దగ్గర ఇంకో నిముషం పట్టవచ్చు. మొత్తంమీద ఎనిమిది నిముషాలకే సీరియల్!

ఎనిమిది నిముషా లెక్కడ?

48 గంటలెక్కడ?

కంప్యూటర్ సాహిత్యంలో 'రాశి'మాత్రమే కాదు 'వాసి' కూడా కలదు. కలదు అని చెప్పే ఉదాహరణలు ఎన్నో వున్నాయి.

మాంచెస్టర్ యూనివర్శిటీ వారి కంప్యూటర్ సృష్టించిన ప్రేమలేఖను చూడండి.

"నా బుల్లి పెన్నిధీ! నీ లేత ఆనందం పాదాలవద్ద నా శ్రద్ధ పడిగాపులు కాస్తూంది. నువ్వు నా ప్రేమానురాగానివి; నువ్వే నా విస్తరించే అనురక్తివి. రహస్యపు శ్వాసలతో, సోదరభావంతో, నీ అనుంగు విరహంకోసం

ఎదురు తెన్నులు చూస్తున్నాను. ఎగ్రాకే నీ ఆశాలతకు నా ప్రేమ ప్రాణమవుతుంది.

ప్రేమతో వేగిపోతున్న నీ—"

రెండు చేతులున్న ఏ మనిషి రాసిన ప్రేమ లేఖకు ఇది తీసిపోతోంది, చెప్పండి!

ఫ్రెంచి కంప్యూటర్ 'కేలిప్స్' విరచించిన అధివాస్తవికతా భరితమైన కధలో ఒక భాగం చిత్తగించండి:

"నా దిఙ్మండలంమీద సెగల పొగలుకక్కే ఎర్రటి తెర; తెర కవతల లీలగా రివిగా, వేదనా భరితురాలయిన స్త్రీమూర్తి. ఆమె ఉత్తమ కుల సంజాత; బహుళ ఋతువులలో ఒకటి ఆమె మాత అయి వుండనోపు. ఆమె వీడ్కోలు చెబుతోంది. నా కంతకన్న ఏమీ కనిపించడం లేదు. తెరవైపు నడుస్తున్నాను. వణికే చేతులతో ఆ తెరను విడదీశాను. ఆ తెర కవతల? చారలతో చీరుకుపోయిన నేల ఎండిపోయినచెట్ల కొమ్మలమీద కెగిరివస్తున్న పక్షులు. అక్కడ కదలకుండా ముడుచుకు పడివున్న కవాళం, దానిమీద ఎక్కడిదా హిమం? ఒకబ్బాయి, బొద్దుగా వున్న చేతుల్నూపుకుంటూ పరుగెత్తుకు వస్తున్నాడు."

అదీ కథ. .

ఇలాగ కధలు, కవితలు, పాటలు-హైక్లాసు వంటని సెకెండ్లమీద వండి, వార్చి, వడ్డించే కంప్యూటర్లు సాక్షాత్తూ యంత్ర సరస్వతులు.

ఎటూ మన అక్కగారో, బావగారో, వదిన గారో అమెరికాలోనో ఇంగ్లాండులోనో సెటిలయి వుంటారు గనుక కష్టపడి ఇలాంటి కంప్యూటర్‌ను తెప్పించుకుంటే — ఒక్కసారిగా ఆరు వారపత్రికలకు, నాలుగు దిన పత్రికల ఆదివారపు అనుబంధాలకు, పన్నెండు మాసపత్రికలకు, మూడు సినిమాలకు కలిపి— వారం అంటే వారం రోజుల్లో చురుగ్గా నవల్స్ రాసి పడేయొచ్చుకదా!

ఇహ పత్రికా యజమానుల కంటారా— ఇలాంటి కంప్యూటరుంటే బోలెడంత వెసులు బాటు కేవలం కంపోజిటర్ల సాయంతో వార, మాస పత్రికలూ, ఫోర్మెన్ల సాయంతో దిన పత్రికలూ నడిపే చీఫ్ ఎడిటర్లకూ, మేనేజింగ్ ఎడిటర్లకు ఇది వరప్రసాదం. ఆ కంప్యూటరుండి, ఇటొక 'మోనో' లేదా ఒక 'లైనో' యంత్రం వుంటే ఇహ చూసుకోండి ప్రతి జిల్లాకొక దిన పత్రిక, ఊరికో వార పత్రిక, పేటకో మాస పత్రిక వెలయించ వచ్చును.

అప్పుడిహ తెలుగు పత్రికా ప్రపంచంలో, తెలుగుసాహితీ లోకంలో విప్లవం వచ్చేసినట్లే!

రచయితలు, పత్రికాధిపతులు, సినీ పీఠాధిపతులు అందరి పండగా పండినట్లే!!

అంచేత—
పదండి ముందుకు
కంపు సాహిత్యం నుండి
కంప్యూటర్ సాహిత్యం వైపుకు
పదండి పోదాం
పోదాం పోదాం పైపైకి!



# శ్రాద్ధత్రయ ప్రయోజన యోగం!

విఠోబా, వినోబా, వింతవిగ్గు స. స. బా,
ఇలాంటి ఇమేజి డ్రెయినేజీలో దిగిపోతే జనాభా
చెయ్యోద్దా గిలాబా, కాళ్ళోద్దా మతాబా?

**1**

తిరపతికెళ్ళి, కిందచేడు పొందిన ఆ అనుభవం, మరచిపోలేను
గిరగిర తుళ్ళి పడిపోయినట్టు అవుతుంది, తలుచుకుంటే ఆ సీను!
ఏమా గీతాకారుల చురకత్తుల కసరత్తులు!
మీ (మా) టోపీదారుల పై ఎత్తుల వలుజిత్తులు!
కళ్యాణ కట్టలో కట్టు తెగింది ఆ దినం కుచ్చుకుచ్చుల కృష్ణ చైతన్యం!
ఒక్క రోజులో పాతికవేల రౌండ్స్! మరెక్కడ ఇంతటి భక్తసాయుధ విప్లవం!!
మనం సాధించిన ఒకే ఒక వరల్డు రికార్డు, ఓయబ్బో ఎంత నునుపు!
మనుషుల మాటకేంగాని, మన 'దేవా దయ్యాల శాఖ' మటుకు ఏం పదును!

**2**

సంపూర్ణ గోవధా నిషేధం జరిగిన రాష్ట్రాల్లో మాత్రం
ఎవరు పాటించారని శాసనం కేరళ బెంగాల్స్ మీద నీ కోపం?
ఎనుబోతుని ఇవ్వకపోతే బలి, జరగదే, ఆంధ్రలో అమ్మవారి సంబరం!
అత్యవసర స్థితిలో చక్కగా బిగించావు కంఠం, ఇప్పుడా నీ నిరశనవ్రత టాం టాం?
లాభం లేదనం. సాధువు కాదనం. ప్రత్యేకించి పవిత్రం అంటే ఒప్పుకోం.
పోనీ నీ విశ్వాసాల విష్ణువే దశావతారాల్లో ఇచ్చారు కాదేం, ఆవుకి స్థానం?
పేదరికం నిరుద్యోగం ఇలాంటి సమస్యలతో ఇప్పటికే చస్తున్నాం మహానుభావా,
మత రాజకీయాల కలగలుపు ఈ పేడకంపు, ఈ వయసులో నీకిదేం ఇంపు, వినోబా!

**3**

పటాలకి ఫ్రేములు కట్టే వాచీషాపు మొదలియారు మొదలు
పటాలాలకి భామల్ని అంటకట్టే మిల్ట్రీ మీననేత్రి వరకు
వ్యాపారికి ప్రతిరోజూ వెయ్యి పైన లాభం. నిజమే!
వారానికి అందులోంచి అణుమాత్రం దానం చేస్తే
'నారాయణ సేవ'ట అది! ఎంత జిగురు మీ కబురులు!
ముష్టిది ఆ సుబ్బలక్ష్మి ముందెందుకు మీ బతుకులు?
అక్కపోయి ఆమె బావ 'నారాయణ' మతి చేడితే
ఏకాంతపు 'సేవ' చేసి అతని బతుకు నిలిపిందే!

మీ అందానికి తగిన
మిల మిల మెరిసే చీరెలు
కంచి, ధర్మవరం, బెంగుళూరు, బెనారస్, ఆరణి వచ్చాయి!!

వేలకొలదిరకాలు
గ్యారంటీ వెండి
జరీతో తయారైనవి
లభించును

# లక్ష్మి జనరల్ స్టోర్స్

గవర్నరుపేట, విజయవాడ-2
గ్రామ్స్: గిష్ట్లా, ఫోన్: 73467, 77052





మినీ కథ

# డిగ్రీ

అలిమేలు తన భర్త వెంకటేశాన్ని వేధించుక తినసాగింది.

ఇంటికి చుట్టుప్రక్కల అన్ని ఇండ్ల ముందు నేమ్‌బోర్డులున్నాయి.

ఇరుగు మేడమీదనున్న కామాక్షి మగడు ఆర్.డి.రంగారావు,యఫ్.ఆర్.ఈ ఎస్(లండన్)

పొరుగింటి మీనాక్షి మగడు డా॥ భుజంగం ఎమ్. బి బి. ఎస్.

ఇంకా అవతల భవనంలో ఒకాయన బోర్డు మీద చాలా పొడుగు డిగ్రీ వుంది.

పరిసరాలంతా మంచి భవనాలు వున్నాయి. భవనాలలో పెద్ద పెద్ద ఉద్యోగాలవాళ్ళున్నారు.

వాళ్ళకు పెద్ద పెద్ద డిగ్రీలు వున్నాయి.

అలిమేలుకు దిగులు పట్టుకున్నది.

తనకు పెద్దయిల్లు లేకపోతే పోనీ, పెద్ద వుద్యోగమున్న భర్త కాకపోతే పోనీ, ఆ భర్తకు కనీసం ఒకడిగ్రీ అన్నా వుండకూడదూ!

దానికి కూడా తన భర్త నోచుకోలేదా?

"ఏమండీ వాళ్ళందరూ స్టీలుబోర్డులు వేసుకుంటే వేసుకున్నారు. మనం కొయ్యబోర్డు వేసుకుంటాం. ముందు మీరొక బోర్డు రాయించి బయట ద్వారానికి బిగగొట్టించండి. మంచి డిగ్రీ వ్రాయించండి. కనీసం నాలుగు ఇంగ్లీషు అక్షరాలన్నా వుండాలి."

"అలివేలూ! ఇరుగు పొరుగుల అట్టహాసం చూచి నువ్వూ వుబలాట పడుతున్నావుగాని, వాళ్ళ మొగుళ్ళు చదువుకుని డిగ్రీలు వేసుకున్నారు. నేను చదువలేదుగదే నాకు డిగ్రీ ఎట్లా వస్తుందే?

"ఏమో! అదంతా నాకు తెలియదు. రేపు సాయంత్రానికి బోర్డు వుండాల్సిందే, బోర్డు పైన డిగ్రీ రాయాల్సిందే" అన్నది.

"ఓసి నీ దుంప తెగా! ఏ పట్టుపడితే ఆ పట్టేనే" అని నాలుక కరుచుకున్నాడు. తనకు నూకలు చెల్లితేనే కదా దాని దుంప తెగడం.

ఇంటిలోని పోరు ఇంతింత కాకుండా కొండంత ఐంది.

ఇక తప్పదు ఆలోచించాడ

డిగ్రీ ఏమని పెట్టాలి?

ఒక ఆలోచన తట్టింది.

సాయంత్రానికి బోర్డు చేయించి తగిలించాడు ద్వారానికి.

"ఎస్. వెంకటేశం, హెచ్.ఒ.ఎ.యమ్.టి."

అలివేలు చాలా సంబరపడిపోయింది. చక్కగా సింగారించుకుంది. ఇరుగు పొరుగు అమ్మలక్కలు వారి వాకిలివద్ద చేరారు.

అలివేలు కూడా తన వాకిలివద్ద చేరి తానూ ఆ నేమ్ బోర్డును నాజూగ్గా నిమురుతూ, "నన్ను చూడు, మా ఆయన అందమైన నేమ్ బోర్డును చూడమ"న్నట్లు వయ్యారంగా నిలబడింది.

అందరు అమ్మలక్కలూ ఆ నేమ్‌బోర్డు చూచారు. డిగ్రీ అర్థం కాలేదు.

తమ భర్తలను అడిగారు. "హెచ్. ఓ. ఎ యం. టి" అంటే ఏమిటని.

అంతంత చదివిన ఆ భర్తలకూ ఆ డిగ్రీ అంతుబట్టలేదు. తల పగులగొట్టుకున్నారు. అబ్రీవియేషన్ల పుస్తకం తీసుకుని వెతికారు, దానిలో కూడా లేదు.

ఏమిటా డిగ్రీ? ఎలా తెలుసుకోవాలి?

మరుసటిరోజు ఎదురింటి సర్వేశం వెంకటేశాన్ని పిలిచి, కాఫీ యిచ్చి, మర్యాదచేసి, ఆ డిగ్రీ ఏమిటని అడిగాడు.

"అది చెప్పకూడదులేండి!" అంటూ లేచాడు వెంకటేశం.

చుట్టుప్రక్కలవారంతా అలాగే సత్కరించి అడిగారు.

కాని సత్కారాలు అందుకుని సమాధానం దాటవేశాడు వెంకటేశం.

చుట్టుప్రక్కలున్న భార్యాభర్తలకు అది ఒన్ మిస్టరీ ఐంది.

ఇంతకీ ఆ డిగ్రీ చెబితే వెంకటేశం చుట్టుప్రక్కవారి దృష్టిలో నవ్వులపాలవుతాడు.

చెప్పకుంటే కథ పూర్తికాదు. పూర్తిచేయలేకపోయినందుకు నేను నవ్వులపాలవుతాను.

ఆ డిగ్రీ "హజ్బెండ్ ఆఫ్ అలివేలు మంగ తాయారు."

—పచ్చిపులుసు వెంకటేశ్వర్లు.

# గాది స్వగతాలు

## శ్రీ శ్రీ

### అభ్యుదయ కవి స్వగతం

మాస్కోకు నమస్కారం
మస్కారాయుళ్ళకు తిరస్కారం
తిరుగులేని పురోగాములు
సత్కవులకు లాక్ సలాములు

పెదవిమీద సామ్యవాద మంత్రం
హృదయంలో ధనికవాద తంత్రం
భావకవులతో నా పొత్తూ
విరసం పోకడ నా కొద్దూ

హింసకు విడాకులిస్తాను
కంసరాజ్యమే తెస్తాను
ధ్వంస కాండ నిరసిస్తాను
హంసగీతి పలవిస్తాను

నిన్నటి కివాళ రేపయితే
రేపటి కివాళ నిన్నకదా
తండ్రికి జనకుడు తాతయితే
తాతకు తనయుడు తండ్రి సుమా
గతి తర్కంలో పసలేదు
తిరుగుబాటు కూటికి రాదు
ఈ ఉగాది శుభసమయాన
శ్రోతల కిదె నా నజరానా

### గుమాస్తా స్వగతం

నేను కోనేటి రావుని
సహస్ర కోటి సర్కారు కార్ఖానాల్లో
అనంత కోటి గుమాస్తాలలో ఒకణ్ని
నేను కోనేటి రావుని మాత్రమే కాదు
సుబ్బారావుని షఖాన్‌ని సులేమాన్‌ని
ఏనోకు నేనే యాకోబు నేనే
నాకున్నన్ని పేర్లకన్న ఎక్కువపేర్లు
ఏ హిందూదేవుళ్ళకో వున్నాయి
నేనూ సర్వాంతర్యామినే
కాని గంతవ్యం లేని నా గతి క్షంతవ్యం

ఓహో కొత్త ఉగాది వచ్చింది
కొత్తపన్నులు తెచ్చింది
కొత్త బాధలు గుచ్చింది
ఇంట్లో ఈ యేడాది లోగా
ఇంకో కొత్తబిడ్డ గ్యారంటీ
అంటుంది మా ఆవిడ
కుటుంబ నియంత్రణకు నేను సుముఖుణ్నే
కాని శస్త్రవైద్యానికి జడుస్తోంది
నా భార్యామణి

భూలోక స్వర్గం ఎక్కడుందో గాని
మా యిల్లు ప్రత్యక్ష నరకం
తాకట్టు పెట్టిన నగలూ నట్రా
చెంబులూ తప్పేలాలూ
తాకట్టు పట్టిన వాడి యింట్లో
జలతరంగిణి మోగిస్తుంటే
అప్పులవాళ్ళు మగతనిద్ర పోయే
నా కనురెప్పల కింద
రంగ రంగ వైభోగంగా
రాక్షస నాట్యం చేస్తున్నప్పుడు
చలి దన్నంలో రకరకాల పురుగులు
ఆకలి ఆకలి అనే అక్షరాలు రాస్తున్నప్పుడు
ఆహా ఉగాదిని తలచుకుంటేనే
ఒళ్ళు జలదరిస్తోంది

అయినా పర్వాలేదు
ఒక్క యేడాదిపాటు ఓపిక పడితే
ఈ కొత్త సంవత్సరం పాతదయిపోతుంది
అయితే ఒక్కటే సమస్య
అంతదాకా మా దినాలు తెల్లారడ మెలాగని

### జోహుకుం కవి స్వగతం

ఏడాది కొత్తదే ఐనా
పాడేది పాతపాటేనా
ఈ గతాను గతత్వమేనా
ఎవరు చెప్పే తత్వమైనా

కొత్తమీదే నాకు మక్కువ
నవత మీదే మమత ఎక్కువ

పాతమంత్రులు పోతుంటారు
కొత్త సచివులు వస్తుంటారు
పాత రోతని వదిలేస్తాను
కొత్తవారినే పొగిడేస్తాను
ఈ వ్యవస్థని నేనూ తిడతా
కొత్త వ్యవస్థకి హారతి పడతా
కాని దీని పునాదులు కాస్తా
కదలకుండా కాపలాకాస్తా
ఆదర్శాలే వల్లిస్తాను—కవు
లందరి ఊహాలు నొల్లేస్తాను
అస్తమానమూ ఇంటా బయటా
అహింసాగాన మాలాపిస్తా
దేవుడి దీపాలార్పెయ్యాలను
నాస్తికులమీద కత్తులు దూస్తా
అస్త్రహక్కులే ఆరాధిస్తూ
అన్ని హద్దులూ తుడిచేస్తా
ఎన్ని దిక్కులో ఆలోకిస్తూ
ఇహంతో పరం ముడివేస్తా
అడుగునపడి అలమటించు
బడుగుజనం బాధ పంచు
కొను కవితలు తెగ రచించు
తూ ధనవంతులు వసించు
అయిదంతస్తుల భవంతు
లందు తీసుకొని నా వంతు
కమలంలో వమనం చేస్తా
మేఘంలో స్నేహం చూస్తా

## సామాన్యుని స్వగతం

ఎన్ని ఉగాదులు రాలేదు ఇం
కెన్ని ఉగాదులు పోలేదు
ఎక్కడి దొంగలు అక్కడే
ఎక్కడి గొంగళి అక్కడే

అతుకుల బ్రతుకే ఎంతో భారం
చావలేక జీవిస్తున్నాను
నాకూ నవ్వుకు చాలాదూరం
నవ్వలేక ఏడుస్తున్నాను

అక్కరలేదని చీకటిలోనే
ఆత్మగౌరవం పారేశాను
నన్ను చూసుకుని నాపై నేనే
జాలి పొందడం మానేశాను
నెత్తి నోరూ మొత్తుకొనీ
ఇది నా కర్మని ఒప్పుకొనీ
భారతమాతకు జై అంటాను
ఏ పనికైనా సై అంటాను

## విప్లవ కవి స్వగతం

అంతా వింటున్నాను—కళ్ళు తెరచి నే
నంతా కంటున్నాను
తరతరాలుగా నరనరాలలో
గూడు కట్టిన మూఢ విశ్వాసాలు
కూలిపోవా లంటున్నాను
వీధి మానిసుల వీరావేశం
క్రోధ భయంకర హృదయోద్వేగం
విజృంభించి పొంగెత్తే సమయం
సమాజాన్ని ముంచెత్తే తరుణం
త్వరలో వస్తుందంటున్నాను అంతా వింటున్నాను
యథాస్థితిని నిలబెట్టాలను
వృథా ప్రయత్నం తుదముట్టాలని
పాతకి గోరీ కట్టాలని
కొత్తకి భేరీ కొట్టాలని
చాటిస్తున్నాను—మరీమరీ ఉద్ఘాటిస్తున్నాను
ఎంద రడ్డుకున్నా ఇంకెందరు వద్దన్నా
మార్పు వచ్చితీరుతుంది ఎందుకంటే
కాలం పరిణామశీలం
దాన్ని మనకనుకూలంగా మలచుకోవ
డమే ప్రధానం

అవినీతి గుండెల్లో బాకులు
అన్యాయపు డొక్కల్లో తుపాకులు
సామాజిక విప్లవ సమరం
చచ్చుపుచ్చు సంస్కృతి మరణం
ఇదే నేటి సత్యం
తూరుపునుంచి తమస్సును దూసుకొనివచ్చే
ఉషస్సును మోసుకొని తెచ్చే
ఐరావతం లాగ శాంతి పారావతంలాగ
ఉదయిస్తుంది నవయుగాది
అదె మనకుగాది

[ఆకాశవాణి సౌజన్యంతో]

(పై స్వగతాలలో మొదటిది ప్రసారం కాలేదు)

సీరియల్

# స్వప్నసింహాసనం

## యద్దనపూడి సులోచనారాణి

## 9

“స్వప్నా!” మృదు గంభీర స్వరంతో పిలిచాడతను.

స్వప్న పలకలేదు. అతను రెండడుగులు వేసి లోపలకి వచ్చాడు.

“స్వప్నా!” మరోసారి పిలిచాడు.

స్వప్న కళ్ళు తెరిచింది. ఆ కళ్ళు నిద్రమత్తులో భారంగావున్నాయి. గాఢ సుషుప్తిలోనుంచి యివతలకి వచ్చిన అవి, ఒక్క క్షణం తన యెదుటవున్న వ్యక్తిని యెవరా అన్నట్టు అలాగే చూస్తుండి పోయినాయి.

“స్వప్నా!” చిరునవ్వుతో పలకరించాడు.

స్వప్న ఉలికిపాటుగా, వాలి సరిగ్గా కూర్చుంది. ఎదురుగా చిరునవ్వుతో నిలబడిన సుధీర్‌వైపు క్షణంసేపు అయోమయంగా చూసింది! ఒక్క నిముషం తను యెక్కడ వున్నానో గుర్తు రానట్లుగా, ఆ గదిని కిటికీని, పరదాలని పరిశీలించింది.

“డాక్టరుగారు అవతల గదిలో వున్నారు.” అన్నాడు.

స్వప్నకి గుర్తుకు వచ్చింది. రైలు దిగగానే, సరాసరి డాక్టర్ దగ్గరకి వచ్చేసింది. ఆయన స్వప్నను చూసి తెల్లబోయారు. ‘డాక్టరు, ఒక్కరోజు నాకు ఆశ్రయం యివ్వండి! నాకు చాలా అలసటగావుంది. నిలబడ లేనంత నీరసంగావుంది.’ అంది.

డాక్టరుగారు స్వప్నని లోపలికి తీసుకువచ్చారు. కాఫీ తెప్పించారు. స్వప్న ద్వారా క్లుప్తంగా జరిగినదంతా విన్నారు. ఆయన సమాధానంగా ఏమీ అనలేదు. స్వప్నని విశ్రాంతి తీసుకోమని యివతలకి వచ్చేసారు.

## జరిగిన కథ :

తనని బలవంతం చేసిన పొరుగింటి మోహన్‌ను ఆత్మరక్షణార్థం చేతికందిన వస్తువుతో కొట్టింది స్వప్న. మోహన్ మరణించాడు. స్వప్నపై హత్యానేరం మోపబడింది. ఆ షాక్‌తో స్వప్న తల్లి చనిపోయింది. స్వప్న మేనమామ లక్ష్మీరంజనం స్వప్నను కాపాడమని తన శిష్యుడు సుధీర్‌ను కోరాడు. సుధీర్ తన ప్రతిభతో స్వప్నకు శిక్షపడకుండా చేశాడు. స్వప్నకు సీరియస్‌గా వుందన్న కబురు తెలిసి పార్టీనుంచి ఆందోళనగా వెళ్ళాడు సుధీర్. స్వప్నను హాస్పిటల్‌లో చేర్పించాడు. సుధీర్ సహాయం వద్దనుకొనికూడా పొందవలసే వచ్చింది. స్వప్న మేనమామ వెంట వాళ్ళింటికి వెళ్ళింది. మేనమామ భార్య రుసరుసలాడింది స్వప్నని చూసి. మేనమామ భార్య తనకు బలవంతంగా పెళ్ళి ఏర్పాటు చేస్తే తప్పించుకు పారిపోయింది స్వప్న. ఒక డాక్టరు మిత్రుడు ఫోన్‌చేస్తే వెళ్ళిన సుధీర్ పెళ్ళిదుస్తుల్లో వున్న స్వప్నను అక్కడ చూసి ఆశ్చర్యపోయాడు.

అక్కడ ఆయనకోసం వేచిచూస్తూ పేషెంట్స్ కూర్చునివున్నారు। వాళ్ళని పరీక్ష చేయటంలో మునిగిపోయిన ఆయన అసలు స్వప్న విషయమే మర్చిపోయారు. 6 గంటలు అవుతుండగా, ఎందుకో లోపలికి వస్తే, లోపలిగదిలో గోడకి తల ఆనించి గాఢనిద్రలోవున్న స్వప్న కనిపించింది. ఆయన తన మతిమరుపుకి తనే విసుక్కుని, వెంటనే వెళ్ళి సుధీర్‌కి ఫోన్ చేసారు।

పావుగంటలో అతను రానే వచ్చాడు.

సుధీర్ తనని చూడటానికి వస్తాడని స్వప్న కలలో కూడా అనుకోలేదు. అందుకే అతను కళ్ళెదుట కనిపించగానే, ఏం మాట్లాడాలో తెలియనట్టయింది. బెంచీ మీద కూర్చున్న దల్లా లేచి నిలబడింది.

"స్వప్నా! బాగున్నావా!" అతనే పలకరించాడు.

సమాధానంగా తల వూపింది.

సుధీర్ అన్నాడు

"డాక్టర్‌గారు నాకు అంతా చెప్పారు। నువ్వు ధైర్యంచేసి యిలా రావటమే మంచి పని అయింది."

స్వప్న వింటోంది. "డాక్టరుగారు నీకు ఏదో ఒక యేర్పాటు చేస్తారు. నీ భవిష్యత్తు గురించి నువ్వేం దిగులు పడకు"

స్వప్న తలెత్తి అతని వైపు చూసింది. అతనిముఖం చిరునవ్వుతో స్నేహపూర్వకంగా వుంది.

"స్వప్నా! కొంతమందికి జీవితాలు రాచబాటల్లా వుంటాయి. మరి కొంత

మందికి, మిట్ట పల్లాలుగా వుంటాయి. మిట్టపల్లాల్లో నడిచిన వ్యక్తికే జీవితం జీవించటంలో అద్భుతం ఏమిటో అనుభవం అవుతుంది!"

స్వప్న చురుగ్గా తలెత్తి చూసింది. అతను స్వప్న నుదుటమీద చెమటకి తడిసి, సగం చెరిగిన ఆ కళ్యాణ తిలకమే చూస్తున్నాడు. అది గమనించగనే స్వప్న చప్పున ముఖం తిప్పుకుంది.

"మీ మామయ్యకి నువ్వు యిక్కడకి వచ్చావని నేను ఉత్తరం వ్రాయనా? నువ్వు వ్రాస్తావా?"

"మీరు....మీరే....వ్రాయండి. దయయుంచి నా కోసం మాత్రం రావద్దని వ్రాయండి."

"అలాగే!"

"నువ్వుకూర్చో! నేను డాక్టరుగారితో మాట్లాడివస్తాను."అతను వెళ్ళిపోయాడు.

అరగంట అనంతరం, ఇద్దరూ మళ్ళీ లోపలికి వచ్చారు. సుధీర్ తనే చెప్పాడు. "స్వప్నా! డాక్టరుగారు, నువ్వు వాళ్ళ హెడ్‌నర్స్ మరియందగ్గర వుండేట్టు మాట్లాడారు! నీకు ఏదయినా దారి దొరికే వరకూ, ఆమె దగ్గర వుండవచ్చు."

స్వప్న డాక్టరుగారి వైపు కృతజ్ఞతగా చూసింది. 'నేను యిక వెళ్తాను. వస్తాను డాక్టర్.' అన్నాడు. ఇంతలో నర్స్ ఫోన్‌తీసి 'మీకు ఫోన్' అంటూ అందించింది. సుధీర్ ఫోన్ తీసుకుని 'హలో' అన్నాడు.

"ఇప్పుడు టైమెంతయింది?" అవతలనుంచి విమల గొంతు కోపంగా వినిపించింది. సుధీర్ టైమ్ చూసుకున్నాడు. "ఏడునలభై అయింది" అన్నాడు.

"ఇదేనా థియేటర్‌కి రావటం?" నిగ్గ తీసింది.

"సారీ విమీ! ఒక కేసు అర్జెంటుగా వచ్చింది."

"ఎప్పుడూ కేసులే! ఇంకే సరదాలూ అవసరం లేదు. ఈ రోజునుండే నీకు, నాకూ మాటలు లేవు చెబుతున్నా."

"సారీ అంటున్నానుగా!"

"చాల్లే! గొప్ప నటనచేశావు! చేయదల్చుకున్నదేదో చేసెయ్యటం ఏమీ తెలియనట్లుగా అమయకంగా, సారీ అనటం, ఆడపిల్లని నమ్మించి మోసం చేయటానికి నీకు సిగ్గు లేదూ?"

అతని ముఖం ఎఱ్ఱబడింది. విమల బిగ్గరగా మాట్లాడుతుందేమో ఫోన్‌లోనుంచి అక్కడ గదిలోవున్న మిగతా అందరికీ విన్పిస్తునే వుంది.

"థియేటర్ దగ్గర నీకోసం చూసి చూసి విసుగు వచ్చింది. అత్తయ్య నువ్వు లేకుండా వెళదామంది. నేనే వద్దన్నాను. నీ కెంతసేపూ కేసులే తప్ప యింకో ప్రపంచం అవసరం లేదా! అంత డబ్బు సంపాయించి ఏం చేసుకుంటావట! చూడు! నేను చెబుతున్నాను. ఇలా డబ్బు యావలోపడి మనుష్యుల్ని దూరం చేసుకున్న యెవ్వరూ సుఖపడరు! నువ్వసలు సుఖపడవు!"

"ఏమీ!" అతను వారిస్తున్నట్లుగా అన్నాడు.

"షటప్! నాపేరు యింకోసారి యెత్తకు."

విమల ఫోన్ పెట్టేసింది.

సుధీర్ ముఖంలో యెరుపు అలుముకుంది. డాక్టరుగారికి మాట్లాడిన వ్యక్తి యెవరో తెలుసు; మాట్లాడిన ధోరణికూడా వినిపిస్తునే వుంది.

ఆయన ఏం మాట్లాడ లేదు.

స్వప్న మాత్రం యిబ్బందిగా చూస్తోంది. ఎవరా అమ్మాయి. అతను ఆ అమ్మాయిని వదిలి యెందుకు యిక్కడకి వచ్చాడు. స్వప్నకి అర్థంకాలేదు. కానీ, తన మూలంగా, యింకో అమ్మాయికి అతను కోపం తప్పించాడని మాత్రం గ్రహించ గలిగింది.

సుధీర్ తన కారులోనే స్వప్నని, మరియంని, మరియం యింటికి తీసుకి వెళ్ళి దించాడు. పది నిముషాల తర్వాత అతను వెళ్ళిపోయాడు.

స్వప్న మంచంమీద పడుకుంది! డాక్టరుగారిచ్చిన ఈ ఆసరాతో తను జీవితం నిర్మించుకోవాలి, జాగ్రత్తగా ప్రవర్తించాలి.

స్వప్న కళ్ళలో నీళ్ళు తిరిగినాయి. ఆయనమీద కృతజ్ఞతాభావం కలిగింది! సాధ్యమైనంత తొందరలో, తన స్వశక్తిమీద తను నిలబడేలా చూసుకోవాలి అనుకోసాగింది. (సశేషం)

---

# నిరుద్యోగి జీవితకథ

విష్ణునాసిని

ఇదీ ఓ నిరుద్యోగి కథేనా ప్చ్! అనుకోవద్దు.

దేశంలో నూటికి ముప్ఫయిమంది నిరుద్యోగులున్న ఈ రోజుల్లో ఏ రచయితయినా కథ రాద్దామని ఆలోచనలో పడితే ముందుగా 'హలో' అని పలకరించేది నిరుద్యోగే.

అసలు నిరుద్యోగి అంటే ఎవరు? డెఫినెట్‌గా అతనూ మనిషే అని చెప్పాలి. ఎందుకంటే మనుషుల్లో తప్ప ఏ ఇతర జీవరాసుల్లోనూ నిరుద్యోగమనే పదానికి అర్థంలేదు. తమాషా ఏమిటంటే ఆ దశలో వున్న ఏ మనిషీ తన్నుతాను మనిషిగా గుర్తించుకోడు. తన చుట్టూ వున్న వాళ్ళు తనని మనిషిగా చూస్తోన్నట్లూ కనిపించదు.

ఇలాంటి స్థితిలోకి మూడేళ్ళబట్టి మెల్లిగా జారుకుంటున్నాడు రమేష్‌నాయుడు. అతని వయసు ఇరవయి రెండుండవచ్చు. బియ్యెస్సీ జనతా క్లాస్‌లో పేసయేడు. ఎమ్మెస్సీలో చేరటానికి మార్కులు చాల్లేదు. "ఏదయినా జాబ్‌కి ట్రై చేద్దాంలే" — అని తండ్రి అన్నప్పుడు అలాగేనని తల ఊపేడు. నిజానికి తనకీ పైకి చదవాలని అంత ఇంటరెస్టేమీ లేదు. కాబట్టి జాబ్ చేయటమే ఉత్తమమని అనుకున్నాడు.

అలా అనుకునేటప్పుడు విద్యాపర్వానికీ, ఉద్యోగ పర్వానికీ మధ్యని తప్పనిసరిగా దాటాల్సిన నిరుద్యోగ పర్వాన్ని మర్చిపోయాడు రమేష్‌నాయుడు.

ఉదయం లేచింది మొదలు రాత్రి నిద్రపోయేదాకా ఏపనయినా టైముకి సరిగ్గా చేసుకుపోవటమనేది రమేష్ తత్వానికి పడేదికాదు. కానీ చదువుకుంటున్నన్ని రోజులూ అలా క్రమంగా వుండక తప్పలేదు. క్రమం తప్పినప్పుడు అమ్మా నాన్నల చీవాట్లు తప్పలేదు. అందుకే చదువుకి ఫుల్‌స్టాప్ పెట్టేక ఓ ఆర్నెల్లు హాయిగా గడిపేడు.

అమ్మను పీడించి డబ్బు వసూలు చేసుకుని సినిమాలు, షికార్లుచేయటం,—ఉదయం ఇష్టమొచ్చినంత సేపు హాయిగా నిద్రపోవటం— అమ్మ పెట్టిన దేదో తిని మళ్ళీ వూరిమీద పడటం—జల్సాగా గడిచిపోయాయి కొన్నాళ్ళు. దేనికీ చదువుకోవాలి, పరీక్షలు రాయాలి అనే అడ్డు లేకుండా అయింది.

ఎప్పుడయినా అమ్మ, "ఇల్లు పట్టని ఈ తిరుగుళ్ళేమిటి?" అని అడిగితే, "ఇంట్లో వుండి ఏం చేయాలి?" అని సులభంగా బదులు ప్రశ్నించేవాడు రమేష్.

"ఎండెక్కేదాకా నిద్రేమిటి?" అంటే "తెల్లారే లేచి ఏం రాచకార్యం చేయాలి? వంట చేయమంటావా ఏం?" అని వెక్కిరించేవాడు.

చూసినన్ని రోజులు చూసి ఒకరోజు చీవాట్లేశారు నాన్నగారు. "వూరికే అలా వూళ్లో పడి తిరక్కపోతే అలా లైబ్రరీకి వెళ్ళి, పేపర్స్‌లో వేకెన్సీస్ ఏవయినా వస్తున్నాయేమో చూడరాదూ?" అన్నారు.

అమ్మకయితే ఎన్నయినా చెప్పొచ్చుగానీ నాన్నగారంటే భయం. "అలాగే" అని తల వూపాడు, 'బుద్ధిమంతుడు రాముా' లాగా.

న్యూస్ పేపర్లలో చాలామటుకు వేకెన్సీస్ అనేవి హెడ్‌లైన్స్‌లో తాటికాయలంతేసి అక్షరాలతో వుండవని రమేష్‌కి తెలీదు అందుకే వారం రోజులు వెతికినా ఒక్కటీ కనిపించలేదు. ఏ రోజుకారోజు ఖాళీ లేమీ లేవు, ఎప్లై చేయాల్సిన పనిలేదు అనుకుని ఇంటికొచ్చేసేవాడు.

ఒక రోజు సాయంత్రం ఆఫీస్‌నించీ ఇంటికొచ్చిన నాన్నగారు, "ఇరవయి మూడో తారీఖు పేపర్లో, ఎ ఎండ్ బి కంపెనీలో రెండు క్లర్క్ పోస్టులు ఖాళీ వున్నాయని వేసారట చూశావా?" అన్నారు.

గతుక్కుమన్నాడు రమేష్. ఇరవయి మూడోతారీఖు పేపర్లో తాను అలాంటిది చూసిన గుర్తులేదు. లేదని అంటే తిడతారేమోనని, మవునంగా గుటకలు మింగేడు.

"దానికో ఎప్లికేషన్ వేయి" అన్నారు ఆయన. ఆయనలా బయటి కెళ్ళగానే తానిటు లైబ్రరీకి పరిగెత్తాడు రమేష్.

ఇరవయిమూడో తేదీ పేపర్లు మొదట్నించీ చివరిదాకా, అరగంట వెతికితే, నాలుగోపేజీ నాలుగో కాలంలో, దావణగొరే సిల్కుచీరల అడ్వర్టయిజుమెంటు ప్రక్కన చీమ తలకాయంత అక్షరాలతో ఏ అండ్ బి కంపెనీ అని కన్పించింది. వెంట తెచ్చుకున్న కాగితంమీద పెన్సిల్‌తో అడ్వటయిజ్‌మెంటంతా రాసుకుని ఇంటికెళ్ళాడు.

"ఎప్లైయ్‌చేయి" అని నాన్నగారు అనటమయితే అన్నారుగానీ ఎలా చేయాలో రమేష్‌కి తెలీదు. ఆయన్నే అడగాలి అంటే భయం. అందుకని పక్కింట్లో వున్న ఓ ఎన్.జీ.ఓ గారి దగ్గర చేరి, అడిగాడు. ఆయిన పద్ధతి ప్రకారమూ అన్నీ చెప్పేక ఇంటికెళ్ళాడు. పెట్టె అడుగున వున్న పాస్ సర్టిఫికేటూ, మార్క్సు షీట్సు బయటికి తీసి అమ్మ నడిగి అయిదు రూపాయలు పుచ్చుకుని, "ఇక్కడ సెపు చేయబడును" అనే బోర్డువున్న బడ్డీ కొట్టు దగ్గరికి బయలుదేరాడు.

అదే మొదలు. ఉద్యోగాల వేటకి శ్రీకారం చుట్టేడు రమేష్. ఆ రోజునించీ ఈ రోజుకి రెండేళ్ళు పైచిలుకే దాటిపోయింది. కానీ నిరుద్యోగ పర్వానికి ముక్తాయింపు మాత్రమింకా కాలేదు. అదేమంత ఆశ్చర్యపడవలసిన విషయమూ కాదు.

మొదటమొదట్లో వేకెన్సీ అని కనిపిస్తే చాలు ఉద్యోగం దొరికినంత సంబరపడిపోయేవాడు రమేష్. ఎప్లైయ్ చేసిన్రోజునించీ "నాకుద్యోగం వస్తే నీకు ఓ మంచి పట్టుచీర తెస్తానమ్మా" అని అమ్మకీ, "నీకో మంచి ఫౌంటెన్ పెన్ కొని పెడతారా" అని తమ్ముడికీ, "నీకో మంచి మొగుణ్ని వెతికి తెస్తానే" అని చెల్లాయికీ ప్రామిస్‌లు చేశేవాడు.

ఇంట్లో వాళ్ళందరికీ చేస్తున్న ప్రామిస్‌లు కాకుండా ఎన్నాళ్ళుగానో తీరకుండా మిగిలిపోయిన కోరికలు తనకీ రెండున్నాయి. ఒక్కటయినా టెరీవూల్ పాంటు కొనుక్కోవాలనీ, కూలింగ్ గ్లాసెస్ పెట్టుకోవాలనీ అతనికెన్నాళ్ళగానో వున్న కోరికలు. అవి తీరిపోయినట్లు అప్పుడప్పుడు ,కలలొచ్చేయి. కలల్లో ఎన్ని ఉద్యోగాలు చేశాడో, ఎంత డబ్బు సంపాదించాడో అతనికే తెలీదు. రానురాను ఇలలోకంటే కలలోనే సుఖమని అనిపించసాగింది రమేష్‌కి. ఆటోమేటిక్‌గా నిద్రని ఎక్కువగా ప్రేమించటం మొదలెట్టేడు.

రోజులు గడుస్తున్నకొద్దీ అతనికి నిద్రకూడా దూరమే అవుతూంది. అమ్మా నాన్న, చెల్లీ తమ్ముడు, ఆ మాటకొస్తే తన చుట్టూ వున్న వాళ్ళందరిమీద కోపం, అసహ్యం పేరుకుంటున్నాయి అతడిలో. ఎవరేమి మాట్లాడినా తన నిరుద్యోగాన్ని గుర్తుచేసినట్లే వుంటుంది.

ఒకప్పుడు ఏ వేకెన్సీ కయినా ఎప్లైయ్ చేసేందుకు డబ్బు అడగాలంటే, అది తన జన్మహక్కు అయినట్లు అనిపించేది రమేష్‌కి. ఇప్పుడదే పని చేయటానికి సిగ్గుగా అనిపిస్తుంది. ఎన్నాళ్ళిలా డబ్బు లడగటం, ట్రూ కాపీలు కొట్టించుకోవటం, పోస్టల్ ఆర్డర్లకి డబ్బు దండగచేసి ఎప్లైయ్ చేయటం, ఎప్పుడో ఒకటి అరా వచ్చే ఇంటర్వ్యూలకి అటెండ్ అవటం- దీనికి తుది ఎప్పుడు? అనిపించి దిగులువేస్తుంది రమేష్‌కి.

"ఊరికే అలా తిరగకపోతే తమ్ముడ్ని కూచోబెట్టి కాస్త చదివించరాదూ?" అని మందలిస్తారు నాన్నగారు.

వాడికేమో తన మాటంటే లక్ష్యంలేదు. తనో పైసాకు పనికిరానివాడని వాడి ఉద్దేశ్యం. ఏపనీ లేక నన్ను తగులుకున్నావురా అన్నట్లు ప్రవర్తిస్తాడు వాడు. ఎప్పుడూ తన ఫ్రెండ్స్ ఎవరెవరికి, వాళ్ళ అన్నయ్యలు ఏమేం కొని పెట్టారో ఏకరువు పెడుతోంటాడు.

ఇంక చెల్లాయి ఏ రోజయినా తలనొప్పిగా వుండి ఓ కప్పు కాఫీ చేసివ్వమంటేను, అర్జెంట్‌గా ఓ షర్ట్ ఇస్త్రీ చేసివ్వమంటేను అయిష్టంగా మూతి ముడుచుకునే చేస్తుంది.

అమ్మ సరేసరి. "ఎప్పుడూ కావాలంటే

నే నెక్కణించీ తెచ్చేదిరా? మీ నాన్నగారు తెచ్చే జీతంతో నెలాఖరు దాకా నెట్టుకురావటంతో నా పీకలమీద కొస్తోంది" అని గొణగకుండా వుండదు—తను ఏ రోజయినా ఓ రూపాయివ్వమని అడిగినప్పుడు

నాన్నగారు మొదట్నించీ తనతో మాట్లాడటమే తక్కువ ఇప్పుడసలు తనకాయన ముఖం వయిపు చూడటానికికూడా అభిమానంగా వుంటుంది వీలయినంతవరకూ ఆయనకెదురు పడకుండా తప్పుకుని జారుకోవటం అలవాటయిపోయింది రమేష్‌కి మధ్య

చెల్లాయి రేపో మాపో పెళ్ళికావలసినపిల్ల. తమ్ముడేమో చిన్నవాడు ఇక తానే సంపాదించగల వయసు అండీ, కాణీ ఆదాయం లేకుండా తిని తిరుగుతున్నవాడు అలా అనుకుంటేనే సిగ్గుగా వుంటుంది రమేష్‌కి నెలకి ఓ యాభయి రూపాయలు ఒచ్చే ఉద్యోగం దొరికినా బావుణ్ను అనుకున్నాడు

ఏదో కథలో హీరో న్యూస్‌పేపర్లు పంచి, పాలబాటిల్స్ సరఫరా చేసి లక్షాధికారి అయినట్లు చదివాడు ఆ రెండింటికీ కూడా ట్రై చేసి చూశాడు అక్కడా 'నో వేకెన్సీ' బోర్డు ఎదురయింది ఇక మిగిలింది రిక్షా తొక్కటం కూలి పని చేయటం అవి రెండూ తను చేయలేడు తను చేయగలిగినా అమ్మా, నాన్నగారు చేయనివ్వరు ఎందుకంటే 'లోయర్ మిడిల్ క్లాస్' అనే తెగవారికి ఏమి లేకున్నా తట్టలకొద్దీ ప్రెస్టేజి అనే పదార్థం వుంటే చాలు భోంచేయటానికి



ఇంటా బయటా తననెవరూ ఓ మనిషిగానే చూస్తున్నట్లు కనిపించదు అతనికి ఆఖరికి సెంటర్లో వున్న కిళ్ళీకొట్టువాడు కూడా ఎప్పుడో ఒకసారి ఓ సిగరెట్ కోసం వెళితే "ఏవయ్యా నాయుడూ?" అని పలకరించేవాడు కాస్తా, ఇప్పుడు తను కనిపిస్తే చాలు అప్పెక్కడ పెట్టాల్సొస్తుందోనని ముఖం తప్పిస్తున్నాడు

'ఛీ! ఏమిటీ బ్రతుకు? ఉద్యోగం లేని మనిషికి విలువేలేదా? ఎందుకిలా వుందీ లోకం?" అని ఎన్నిసార్లు డెస్పరేట్‌గా అనుకున్నాడో

ఇంట్లో నాన్నగారు సంపాదించి తెస్తే, అమ్మ ఇంటిల్లిపాదికి వండి వడ్డిస్తోంది

ఈ జీవితానికిక ఇంతే అనుకుని నిరుత్సాహంతో నీరుగారిపోయి రోజులు లాగుకొస్తున్న రమేష్ నాయుణ్ని అదృష్టం వరించిందో రోజు హఠాత్తుగా ఇటు లంచమిచ్చేందుకు డబ్బుగానీ, అటు మాట సహాయంచేసే మంత్రిగార్ల చుట్టరికాలుగానీ లేని రమేష్‌లాంటి

వాళ్ళకి కనీసం దేవుడయినా సహాయం చేయక పోతే నిరుద్యోగంనించీ మోక్షం లభించేదెలా?

ఎప్పటిలాగే ఇంట్లోవాళ్ళని తిట్టుకుంటూ, తనని తాను అసహ్యించుకుంటూ బజారునించీ ఇంట్లో అడుగు పెట్టిన రమేష్‌కి నవ్వుతూ ఎదురొచ్చి ఓ కవరందించింది చెల్లాయి అందులో తన అదృష్టం దాగివుందని తెలీని రమేష్ మామూలుగా కవర్లో వున్న కాగితాన్ని బయటికి లాగి చూశాడు చదవగానే ఎగిరి గంతేయాలనుకున్నాడు చెల్లిని రెండు చేతులో యెత్తి చిన్నప్పటిలా గిరగిరా తిప్పాలని అను కున్నాడు "అమ్మా నాకు వుద్యోగమయిందే" అని కేకేయాలనుకున్నాడు కానీ ఏ ఒక్కటీ చేయలేకపోయాడు కారణం అది కలో నిజమో తనకే అనుమానం వేయటమే అందుకే ఒకటికి నాలుగుసార్లు అదేదో బ్యాంక్ వాళ్ళు కాషియర్ పోస్టుకి పంపిన ఎపాయింట్ మెంట్ ఆర్డర్‌ని పైనించి కిందికీ, వెనకనించి ముందుకీ నాలుగయిదుసార్లు చదివి చూసు కున్నాడు

రమేష్‌నాయుడు వుద్యోగంలో చేరి వారం రోజులయింది ఇంటా బయటా చెప్పలే నంతగా పెరిగిపోయింది అతని మీద గౌరవం రోజుకొక్కసారయినా పలకరిస్తారు నాన్న గారు "ఏవోయ్ ఉద్యోగమెలా వుంది?" అనో, "మీ మేనేజర్ మంచివాడేనా?" అనో!

అమ్మ సరే సరి, రోజు కొకటి తనకిష్ట మయిన వంట చేసిపెడుతోంది "బాగా తినరా సాయంత్రందాకా వుండాలిగా ఆ కాంటీనులో ఎంత తిన్నా కడుపు నిండుతుందా ఏమన్నానా?" అని సాగదీస్తుంది

చెల్లాయి చెప్పక ముందే తన బట్టలుతికి ఇస్త్రీచేసి పెడుతోంది పెన్‌లో ఇంక్ వేసి స్తుంది. అడగ్గానే కాఫీ పెట్టిస్తుంది

తను ఇంటికొచ్చి ఎంత అలసిపోయుం టాడో, ఏమంటాడోనని భయపడుతూ, "అన్నాయ్! నాకీ లెక్క తెలీటం లేదురా చెప్పవూ?' అని అడుగుతాడు తమ్ముడు మెల్లిగా పక్కచేరి "వాణ్ణెందుకురా విసిగిస్తావ్? అక్కయ్య నడిగి చెప్పించుకో పో" అని కసురుతుంది అమ్మ వాడ్ని మాసి తను మాత్రం "పోనీలేమ్మా, ఇప్పుడు నేనే మంతలిసి పోయానని" అని వాణ్ణి పక్కన కూచోబెట్టి చెప్తుంటే ఎంతో గర్వంగా వుంటుంది రమేష్‌కి

ఆవేళ ఫస్టు తారీఖు రమేష్ వుద్యోగంలో చేరిన మొదటి నెల జీతం అందుకునే రోజు! కవర్లోంచి కొత్తనోట్లు తీసి లెక్కపెడుతోంటే ఎంతో వుద్వేగంగా వుంది అతనికి

ఆ కవరు జేబులో వుంచుకుని సాయంత్రం ఇంటికి వెళుతోంటే ఏవేవో ఆలోచనలు చుట్టు ముడుతున్నాయి అతన్ని ముందుగా టెరీ వూల్ పాంటు కొనాలా, గాగుల్స్ కొనాలా, అమ్మకి పట్టుచీరా, తమ్ముడికి షాంపెన్ పెన్నా, ఏం కొనాలి?

ఎందరో అన్నయ్యలు చెల్లెళ్ళని ఎంతో ప్రేమగా చూసుకుని కోరింది తెచ్చిపెడతారు! తమ ఇంట్లో వున్నదాకతే ఆడపిల్ల ఇంత వరకూ తాను దానికేమి ఇవ్వగలిగాడు? కవర్లో వున్న డబ్బు అంతా పెడితే ఒక జత కమ్మలు రాకపోవు దానికి-పోనీ అలా చేద్దామా అను కున్నాడు

ఇన్ని ఆలోచనల్లోనూ అతను గతాన్ని నెమరు వేసుకోకుండా ఉండలేకపోయాడు ఉద్యోగం లేనప్పటి తనకీ, ఇప్పటి తనకీ ఎంత తేడా! అప్పుడు తానొక పనికిరాని పైలాపచ్చీస్ గాడు ఇప్పుడు సమాజంలో బాధ్యత గల పౌరుడు ఎక్కడుందీ అంతరం! అంతా డబ్బు మహత్యమేనా? డబ్బూ, గౌరవం పక్క పక్కనే వుండాల్సిందేనా? అనుకున్నాడు

డబ్బు ముందు అనుబంధానికీ, రక్త సంబంధానికీ కూడా విలువలేదా? అనిపించింది రమేష్‌కి

అన్ని జీవరాసుల్లోకీ మనిషిగా పుట్టటం కష్టసాధ్యమూ, అదృష్టమూ అంటారే? ఎక్క డుందా గొప్పతనం?

ఇంతెందుకు! ఉద్యోగం లేనప్పుడు తనలో పేరుకుపోయిన ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సు, భయం, నిరుత్సాహం ఇప్పుడేమయినాయి?

మనిషిగా తలెత్తుకుని తిరగ్గల శక్తి ఎక్కడి నించి వచ్చింది? ఆత్మస్థయిర్యమూ, వుత్సాహమూ అనేవి మనిషి లోపల్నించి రావలసిందేగాని ఒకరిస్తే పుచ్చుకునేది కాదే? అంటే తనకంటూ ఓ వుద్యోగం లేకపోవటం తనకే నచ్చలేదన్నమాట ఆ భావమే తననో చవట కింద మార్చింది ఇప్పుడుద్యోగమయ్యాక తనచుట్టూ ఏదో తెలీని సెక్యూరిటీ ఏర్పడినట్లుంది

ఇల్లు దగ్గరవుతున్నప్పుడు సరిగ్గా కామెర్ల రోగి సామెత గుర్తొచ్చింది రమేష్‌కి తనమీద తనకే గౌరవం లేనప్పుడు, ఇతర్లు తనని గౌరవించాలని అనుకోవటం ఏం న్యాయం? తను ఇతరులని అసహ్యించుకుంటూ, వాళ్ళు తనని ప్రేమించాలని అనుకోవటంకి ఎలాంటి ధర్మం? మంచివారికి లోకమంతా మంచిగానే కనిపిస్తుందిట లోకంలో డబ్బుకి విలువ వున్నమాట నిజమేగానీ, ఆ విలువ ప్రతి మనిషి తనకు తానుగా ఆపాదించుకున్నదే గద! రియాలిటీని గుర్తించలేని ఆత్మ వంచన ఎందుకు?—అనుకున్నాడు

ఎప్పుడు ఇల్లు చేరాడో గుర్తులేదు రమేష్‌కి. ఈజీఛేర్‌లో రిలాక్స్ అయి కూచుని కాఫీ తాగుతుండగా నాన్నగా రొచ్చారు ఆయన ఎదురుగా కనిపించగానే, తన జీతం వున్న కవర్‌ని ఆయన చేతిలో పెట్టటమే సరియయిన పని అనిపించింది అలాగే చేశాడు

"ఉంచలాగే ఖర్చుచెయ్యకుండా వచ్చే నెలలో ఓ రెండు రోజులు సెలవు తీసుకొని తిరుపతి వెళ్ళి ఇదిలాగే హుండీలో వెయ్యి అలా చేయాలని నీ కుద్యోగం అవక ముందే మొక్కుకున్నాను" అన్నారాయన. □

---

# ఫ్లాష్!

## శారద మళ్ళీ సాధించింది!

తెలుగు చలనచిత్ర పరిశ్రమకు గర్వకారణం నటి శారద తెలుగుభాషా చిత్రాలలో కాకపోయినా, మళయాళ చిత్రాలద్వారా ఇదివరకే రెండుసార్లు ఉత్తమ నటిగా కేంద్రప్రభుత్వ బహుమతి పొందింది ఇప్పుడు తెలుగు చిత్రం 'నిమజ్జనం'లో నటనకు తిరిగి భారతదేశపు ఉత్తమ నటిగా అవార్డు పొంది, 'హ్యాట్ ట్రిక్' సాధించింది 'నిమజ్జనం చిత్రం తెలుగులో ఉత్తమ చిత్రంగా కేంద్ర ప్రభుత్వంచే గుర్తించబడింది నటి శారదకూ, 'నిమజ్జనం' దర్శకులు బి ఎస్. నారాయణకూ మా అభినందనలు

## భుట్టో ఉరితీయబడ్డాడు!

ఈ సంచిక తొలిమాటలో మా వ్యాఖ్య రాసేనాటికి బ్రతికే వున్న పాకిస్తాన్ మాజీ ప్రధాని భుట్టో ఇది రాసేనాటికి పాకిస్తాన్ సైనిక ప్రభుత్వంచే ఉరితీయబడ్డాడు ఉరి తీయబడ్డ తర్వాత తొమ్మిది గంటలకుగాని ఈ విషయం ప్రపంచానికి తెలియలేదు తెలిసిన సభ్యప్రపంచం దిగ్భ్రాంతిచెంది, తన సంతాపాన్ని వ్యక్తం చేసింది

మినీకధ

# రాంగ్ ఫ్రెండ్

ఆఫీసులో ఆఫీసర్లు (టెలిఫోన్ వున్న) ఎవరైనా సెలవు పెడితే వాళ్ళదగ్గిర్న వున్న ఫోనులను ఎంగేజ్ చెయ్యటం మా క్లర్కులలో చాలామందికి పరిపాటి ఆ రోజు మా ఆఫీసర్ ఏదో పనిమీద లీవ్ పెట్టేడు అది నాకు ముందు తెలియదు ఆఫీసు పనిమీద ఆయన రూంకి వెళితే ప్యూన్ చెప్పాడు ఆఫీసరుగారు లీవ్ లెటర్ పంపించారని ఆయనగారులేరని తెలిసిం తరువాత ధైర్యంగా ఒక్కసారి డోరుతెరచి రూంనిపరీక్షగాచూసారు అక్కడ ఉన్నవాటిలో నన్ను అమితంగా ఆకర్షించింది ఆయన టేబిల్ మీదనున్న రెడ్ కలర్ ఫోన్ సమయానికి ఫోన్ నెంబర్లు నోటుచేసుకున్న డైరీ ఇవ్వాళ ఇంటినుంచి తేలేదని నొచ్చుకున్నాను నాకు బాగా నోటిమీద వున్న నెంబర్ పాషాది పాషాని కలిసికూడా చాలా కాలమయింది కనీసం ఒక్కసారి ఫోన్లో ఐనా మాటలాడుదామని పాషా ఫోన్ నెంబర్ డయల్ చేశాను

డయల్ చేసింతరువాత అనుమానం వేసింది చివరి నెంబర్ కరక్టా కాదా అని

కాకపోతే మళ్ళీ చెయ్యొచ్చులే అనుకొని రిసీవర్ ని చెవి దగ్గిరకి తెచ్చాను

'హల్లో' మృదుమధురమైన గొంతు

రిసీవర్ ని చెవికి మరింత దగ్గిర పెట్టేను

'ఎవరండి మాట్లాడేది' అదే గొంతు ఎంతో శ్రావ్యంగా

అది పాషా నెంబర్ కాదు పాషా ఇంట్లో ఎవ్వరికీ తెలుగు రాదు

నేను చేసింది రాంగ్ నెంబర్ రిసీవర్ చెవిని మరింత హత్తుకుంది

ఆ స్త్రీ గొంతు మళ్ళీమళ్ళీ వినాలనిపిస్తోంది

నేను తికమక పడిపోతున్నాను

మీరు ఏ ఫోను నెంబర్నుంచి మాట్లాడుతున్నారని అడిగాను

నేను నిజంగానే పొరబడ్డాను చివరి నెంబర్ రాంగ్ గా డయల్ చేశాను

'సారీః రాంగ్ నెంబర్' అనకుండా తప్ప లేదు

రిసీవర్ పెట్టేసిన శబ్దం

బరువుగా నేనూ రిసీవర్ ని క్రిందకి దించేశాను

ఎంత మధురమైన గొంతు! కోకిల జ్ఞాపకం వచ్చింది గొంతే అలా వుంటే ఇక మనిషి ఎలా వుంటుందో?

ఇలాంటి వాళ్ళతో మాట్లాడితేనే చాలు! జన్మ తరించినట్లు!

బ్రహ్మచారి బుద్ధులు ఎక్కడికిపోతాయి

వారం రోజులైం తరువాత మళ్ళీ అవకాశం వచ్చింది - డబ్బుపెట్టి ఫోను చెయ్యనవసరం లేకుండా

ఈసారి తెలిసే నాక్కావలసిన రాంగ్ నెంబర్ డయల్ చేసా!

"హల్లో!" గంభీరమైన గొంతు

బితుక్కుమన్నాను అనుకున్నది కాక పోయేసరికి

'ఎవరండి?' అదే స్టైయిల్లో!

ఏం అడగాలో తెలియక 'రాంబాబు వున్నాడాండి?' తడబడుతూ అన్నాను

'లేదండి ఇప్పుడే కాలేజీకి వెళ్ళాడు మీ రెక్కడ్నించి మాట్లాడుతున్నారు, మీ పేరేమిటో చెప్పండి!'

గతుక్కుమన్నాను

'మే ఐనో యువర్ నేమ్?' మర్యాదగా అడుగుతోంది ఆగొంతు

'రాజారావు!' నా అసలు పేరు మర్చిపోయాను

'మీ రిప్పుడే కదండి వచ్చింది!!'

బిత్తరపడిపోయి ఫోన్ పెట్టేశాను □.

—మొవ్వ బాబూరావు




ఆ ఊళ్లో బ్రహ్మచారుల కెవ్వరు ఇళ్లు అద్దె కివ్వరు. అందుకనే దొరికిన ఒకే ఒక యింట్లో, అది దయ్యాలకొంపే అవుగాక, ఒబ్బిటిగా ఇమిడిపోయారు. ఆ యింట్లో పూర్వం జమిందారు అయిన, పెద్దమనిషి కాని శాల్తీ ఉండేది. అతగాడు తన కిష్టంలేనివాళ్ళని పెద్ద కష్టం లేకుండా పైకి పంపించేస్తూ, తను ఇష్టపడ్డ అమ్మాయిల్ని లోపలికి తెప్పించుకొని వాళ్ళు బయటకు పోనీయకుండా జాగ్రత్తపడుతూ పులిలా బతికాడు.

ఆ జమిందా రెప్పుడూ "ఓ అర్ధరాత్రిపూట ఏ ఆడపిల్లయినా నా యింటి తలుపు బాదుతుం దనుకోండి విననట్టు ఊరుకొంటానేగాని తలుపులు తెరవను" అనేవాడందరితో వినయంగా. కొన్నాళ్ళకి ఆ ఊళ్లో కొందరికి ఆ మాటలు అక్షరాల నిజమని తెలిసింది. వాళ్ళ అమ్మాయిలు, తలుపులు బాదినా, అర్ధరాత్రవటంచేత ఆ జమిందారు తలుపులు తెరవలేదని అందుకని రాత్రంతా వాళ్ళమ్మాయిలు ఆ యింటి లోపలే ఉండిపోవాల్సి వచ్చిందని వాళ్ళకి అర్థమయింది. అందులో కొందర్ని జమిందారు ఈతి బాధల్నుంచి తప్పించాడు. కాని కొన్ని చలిచీమలు ఆ బలవంతమైన సర్పాన్ని ఆనమాలు లేకుండా చంపేసాయి.

జమిందారు కొడుకు అందుకని ఆ ఊరు వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపోయాడు. అందుకని వాళ్ళ ఇల్లు ఖాళీగా ఉంటోంది. ఒకరిద్దరు ఆ యింట్లో దిగి ఆపైన జమిందారు దయ్యం వాళ్ళని సుఖంగా ఉండనివ్వలేదన్న పుకారు పుట్టించి మరీ లేచిపోయారు

ఆ యింట్లో దిగిన ఒకరు, తను ఆ యింట్లో ఉంటున్నంతకాలం తనకి తన పై ఆఫీసర్ని హత్య చెయ్యాలన్న కోరిక బలంగా వుండేదని, ఆ యిల్లు మార్చాక, ఆ కోరిక అంత బలంగా కలగటంలేదని అన్నారు, యిల్లు మారాక.

మరొకరు ఆ యింట్లోకి మారిన కొద్ది రోజులకి పనిపిల్ల చెయ్యి దొరక బుచ్చుకొని పెళ్లానికి దొరికిపోయారు ఆ క్షణంలో తనని జమీందారు దయ్యం ఆవహించి ఉందని లేకపోతే తనాపని చేసేవాడు కాదని అన్నాడు దొరికిపోయిన అతను పైగా తనా యింట్లోకి మారి ఉండకపోతే తను ఆ పిల్లలను తన హస్తాలలో బంధించేవాడు కాడని అప్పుడు తన భార్య ఆ పిల్ల గింజుకోడం చూడగలిగేది కాదని అందరి దగ్గరా మొత్తుకొన్నాడు అతను అతని భార్య ముందర పనిపిల్లని, తరువాత ఇంటిని మార్చింది. "ఇల్లాంటి దింకోసారి జరిగితే నిన్నుకూడా మారుస్తాను" అంటూ భర్తను బెదిరించిందని కొందరంటారు దానికి నమ్మదగ్గ ఆధారాలు లేవు

ఏది ఏమైనా ఆ యిల్లు దయ్యాలకొంపగా పేరు తెచ్చుకొంది అందులో ఎవరు ఉండటాని కిష్టపడక పోవడంవల్ల ఖాళీగా ఉంటూ వచ్చింది అదే ఆ అయిదురు బ్రహ్మచారుల పాలిట వరం అయింది వాళ్ళు ఆ యింట్లో ఉంటామని చెప్పి ఆ జమీందారు కొడుకుకి బంధువైన ఆయనదగ్గర తాళం చెవులు తీసుకొన్నారు అద్దెకింద అందరూ తలా వంద ఆ పెద్ద భవంతికి కట్టామన్నారు

ఆ విధంగా సుబ్బారావు, విశ్వనాధం, రాజా, ప్రసాద్, రెడ్డి ఆ యింట్లో గృహప్రవేశం చేసారు ఆ చిన్నసైజు పట్టణంలో చిన్నచిన్న ఆఫీసు లున్నాయి వాటికి చిన్న, చిన్న ఆఫీసర్లున్నారు సుబ్బారావు, విశ్వనాథం అల్లాంటి ఆఫీసర్లు ఆ చిన్న పట్టణంలో ఓ చిన్న కాలేజీ, అందులో అందంగా అలంకరించుకొని తిరగటానికి విద్యార్థినులు, వాళ్ళ శ్రమ వృధా పోకుండా, వాళ్ళను చూసి మెచ్చుకోటానికి అబ్బాయిలు ఉన్నారు ఇవన్నీ అమిరాక ఆ కాలేజీలో లెక్చెరర్స్ ఉండకపోతే బావుండదని కొంతమందిని లెక్చెరర్స్‌గా వేసారు అల్లా ఆ ఊరు వచ్చినవాళ్ళు రాజా, ప్రసాద్‌లు ఇంక పోతే రెడ్డి ఆ ఊళ్ళో అందరికి అప్పుడో ఇప్పుడో తలకాయనొప్పి రావటం, జ్వరం రావటం మొదలుపెట్టాక వాళ్ళ రోగాలు కుదర్చటానికి, ఓ డాక్టరు, అతడి రోగం కుదర్చటానికి పోటీగా మరికొందరు డాక్టర్లు దిగారు. "వాళ్ళు రోగులచేత మందులు కొనిపించేలా చూడు" అంటూ ఓ మందుల కంపెనీ రెడ్డి నా వూరు శాంపిల్స్ ఇచ్చి పంపించింది

ఆ అయిదుగురు పూర్వం వాళ్ళ ఊరైన మరో ఊళ్ళో ఒకే బళ్లో చదువుకొని ఉద్యోగ రీత్యా ఆ ఊళ్లో ఉంటున్నారు ఎవరికీ పెళ్ళి కాలేదు అందుకని నిశ్చింతగా పేకాడుకొంటూ హాయిగా ఉంటున్నారు ఆ యింట్లో ఎవరి గదులు వాళ్ళకే ఉన్నాయి డ్రాయింగ్‌రూమ్, బాత్రూమ్, వంటిల్లు లాంటివి ఉమ్మడిగా వాడుకొంటారు

ఓ ఆదివారం సాయంత్రం ప్రసాద్, రెడ్డి, సుబ్బారావు, విశ్వనాధం పేకాడుకొంటున్నారు ఆరోజు వాన ఢమామడా కురిసింది ఆ వానకి మనుష్యులు వెర్రెత్తిపోయున్నారు ఆడుతున్న ఆట ఆంధ్రుల అభిమానపు ఆట, అడ్డాట. సుబ్బారావుకి ఆ ఆట బాగావచ్చు రెడ్డికి ఏ ఆటా సరిగ్గా రాదు అందుకని వాళ్ళిద్దరు ఒక పార్టీగా కూర్చున్నారు ప్రసాద్, విశ్వనాధం ప్రతిపక్షం

ప్రసాద్ ముక్కలు పంచాడు విశ్వనాధం ఇస్పేటు తురుపు చెప్పాడు అంతవరకు బాగానే జరిగింది అప్పుడు రెడ్డి అడ్డుపెట్టాడు సుబ్బారావుకి భగ్గున మండింది ప్రసాద్ షరతు పెట్టగానే రెడ్డిమీద కోపం తారస్థాయి నందుకొంది

"దిగుడు చెయ్యి అడ్డుపెట్టచ్చు రా సన్యాసీ!" అని దెబ్బలాడాడు రెడ్డికూడా కోపం వచ్చింది తన ఆటలో తప్పుపట్టినందుకు కాదు తనని సన్యాసీ అంటాడా ఈ సుబ్బిగాడు అని అందుకని ప్రసాద్‌కి తన ముక్కల్ని చూపిస్తూ,




"నా ముక్కల్చూసావు కదా! నాకు అడ్డు పెట్టే ముక్కల్రాలేదూ" అని అడిగాడు

"ప్రసాద్‌కి ముక్కల్చూపిస్తా వేమిట్రా?" అని సుబ్బారావు కోపంతో అరిచాడు

"వాడు చూపించాడేమోగాని నేను చూడ లేదు వాడికి అడ్డుపెట్టే ముక్కలు వచ్చాయని నా అనుమానం" అన్నాడు ప్రసాద్ కొంచెం తీవ్రంగా

"సుబ్బయ్యా! చెప్తే పైషర్తు చెప్పు లేక పోతే ప్రసాదం ముక్కలు పంచుతాడు" అని విశ్వనాధం విసుక్కున్నాడు సుబ్బారావు పై షరతు పెట్టాడు ప్రసాద్ పంచాడు

రెడ్డి లెక్కల్లో పడ్డాడు విస్సిగాడి చెయ్యి రెండు అడ్డు నాలుగు షరతు ఎనిమిది పై షరతు పదహారు అయ్యబాబోయి పదహారాటలు! ఈ ఆట తాము గెలవాలి! అని బోలెంత ఉత్సాహంతో తురఫేడు ఆడాడు

"ఎదుర్తురఫాడ్తా వేమిట్రా? తురఫేడు దిగొచ్చా?" అని సుబ్బారావు, రెడ్డి ముక్క వెనక్కి తీసుకోమని సూచించాడు

"ఎం దిగాలి?" రెడ్డి ఎందుకైనా మంచిదని ఆ ముక్క వెనక్కి తీసుకొంటూ అడిగాడు

"తురపు చెప్పినవాడి కిందిచెయ్యివాడు పదంతి దిగాలి" అని సుబ్బారావు వివరించాడు

"ఆడవాళ్ళుకూడా ఇలా చెప్పుకొని ఆడు కోర్రా!" అని ప్రసాద్ వెక్కిరించాడు

రెడ్డి తురపు పది దిగాడు

"నీ తెలివి తెల్లారా! అది తురపు పదిరా!" సుబ్బారావు నెత్తికొట్టుకొన్నాడు

"రెడ్డిని అనవసరంగా కంగారు పెట్టకురా సుబ్బయ్యా! మహా అయితే మీరు ఈ ఆటోడ్తారు తోముడు మీ చేతి కొస్తుంది! అంతేగా" అని విశ్వనాధం సర్ది చెప్పాడు

రెడ్డి ముక్క వెనక్కి తీసుకొన్నాడు ఆపైనేమో "ఒరే సుబ్బిగా! తురఫేడు పనికి రాదన్నావు పది దిగమన్నావు! దిగాను. తిన్నగా తురపు పది కాకుండా మరేదన్నా పది దిగమని ఉంటే అల్లాగే దిగి ఉందును కదా! నీకు ఆఫీసులో గుమాస్తాల డ్రాఫ్టులు పెడ్తుంటే వంకలు పెట్టడం అలవాటై ఇదికాదు అదికాదు అంటావేకాని ఏది అవునో చెప్పవు" అని సుబ్బారావు నుద్దేశించి ఓ చిన్న ఉపన్యాసం ఇచ్చి ఆపైన డైమన్ పది దిగాడు

విశ్వనాధం "ఇందాకటి ముక్క అక్కడ పెట్టి ఇది తియ్యి! రెడ్డమ్మా!" అని అన్నాడు

"నువ్వు ఇంకా ముక్క దిగలేదుగా అందు

కని తీసుకొన్నాను" అన్నాడు రెడ్డి

"అదంతా నాకు తెలియదు నువ్వు స్పేడు పది ఆడాలి!" అన్నాడు విశ్వనాధం

రెడ్డి డైమన్ పది వెనక్కి తీసుకొన్నాడు

"ఒరేయ్! రెడ్డీ! నువ్వు స్పేడు పది దిగితే నేను నీ పార్టీలో ఆడను" సుబ్బారావు బెదిరించాడు రెడ్డి ఆ బెదిరింపుకి బెదర దలుచుకో లేదు

"మానెయ్యి నేను నా ముక్కల్తోసహా విస్పి గాడి పార్టీలోకి వెళ్ళిపోయి నిన్ను చిత్తుగా ఓడించేస్తాను నాదగ్గర మూడు తురుపులు బోలుడు హుకుం ఉన్నాయి నీకు పదహారాటలు ఎక్కుతాయి! అల్లాచేస్తేగాని నీకు తిక్కొదల్దుదురా! సుబ్బిగా!"

"తొందరగా ఏదో ముక్క దిగేడవ్!" అన్నాడు ప్రసాద్ అసహనంగా

"స్పేడ్ టెన్ కాక మరో ముక్క దిగితే పీక నులిమేస్తాన్రా రెడ్డీ!" విశ్వనాధం వార్నింగ్ ఇచ్చాడు

"ఆ ముక్కే దిగితే నిన్ను ఇవాళ నరికెయ్యడం ఖాయం" అని సుబ్బారావు తుది హెచ్చరిక చేసాడు

"దిగితే వీడు చంపుతాడుట, దిగకపోతే వాడు చంపుతాడుట ఒరేయ్ ప్రసాద్! నీలాంటి మంచివాళ్ళు ఎక్కడోగాని ఉండర్రా! ఓరి విస్పి సుబ్బిగాళ్ళలారా! మీ కిదియె శాస్తి! మీతో నేనసలు ఆడను పొండి మీరు నన్నడ్డమైన మాటలు అంటుంటే పడటానికి నేనేమైనా మీ దగ్గర పన్చేసే పీనుగ్గుమాస్తానా? పడను ఆడను పొండి!" అన్నాడు రెడ్డి కోపంగా.

"బతికించావు పో" అన్నాడు సుబ్బారావు

"అసలే బోరుకొట్టి ఛస్తోంది ఆ బుద్ధిలేని సుబ్బారావుతో నీకేమిటి? నీ యిష్టం వచ్చినట్టు ఆడు" అని బతిమాలాడు ప్రసాద్

"నాకు బుద్ధి లేదంటావురా? స్టుపిడ్!" సుబ్బారావు పైకి లేచాడు

"ఏదో మన రెడ్డిని కాస్త నానబెట్టి సాఫెన్ చేద్దామని."

"నేను తోలుముక్కనా నానబెట్టడానికి. నేను నానను మెత్తపడను"

విశ్వనాధం కల్పించుకొన్నాడు "ఒరేయ్ సుబ్బయ్యా!నువ్వు రెడ్డికిక్షమాపణలు చెప్పుకో. నేను కూడా చెప్తాను తప్పేదేముంది! వసుదేవుదేం చేసాడు?"

"నేను గాడిదనా? నేను తోలు ముక్కనా? ఆగండ్రా మీపని సమయం చూసి పడ్తాను" అంటూ రెడ్డి పేక ముక్క లక్కడపారేసి దూరంగాపోయి కూర్చున్నాడు

ప్రసాద్ "రెడ్డీ! రా అమ్మా! విశ్వనాధం గాని సుబ్బారావుగాని నీమీద చెయ్యివేస్తే ఆ పడ్డ చేతిని అక్కడి కక్కడే విరిచేస్తాను దా అమ్మా!" అని బతిమాలాడు

రెడ్డి "డైమను పది దిగనిస్తే అయిందా! మరో ఆటలో నేను మర్చిపోయి మణేలా దిగుతాను నువ్వు జాకీ దిగుతావు నువ్వు కాకపోతే విస్పిగాడు దిగుతాడు వాడివన్నీ అల్లాంటి వెధవ బుద్ధులే! అప్పుడేమో ఈ సుబ్బిగాడు నన్ను చంపుతానని లేస్తాడు నేనీ ఊరు ఉద్యోగంచేసి బతుకుదామని వచ్చాను కాని వీడితో పేకాడి చద్దామని రాలేదు! అందుకని నేను ఆడనుగాక ఆడను" అని తెగేసి చెప్పాడు.

కాస్సేప్పాటు మౌనం రాజ్యమేలింది చివరికి విశ్వనాధం అన్నాడు

"నిన్నట్నుంచి రాజాగాడు పికర్ లేకుండా పోవటంతో ఈ రెడ్డిని పెట్టుకొని పేకాడాల్సి వచ్చింది ఆ వెధవెక్కడ చచ్చాడో!"

"అవును వాడు వాడి బలపాలన్నీ కని వారాలు తీర్చుకొని ఆదివారాలు ఇంట్లోనే చచ్చినట్టు పడుండేవాడు బ్రిడ్జో, అడ్డో ఆడుకునే వాళ్ళం" అన్నాడు ప్రసాద్

"ఇవాళ రాజాలేని లోటు కొట్టొచ్చినట్టు తెలుస్తోంది రా" అన్నాడు సుబ్బారావు

రెడ్డి అందరి మాటలు విని దూరంగా కూర్చున్నవాడల్లా లేచివచ్చి,

"ఏమిటి మీకు రాజా లేని లోటు తెలిసి వస్తోందా? వాడిని మీరు పేకాటలో తిట్టని రోజుందా? నాకంటే ఆటరాదు అడ్డమైన మాటలంటారు పడ్డాను పడ్డవాడెప్పుడు చెడ్డ

వాడు కాదు కాని రాజాని మీరెన్నేసి మాట లంటారు! మీ కుక్కబుద్ధులు మీకు తెలిసేలా చెయ్యాలనేవాడు కనిపించకుండాపోయి ఉంటాడు మా బాగా అయిందిమీకు అల్లాగే అవాలి" అందరికి తలా కాస్త గడ్డిపెట్టాడు అప్పటికి రెడ్డి ఆగ్రహం చల్లారింది

మిగిలిన ముగ్గురు రాజా ఏమై ఉంటాడన్న చర్చలో పడ్డారు రాజా జీతం రాగానే గత నెలలో చేసిన బాకీలు తీర్చేసి మిగిలింది హారతి కర్పూరంలా తగలేస్తాడు రెండోవారం వచ్చే సరికల్లా ఇతర్ల దయాదాక్షిణ్యాలమీద లేకవాళ్ల అరువిచ్చే చొక్కాల్లో పొరపాటుగా వదిలివేసిన చిల్లరనోట్లమీద ఆధారపడ్తాడు అందుకే సాధారణంగా రెండోవారం తరువాత, ఇతర్ల చొక్కాలనే వాడ్తాడు

సుబ్బారావుకి ఆ క్రితంరోజు రాజాతో తను సినిమాకి వెళ్ళిన విషయం గుర్తుకు వచ్చింది ఆ విషయం మిగిలినవాళ్ళతో చెప్పి,

"నాతో వాడు ఇంటికి రాలేదు తరువాత వస్తానన్నాడు బస్సు ఛార్జీలకోసం అర్ధ రూపాయి అప్పడిగి సినిమాతోచేరి మూడు రూపాయల్రా! ముందు దాంతోచేరి ముప్పై అన్నాడు వాడిదగ్గర డబ్బుల్లేవు నాకు తెలుసు డబ్బుల్లేకుండా ఎక్కడికి వెళ్ళిఉంటాడు?" అని ప్రశ్నించాడు

"వనజా వాళ్ళింటికి వెళ్ళుండడు అక్కడకి వెళ్ళేటప్పుడల్లా ఆ పిల్ల తమ్ముడికి చాక్‌లెట్లు తీసుకువెళ్ళాలి వనజని సినిమాకి తీసుకువెళ్లాలి వనజా వాళ్ళ బామ్మకి తిరుపతి ప్రసాదం అని దార్లోకొన్న లడ్డూ లివ్వాలి ఖర్చుతో కూడినపని పోనీ వెళ్ళడే అనుకొన్నా రాత్రి పదకొండుగంటల తరవాత వీ దక్కడే ఉంటానన్నా వాళ్ళు ఉండనివ్వరు కదా!" అని తేల్చాడు ప్రసాద్

"మెట్రిక్ ఆనర్స్ చదువుతున్న వాళ్ళ చుట్టాలమ్మాయి సుబ్బులింటికి వెళ్ళాడేమో?" అనుమానంగా అడిగాడు విశ్వనాథం అక్కడికి వెళ్తే ఒకోసారి రాత్రిళ్ళు అక్కడే నిద్రపోయి రావటం రాజాకి అలవాటు

"నిన్న నాతో వచ్చేసరికి వాడి మొహంమీద రెండ్రోజుల గడ్డం పెరిగుంది కనక వెళ్ళుండడు" అన్నాడు సుబ్బారావు

రాజా సుబ్బుల విషయంలో ఏడాది ట్రై చెయ్యగా మూడ్నెల్లక్రితం ఓ చిన్న అవకాశం వచ్చి అతనో చిన్న చొరవచెయ్యటం, ఆ పిల్ల "నీ గడ్డం రంపంలా గుచ్చుకొంటోంది" అని దూరంగా తోసివెయ్యటం, ఆ విషయం రాజా వీళ్ళకి దాపరికం లేకుండా చెప్పడంవల్ల వీళ్ళకు తెలుసు ఆపైన ఎప్పుడు సుబ్బులింటికి వెళ్ళినా గడ్డం నున్నగా గీసుకొని వెళ్ళడం, వెళ్తూ "ఏమో ఎవరికి తెలుసు! ఏ అదృష్టాలు నాకోసం ఎదురుచూస్తున్నాయో!" అని రాజా అనటం మామూలయ్యాయి అందుచేత రాజా సుబ్బులింటికి వెళ్ళుండడు

"నిన్న పువ్వుల చొక్కా చారల బెల్‌బాటమ్స్ వేసుకోలేదు కనుక రోజా ఇంటికి కూడా వెళ్ళుండడు" అని మళ్ళీ సుబ్బారావే అన్నాడు

"వెళ్ళుండడు లాస్టు శాటర్‌డే నా చొక్కా చింపుకొచ్చాడు ఈసారి నా బట్టల జోలికి వస్తే చంపేస్తానని నిన్న పొద్దున్న గట్టి వార్నింగిచ్చాను" అన్నాడు విశ్వనాధం

రాజాకి రోజా అంటే బోలెడు ముద్దు కాని రోజాకి, రాజా పువ్వుల చొక్కా చారల బెల్‌బాటమ్స్ వేసుకొన్నప్పుడే ముద్దువస్తాడు రోజాకి ఓ బుచ్చి కుక్కపిల్ల ఉంది ఆ క్రితం శనివారం రాజా, రోజాని మంచిచేసుకోడానికి గాను "మీ కుక్కపిల్ల ముద్దొస్తోంది" అంటూ దాన్ని చంకనెక్కించుకొన్నాడు ఆ కుక్కపిల్ల రాజా వళ్ళో ఆడుకోగా రాజా వేసుకొన్న చొక్కా చిరిగింది కాని చిరిగింది రాజాది కాదు విశ్వనాధంది ఆ విషయం క్రితంరోజు వరకు దాచి విశ్వనాధానికి క్రితం రోజే చెప్పాడు అతగాడికున్న రెండో పువ్వుల చొక్కా అరువిస్తాడేమో నన్న ఆశతో విశ్వనాధం చచ్చేలా చివాట్లు వేశాడు

ఉన్నట్టుండి రెడ్డి, "రాజా ఏమయ్యాడో నాకు తెలుసు" అన్నాడు

"ఏమయ్యాడు?" మిగిలిన ముగ్గురు ఒకే సారి అడిగారు

"నిన్న సుబ్బారావు రాజా మాట్నీకివెళ్లారు మాట్నీ అయ్యాక ఈ సుబ్బిగాడు ఆ రాజా గాడిని ఎక్కడికో తీసుకువెళ్ళి హత్యచేశాడు"

"నేను హత్యచేసానా? నీకెల్లా తెలుసు? నే నెందుకు చేస్తాను?" సుబ్బారావు కంగారుగా అడిగాడు

"అల్లా అడుగు చెప్తాను మొన్నరాత్రి మీ నలుగురు బ్రిడ్జి ఆడారు నేను చూస్తూ కూర్చు న్నాను. అదేముందు సుబ్బారావు రాజాతో గమనించదగ్గ మాటలన్నాడు అవి యిక్క డున్న వాళ్ళంతా విన్నారు 'ఒరేయ్ రాజా! ఈరోజునగాని ఆట తప్పాడావనుకో నీ ప్రాణం తీస్తాను పూర్వంలా ఇది ఉత్తి బెదిరింపుకాదు నిజంగా తీస్తాను' అన్నాడీ సుబ్బిగాడు అవున?" రెడ్డి ఆగాడు

విశ్వనాథం ప్రసాద్‌లకి రెడ్డి ఏ దిక్కులో పోతున్నాడో అర్థంకాక "అన్నాడు అయితే?" అని ఒకేసారి అడిగారు

"ఆరోజు రాజా తప్పాడాడు ఎప్పుడు? వాళ్ళే ఆట గెలిచి:వల్నరబుల్‌గా ఉన్నప్పుడు పైగా మీరూరుకోరు పోయేదేముంది అని డబుల్‌చేసారు ఆ తప్పాడటంవల్ల గేము, రబ్బరు గెలవటంపోయి మూడు డౌనయ్యారు రాజా సుబ్బారావులు" రెడ్డి మళ్ళీ ఆగాడు

"అవు నా రోజు వెధవ చాలా పాయిం ట్లిచ్చాడు" అన్నాడు సుబ్బారావు గుర్తు తెచ్చుకొని

"ఈమాటలే అప్పుడూ అన్నావ్! కాని అగ్గిపోర్పుతో అన్నావు - 'ఒరేయి రాజా! ఇవ్వాళో రేపో నిన్ను చంపేస్తాన్రా' అంటూ ఆ మాటలు మొన్న అన్నావు, నిన్న వాడిని చంపవతల పారేసి చేతులు దులుపుకొంటూ ఇంటికొచ్చావ్!" రెడ్డి నేరం మోపాడు సుబ్బా రావు మీద

"సినిమా అయిపోగానే యెటో వెళ్లిపోయిన వాడిని నేనెల్లా చంపుతాను?" సుబ్బారావు రెడ్డి మాటలు కొట్టిపారేసాడు

"ఎటో వెళ్ళిపోయాడని నువ్వన్నావ్ ప్రూఫ్ లేదు చివరిసారిగా వాడితో బయటకు వెళ్ళింది నువ్వు నువ్వే ఒప్పుకొన్నావు నీతో వాడిని తీసుకువెళ్ళి, ఒంటరిగా తిరిగివచ్చావ్!" రెడ్డి తన వాదం విడిచిపెట్టలేదు

"ఒరేయి రెడ్డీ! వాడ్ని కాదుగాని నిన్ను చంపుతాన్రా!" అన్నాడు సుబ్బారావు కోపంగా

"మనకి పేకాటలో చాలాసార్లు పార్ట్‌నర్స్ మీద చాలా కోపంవస్తుంది నిజానికి చంపేయా లన్న కోపం వస్తుంది రావడంవరకు సబబే! కాని చంపడమే సబబుకాదురా సుబ్బయ్యా! రాజాని హత్యచెయ్యడం నీ మొదటి తప్పు అది పోల్చుకొన్న రెడ్డిని చంపుతానని బెదిరిం చటం రెండో తప్పు" అన్నాడు విశ్వనాధం మందలింపు ధోరణిలో

"రెడ్డిని బెదిరించినా, హత్యచేసినా నే నర్థం చేసుకోగలను ఎందుకోగాని ఆ కోరిక నాకూ కలుగుతూ ఉంటుంది కాని రాజాని హత్య చెయ్యటం మాత్రం నాకు నచ్చలేదు వాడు పాపం అమాయకుడు వాడి కళ్ళు అమాయ కంగా చారడేసి ఉండేవి" ప్రసాద్ సంతాపం ప్రకటించాడు

సుబ్బారావుకి మిగిలిన ముగ్గురు తనని హంతకుడిలా ఊహిస్తుంటే వళ్ళు మండి పోతోంది కాని అశక్తుడు

"సుబ్బిగా నువ్వు హత్య చెయ్యలేదని కోర్టులో తేలేదాకా నువ్వు గిల్టియే! ప్రసాద్! విశ్వం! వీడిని గట్టిగా పట్టుకోండి. నేను తాడు తీసుకువస్తాను కుర్చీకి కట్టేద్దాం ఆపైన పోలీసుల్ని పిలుచుకువద్దాం" అన్నాడు రెడ్డి

ప్రసాద్ విశ్వనాధాలు సుబ్బారావు పైకి లంఘించి అతన్ని కదలకుండా ఒడిసి పట్టు కొన్నారు రెడ్డి తాడు తెచ్చాడు ముగ్గురుకలిసి తనని తాళ్ళతో కడుతుంటే తను ఆ తాళ్ళనుంచి బయటపడ్డాక మిగిలినవాళ్ళ కాబోయే భార్యల తాళ్ళు తెంపేస్తానని సుబ్బారావు శపథం చేసాడు విశ్వనాధం పోలీసులకోసం బయ ల్దేర్తుంటే సుబ్బారావుకి హఠాత్తుగా ఓ విషయం గుర్తుకు వచ్చి, "ఆగు విశ్వం! ఈ హత్యచేసింది నేను కాదు నువ్వు!" అన్నాడు.

దాంతో కథ కొత్త మలుపు తిరిగింది.




ప్రసాద్, రెడ్డి ఆశ్చర్యంగా వింటుంటే,

"ఇందాక మీరంతా రాజా, క్రితం శనివారం విశ్వనాథం పువ్వుల చొక్కా వేసుకొని, రోజా ఇంటికివెళ్ళి చింపి తీసుకువచ్చాడని ఆ విషయం విశ్వానికి నిన్ననే తెల్పిందని వాడి నోటితోనే అనగా విన్నారు. ఆ చొక్కా విశ్వనాథానికి ఆరో ప్రాణం రాజాకి తను గట్టిగా వార్నింగిచ్చిన విషయం వాడే ఒప్పుకొన్నాడు విశ్వం: నువ్వు రాజానేమని బెదిరించావ్?" అని అడిగాడు సుబ్బారావు.

"ఏమన్నాను? కోపంలో నా చొక్కాలు వేసుకోవద్దని చెప్తే వినవు ఆ చొక్కా సాయంత్రం లోపల రిప్లేస్ చెయ్యి! లేకపోతే " విశ్వనాథంకి తన పొరపాటు అర్థమై ఆగిపోయాడు

"లేకపోతే పీక నులిమేస్తానన్నావు ఆ విషయం నిన్న సినిమాలో రాజా నాతో అన్నాడు అది రాజా మరణానికి ముందిచ్చిన మరణ వాంగ్మూలం రాజాకి నువ్వు తనని హత్య చేస్తావని తెలుసు అందుకే నువ్వు ఉరి కంబం ఎక్కకుండా తప్పించుకోరాదన్న ఉద్దేశంతో నాకీ విషయం చెప్పాడు" అన్నాడు సుబ్బారావు.

"ఏదో కోపంలో ఏదో అంటే మాత్రం" విశ్వనాథం తగ్గాడు

"నేనుమాత్రం కోపంలో అనలేదు ఒరేయి విశ్వం మన స్నేహితులకి కొన్ని వీక్‌నెక్‌లుంటాయి వాటిని చూస్తుంటే మనకి చంపేయాలన్నంత కోపం కొన్నిసార్లు రావడం సహజం కాని చంపుకొంటూపోతే స్నేహితులు మిగల్రురా!" అన్నాడు సుబ్బారావు కసి తీర్చుకొంటూ

"పోనీ నీమాటే తీసుకొందాం నేను వాడిని బెదిరించింది నిన్న పొద్దున్న. మధ్యాహ్నం నీతో సినిమాకి వెళ్ళిన రాజా సాయంత్రం ఇంటికి రాలేదు వాడిని నేను చంపడానికి మార్గంలేదే!" అన్నాడు విశ్వనాథం:

"ఇంటికి రాలేదనడానికి సాక్ష్యం ఏది? రాత్రి పదింటిదాకా ఎక్కడో చచ్చి, వచ్చుంటాడు వాడు నిద్రపోతుంటే పీక నులిమేసుంటావు" అని ఆరోపించాడు సుబ్బారావు

"బావుందిరా సుబ్బయ్యా! మరి శవాన్ని ఏంచేసుంటానంటావ్?" అని నవ్వుతూ అడిగాడు విశ్వనాథం, తను దాన్ని హాస్యంగా పరిగణిస్తున్నట్టు తెలియజేస్తూ

"తెల్లవారకట్టే శవాన్ని ఏ గోనెసంచీలోనో

## కొత్త కాంతులు సంతరించుకుంటున్న ఆంధ్రప్రదేశ్

ఆంధ్రప్రదేశ్ అపారమైన సహజ సంపదలతో తుల తూగుతూ వుంది.

దేశం నడిబొడ్డున అలరారుతూ ఉత్తర దక్షిణ ప్రాంతాలకు వారధిగా నిలుస్తున్నది. సహజ సంపదతో పాటు, ఆధునిక పరిశ్రమలు నెలకొల్పేందుకు అనువైన పరిస్థితులు కూడ అధికంగా వున్నాయి. అందుకు దేశం నలుమూలలనుంచి పారిశ్రామిక వేత్తలను ఆకర్షించగలుగుతుంది.

ఇప్పుడు మన రాష్ట్రంలో 260 భారీ, మధ్యతరహా పరిశ్రమలు ఉన్నాయి.

వీటి పెట్టుబడి రు. 478 కోట్లు.

ఈ పరిశ్రమల మూలంగా ఆంధ్రప్రదేశ్ స్వరూపమే మారిపోతూంది.

కాకినాడలో రు 232 కోట్లు ఖర్చుకాగల ఎరువుల కర్మాగారం నిర్మిస్తున్నారు. దీనికి 1978 జూలై 7న రాష్ట్రపతి శంకుస్థాపన చేశారు.

1981 నాటికి యీ కర్మాగారం ఉత్పత్తిని ప్రారంభిస్తుంది.

సాలీనా రు. 90 కోట్లు విలువచేసే 4.95 లక్షల టన్నుల యూరియా ఉత్పత్తిచేస్తుంది.

**డి. జి ఐ. అండ్ పి ఆర్**
**39/78-79**



కుక్క స్కూటర్ వెనకాతల కట్టుకొని వెళ్ళి ఊరవతల దుబ్బుల్లో పారేసుంటావు ''

"నేను గోనెసంచీలో శవాన్ని తీసుకు వెళ్ళడం యెవరైనా చూసారా?" అని విశ్వనాథం మిగిలిన ముగ్గుర్ని ప్రశ్నించాడు

రాజా దేహం గురించి విపరీతమైన శ్రద్ధ తీసుకొనేవాడు పగటిపూట కాలేజీకి, సాయంత్రాలు అమ్మాయిలకి, సూర్యోదయ పూర్వ కాలం దేహానికి రాజా కేటాయించేవాడు రాజాకి ఆడపిల్లలంటే వల్లమాలిన యిష్టం వాళ్ళకి బ్రూస్లీలాంటి దేహం ఉన్న అబ్బాయి లంటే ఇష్టం ఉంటుందని అనేవాడు అందుకని తనకి పొట్ట రాకుండాను, కండలు పట్టేటట్టుగాను జాగ్రత్తపడేవాడు అప్పుడప్పుడు విశ్వనాథం రాజాతో కలిసి ఊరు చివరదాకా పరుగెత్తేవాడు సుబ్బారావు ఆ విషయం గుర్తుచేస్తూ,

"నువ్వూ ఆ రాజా ఆరోగ్యంకోసం ఎన్నో సార్లు పొద్దునే పరుగెత్తడానికి వెళ్ళామని చెప్పారు మే మెప్పుడైనా చూసామా? మాకెవరికి తెల్లారే లేచే అలవాటు లేదు అందుకని చూసే అవకాశం లేదు రాజా ఎప్పుడు ఆరోగ్యమే మహాభాగ్యం, భాగ్యవంతులే అమ్మాయిల్ని ఆకర్షిస్తారు అనేవాడు భాగ్యవంతుల్ని దొంగవెధవలు హత్యచేస్తారని తెలియదు పాపం వాడికి'' అన్నాడు

"పోన్లే సుబ్బయ్యా! నువ్వన్నదే ఒప్పుకొన్నా, పొద్దున్నే స్కూటర్‌కి శవం వున్న గోనెసంచీ కట్టుకొని వెళ్తుంటే ఎవరికీ అనుమానం కలగలేదంటావా? అందులోను పోలీసులకి." న్యాయంగా మాట్లాడు అన్నధోరణిలో అన్నాడు విశ్వనాథం

తన పీక నులిమేస్తానన్న విశ్వనాథంమీద రెడ్డి కేమాత్రం ప్రేమా గౌరవం లేకపోగా కోపం కసీ ఉన్నాయి. అందుకని "ఒరేయి విస్సిగాడి మాటలు వింటుంటే ఏమనిపిస్తోంది హత్య ఎల్లా చేస్తే దొరకకుండా తప్పించుకోవచ్చు అని చాలా ఆలోచించినట్టు కనిపిస్తోంది అందుకని వాడు రాజాని మన యింట్లో చంపి ఉండడు. ఇవాళ పొద్దున్న యధాప్రకారం ఊరవతలకి వీళ్ళు పరిగెత్తి వెళ్ళి వుంటారు వ్యాయామం కోసం అక్కడ రాజా పరధ్యానంగా ఆలోచిస్తూ వుంటే వీడు వాడినెత్తిన పెద్ద రాయి పడేసి వాడిని చంపి అప్పైన వాడి శవాన్ని గొయ్యితీసి కప్పెట్టేసి వుంటాడు పొద్దున్న నేను బనియనుమీద మట్టేమిట్రా? అని అడిగితే మొక్కలకి గొప్పులు తవ్వాను అన్నాడు వానపడబోతుంటే యెవరైనా గొప్పులు తవ్వుతారా?" అన్నాడు

"నిజమేరోయి! విశ్వానికి హత్య చెయ్యడానికి అవకాశం ఉంది'' అని గుర్తించాడు ప్రసాద్

"కనక బాబుల్లారా! నన్ను వదిలేసి వాడిని కుర్చీకి కట్టండి" అని సుబ్బారావు సూచించాడు

"మోటివ్, అవకాశం ఇద్దరికి వున్నాయి ఎలిబీ ఇద్దరికి లేదు'' ప్రసాద్ ఆలోచనలో పడ్డాడు

"ఒకే శవం రెండు హత్యలు అయ్యబాబోయి! ఇద్దరు హంతకులున్నారీ యింట్లో'' రెడ్డి గెంతాడు

"కావాలంటే నన్ను కట్టేయండి గాని వాడిని వదలకండి న్యాయస్థానంలో నిజానిజాలు తేల్తాయి'' అన్నాడు విశ్వనాథం మరో కుర్చీలో కూర్చుంటూ

ప్రసాద్, రెడ్డి రాజా మంచితనాన్ని ఇతర గొప్ప గుణాల్ని పొగుడుతూ విశ్వనాథాన్ని బంధించారు వీళ్ళ ధోరణి చూస్తుంటే విశ్వనాథానికి సుబ్బారావుకి వళ్ళు మండిపోయింది సుబ్బారావు విశ్వనాథానికి కన్ను మలిపాడు వీళ్ళనో ఆట పట్టిద్దామని విశ్వనాథం సరేనన్నట్టు కళ్ళెగురవేసాడు

"రాజా మొన్న మనింటికి ఆ సరస్వతిని తీసుకువచ్చాడు గుర్తుందా రెడ్డీ!" అన్నాడు సుబ్బారావు

"ఉంది'' అన్నాడు రెడ్డి.

"ఎవరూ ఆ పుస్తకాల దయ్యం తీసుకు వెళ్ళిన పుస్తకాలని మాయంచేసే మహామ్మారి ఆ సరస్వతిని మళ్ళీ మనింటికి తీసుకువచ్చాడా"

అని ఆశ్చర్యపోయాడు విశ్వం

"సరిగ్గా ఆ సరస్వతినే గత సంవత్సరం ప్రసాద్ పుస్తకాలు వారంలో తిరిగిచ్చేస్తానని తీసుకువెళ్ళి ఇంతవరకు ఇవ్వని సరస్వతినే తీసుకువచ్చాడు ఆ అమ్మాయి మనింట్లోంచి ముళ్ళపూడి పుస్తకాలు తీసుకువెళ్ళింది ప్రసాద్ బెజవాడంతా గాలించికొన్న పుస్తకాలు!" అన్నాడు సుబ్బారావు తాపీగా

"బాబోయి నా పుస్తకాలు! ఏం నేతున్రా దేవుడా! నా పర్మిషన్ లేకుండా రాజా ఎల్లా ఇచ్చాడు?" అని గోలపెట్టాడు ప్రసాద్

"పర్మిషనడిగితే నువ్విస్తావుట్రా ప్రసాదం!" అని అడిగాడు విశ్వనాథం

"అందుకని నన్ను మాటవరసకైనా అడగకుండా ఆ రాజా నా పుస్తకాలిస్తాడా? ఆ రాజా——" అని ఆవేశంతో ఊగిపోయాడు ప్రసాద్

"చాలా మంచివాడు వాడి కళ్ళుచారదేసి" అని పూర్తిచేసారు విశ్వనాథం, సుబ్బారావు.

"ఏం కాదు! వాడు దుర్మార్గుడు! వాడిని మీ యిద్దర్లో కనీసం ఒకడైనా హత్యచేసాడా? లేకపోతే వాడిని నేను చంపుతాను" ప్రసాద్ శపథం చేసాడు

"ఏంఅబద్ధాలాడుతున్నావురా నాయనా మొన్న రాత్రి నీకు సరస్వతి మనింటికి వచ్చిన విషయం చెప్పాను" అన్నాడు సుబ్బారావు

"అవును చెప్పావు ఆ పిల్ల కనిపిస్తే కింద టేడు తీసుకువెళ్ళిన రాచకొండ కలెక్షన్ వెనక్కి ఇమ్మని అడిగేవాడిని కదా! అనుకొన్నాను అంతేగాని అప్పుడు నాకా అమ్మాయి నా ముళ్ళపూడి కలెక్షన్ పట్టుకుపోయుంటుందన్న విషయం తట్టలేదు" అన్నాడు ప్రసాద్

"సుబ్బారావు నీతో చెప్తున్నప్పుడు నేను ప్రక్కనే ఉన్నాను అప్పుడే మన్నావో చెప్పనా! అవకాశం దొరకగానే వాడిని చంపేస్తానన్నావు ముళ్ళపూడి రాచకొండలమీద ఆన అన్నావు రెడ్డీ మా కట్లు విప్పేయి వీడే ఆ రాజాని చల్లగా చంపి దూరంగా పారేసి ఉంటాడు ప్రసాద్‌ని కట్టెయ్యాలి మనమంతా" అన్నాడు

రెడ్డి విశ్వనాథాన్ని, సుబ్బారావుని విడిపిస్తూ "అయ్యబాబోయి ఇక్కడ ప్రతీవాడికి హత్య చెయ్యడానికి ఒక కారణం వుంది'' అన్నాడు

"ఆగు రెడ్డీ! ఆ మాట మళ్ళీ అను" అన్నాడు ప్రసాద్

"హత్య చెయ్యడానికి ఇక్కడున్న అందరికి తలా ఒక కారణం ఉంది అన్నాను"

'అంటే నీకు కూడా కదా?"

"నాకా! నేను సాధువుని కారణం ఉన్నా, హత్యచెయ్యను రాజా నా ప్రాణస్నేహితుడు"

"ప్రాణ స్నేహితులన్నాక ఇచ్చి పుచ్చుకోడాలుంటాయి కదా ప్రాణాల విషయంలో" అన్నాడు విశ్వనాథం

"ఒరేయి విస్సిగా! ఈ ప్రసాద్ తమాషాకి అంటున్నాడు సీరియస్‌గా తీసుకోకు నువ్వు మాత్రం సీరియస్‌గా తీసుకొంటున్నావేమిటి? ఏదో నన్ను ఆటలు పట్టిద్దామని అంటున్నావు గాని కదురా! నీకు సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఎక్కువరా" అంటూ రెడ్డి దాన్నో జోక్‌గా జమకట్టెయ్య బోయాడు

"ఇంతకు వాడికున్న కారణం ఏమిటి?" అని సుబ్బారావు ప్రసాద్‌ని అడిగాడు ప్రసాద్ గుర్తుచేసాడు

బుధవారం రాత్రి వాళ్ళంతా యథాప్రకారం అడ్డాట ఆడుతున్నారు రెడ్డి అందరి ముక్కలు చూసి రాజాదగ్గర ఒంటరి మణేలా ఉందని ప్రసాద్‌కిచెప్పి ప్రసాద్‌కి జాకీ ఆడమని సలహా పారేసాడు ప్రసాద్ సలహా మేరకు ఆడి రాజా మరేలా రాల్చాడు

"రాజా అప్పుడే రెడ్డిని పాతేస్తా నన్నాడు" అన్నాడు ప్రసాద్

"నీమాట ప్రకారం రాజా నన్ను హత్య చేసుండాలి! నేను బతికే ఉన్నాను నేను చచ్చిపోయినప్పుడీ విషయం చెప్పాలి ఇవాళ చెప్పాల్సిన కథకాదు ఇది" అన్నాడు రెడ్డి సంబరంగా

"కాని రెడ్డి ఇల్లాంటిపనే మళ్ళీ శుక్రవారం,




రాత్రి సరస్వతి వెళ్ళిపోయాక మనం పేకా డుంటే చేసాడు అప్పుడు రాజా " అని ప్రసాద్ చెప్పబోతుండగా

"నన్నుప్పుడు పాతరవేస్తానన్నాడు. ఇంకేం వేస్తాడు పాపం వాడినే, మీలో ఎవరో ఒకరు వేసారు" అన్నాడు రెడ్డి

"మాలో ఒకరుకాదు వేసింది నువ్వు" అన్నాడు సుబ్బారావు శుక్రవారం రాత్రి జరిగిన కథ గుర్తు తెచ్చుకొని

"నువ్వు నన్ను చంపేలోపల నేనే నిన్ను చంపేస్తాన్రా రాజా! అన్నావు వాడితో గుర్తుందా?" అన్నాడు విశ్వనాథం

"అంటే అన్నానేమో. కాని నాకు అవకాశం లేదే!" అన్నాడు రెడ్డి నిబ్బరంగా

"ఉంది అదే నేను చెప్ప దల్చుకొన్నది నిన్న పొద్దున్న కాలేజీకి వెళుతూ రాజా తనకి తలనొప్పిగా ఉందన్నాడు నువ్వు వాడికి మందనిచెప్పి ఏదో మాత్రిచ్చావు" అన్నాడు ప్రసాద్.

"అవును నాది జాలిగుండె."

"అవును జాలితో వాడికి తలనొప్పి మందని చెప్పి విషం ఇచ్చావు రెడ్డీ! విషాన్నిచ్చావ్!"

"హాస్యాన్నికూడాఅంతుండాల్రాప్రసాద్ ఆ మాత్ర రాజా నిన్న పొద్దున్న కదా వేసుకొంది నిన్నసాయంత్రం మేటనీ అయ్యేవరకు ఏ వికారం లేకుండా ఉన్నాడని సుబ్బారావు ఇందాక స్టేట్‌మెంటిచ్చాడు అంటే రాత్రి ఏ పదింటికో ఇంటికివస్తూ ఢామ్మని రోడ్డుమీద చచ్చిపోయాడంటావా నేనిచ్చిన విషంవల్ల! అదేమన్నా సినిమాల్లో చూపించే టైము బాంబా? అయినా నే నిచ్చింది తలనొప్పిమాత్రని విషం కాదని మీ అందరికి తెలుసు" అన్నాడు రెడ్డి తనని వాళ్ళు ఆటలు పట్టిస్తున్నారన్న విషయంలో తన కేమాత్రం అనుమానం లేదన్న ధోరణిలో

"నాకేం తెలియదు నాకు తెలిసిందల్లా మీ ముగ్గురిలో ఒకడు హంతకుడు" అన్నాడు సుబ్బారావు

"కాదు మీ ముగ్గుర్లో" అన్నాడు విశ్వనాథం

"మీ ముగ్గుర్లో" అన్నాడు ప్రసాద్, మిగిలిన ముగ్గుర్ని ఉద్దేశించి

"కాదు బాబోయ్ మీ ముగ్గుర్లో" అన్నాడు నెత్తి నోరు కొట్టుకొంటూ రెడ్డి.

# పల్లెపథంలో ప్రగతి రథం

ప్రగతి రథం ఇప్పుడు పల్లె పథంలో పయనిస్తోంది.

పల్లె ప్రజల అభ్యున్నతికోసం ఎన్నో ప్రణాళికలు తయారు చేస్తున్నారు.

నిర్దిష్ట కాలపరిమితిగల కార్యక్రమాలెన్నో చేపడుతున్నారు.

అభివృద్ధి ప్రణాళికల, కార్యక్రమాల ఫలితాలు పేద ప్రజలకు

అందేలా చేయడానికే కనీసావసరాల కార్యక్రమాన్ని చేపట్టారు.

ప్రగతి రథం కదలాలంటే చక్రాలలోని ఆకులన్నీ సమంగా, బలంగా వుండాలి.

గ్రామ విద్యుదీకరణ, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల ఏర్పాటు,

మంచినీటి సౌకర్యాల కల్పన, మురికివాడల పరిశుభ్రం, మంచి బాటలు నిర్మించడం, ఇవన్నీ రథ చక్రాల్లో ఆకుల్లాంటివే. అందుకే వీటన్నిటికీ అధిక ప్రాముఖ్యత నిస్తున్నారు.

ఇందుకోసం .

ఐదవ ప్రణాళిక పెట్టుబడిలో ఉద్దేశించిన రు. 50 కోట్లలోనూ రు. 43.40 కోట్లు ఇప్పటికే ఖర్చుచేశారు.

**డి. జి. ఐ. అండ్. పి. ఆర్.**

**40/78–79**



ఆ ముగ్గురు అల్లా పరస్పరం హత్యాళియోగాలు చేసుకొంటుంటే రాజా ఊడిపడ్డాడు తూలిపడ్డాడు వీధిలోంచి వచ్చి కుర్చీలో కూలబడ్డాడు

దెయ్యం అని అరిచాడు రెడ్డి మిగిలిన ముగ్గురు ఏకీభవించారు రాజా తను బతికే ఉన్నానంటూ మొరపెట్టుకొన్నాడు

మిగిలిన నలుగురూ ఒకళ్ళ నొకళ్ళు గిల్లుకున్నారు ఆపైన ఎందుకైనా మంచిదని రాజాని గిల్లి చూసారు అతను గోలపెట్టాడు ఆవిధంగా వచ్చింది రాజా దయ్యం కాదని రాజామేనని నిర్ధారించుకొన్నారు సుబ్బారావుకి అతని గురించి తాముపడ్డ హైరానా అంత గుర్తుకువచ్చి

నిన్న సాయంత్రం నేను నిన్ను అర్ధరూపాయి యిచ్చి వదిలిపెట్టాక ఇప్పటివరకు ఎక్కడ చచ్చావు? అని కోపంగా ప్రశ్నించాడు

రాజా ఆ చిన్నకథ చెప్పాడు రాజా క్రితం రోజు సాయింత్రం సుబ్బారావుదగ్గర అర్ధరూపాయి అప్పుచేసే ఫ్రెండింటికి అప్పుకోసం వెళ్ళాడు అతను అప్పిస్తే విశ్వనాధానికి తను చింపుకువచ్చిన చొక్కా తాలుకు నష్టం భర్తీ చేద్దామనుకొన్నాడు అయితే అక్కడ పరిస్థితులు రాజా ఎదురుచూడనివి ఆ స్నేహితుడి భార్య తప్పనిసరై భర్తను వదిలిపెట్టి పుట్టింటికి వెళ్ళింది ఆ ఫ్రెండ్ స్ప్రింగ్‌ని నొక్కి ఉంచి ఒక్కసారిగ వదిలిపెడ్తే ఎలా ఎగిరెగిరి పడ్తుందో అల్లా ఎగిరిపడ్తూ భార్య అక్కడ లేక పోవడాన్ని సెలబ్రేట్ చేసుకొనే మూడ్‌లో ఉన్నాడు రాజాని చూడగానే కౌగలించుకొని కంపెనీ ఇమ్మని బతిమాలాడు ఖర్చు తనదే నన్నాడు ఇద్దరు తాగి హోటలుకు వెళ్ళి భోంచేసి తిరిగి ఫ్రెండింటికి వచ్చి తిరిగి తాగారు పొద్దున్న లేచేసరికి ఆలస్యం అయింది రాత్రి తాగగా మిగిలిపోయిన ద్రవాలు వానపడ్తున్న కారణంగా పొద్దున్న ఖాళీ చేసారు మళ్ళీ నిద్రపోయారు సాయంత్రం లేచి రాజా నడిచి కార్లని బళ్ళని తప్పించుకొంటూ రాలేదు కనక రిక్షాలో బుద్ధిగా వచ్చాడు రిక్షావాడికి డబ్బు ఆ స్నేహితుడే ఇచ్చాడు ఈ కథంతా చెప్పి

ఇదిగోరా సుబ్బారావు నీ అర్ధరూపాయి అవుసరం లేకపోయింది అని తిరిగి ఇచ్చాడు

నా చొక్కా మాటేమిటి? విశ్వనాధం నిలదీసాడు

సరస్వతి తీసుకువెళ్ళిన నా పుస్తకాల సంగతి? ప్రసాద్ నిలదీసి పట్టుకొని ప్రశ్నించాడు

సరస్వతి రాగానే ఊరెళ్ళిందిలే అవి తీసుకొని ఇప్పించేస్తాను జీతాలురాగానే చొక్కా కొనేస్తాను ఇద్దరికి పనికి వస్తుంది అంటూ రాజా నిలవలేక కుర్చీలోకి జారిపోయాడు

ఇవాళ రాజా వేసుకొన్న చొక్కా నాది వీడిని అంటున్న రెడ్డికి సాయం వచ్చి

చంపేద్దాం అన్నారు మిగిలిన ముగ్గురు □

# ప్రణాళికాయుగంలో కొత్తమలుపు

మన రాష్ట్రంలో ప్రణాళికా విధానం కొత్త పుంతలు తొక్కుతోంది.

1978–79 సంవత్సరాల మధ్యకాలంలో రు. 3966 కోట్లు ఖర్చుకాగల మధ్యకాలిక ప్రణాళికను కొత్త పంథాలో రూపొందించారు.

నిర్మాణాత్మకమైన సత్ఫలితాలు సాధించడానికి అనువుగా ఆరవ ప్రణాళికలో వివిధ రంగాలకు పెట్టుబడులు కేటాయించారు.

ఈ మధ్యకాలిక ప్రణాళికలో నీటిపారుదల, విద్యుచ్ఛక్తి రంగాలలో పెట్టుబడిని కొంత తగ్గించారు. అదే మొత్తంలో పరిశ్రమలు, గనులు, సాంఘిక సంక్షేమ రంగాల పెట్టుబడిని అధికం చేసారు.

ఇందువలన సత్ఫలితాలు సాధించడానికి వీలవుతుంది. అందుకే మన ప్రణాళికా విధానంలో కొత్త మలుపు ఏర్పడింది.

**డి.జి.ఐ. అండ్ పి. ఆర్.**

**41/78—79**






"అన్నయ్యా—ఆ బొమ్మ చాలా బాగుంది కదూ?" అన్నాడు ఏడేళ్ళ నా తమ్ముడు రామం.

నేను మాట్లాడకుండా ముందడుగు వేశాను

రోడ్డుమీద తన కంటికి నదురుగా కనిపించిన ప్రతి వస్తువు గురించీ రామం నాతో చెబుతూనే వున్నాడు కానీ ఒక్కటీ కొనమని అడగడు. అలా అడగడం తప్పని మా ఇంటిలో అందరమూ వాడికి చెప్పాము. కానీ వాడు పసివాడు. అందువల్ల కొనమని అడగకపోయినా తన ఉద్దేశ్యాన్నీ విధంగా సూచిస్తూంటాడు వాడు. తను నచ్చిందని చెప్పిన వాటిలో ఒక్కటంటే ఒక్క వస్తువు కొనివుంటే—వాడి దృష్టి ఇతర వస్తువుల నుంచి కాస్త తప్పుకుని వుండేదేమో—

నేను మంచి ఉద్యోగమే చేస్తున్నాను. బాగానే సంపాదిస్తున్నాను. కానీ నాకు సంపాదనకు మించిన బాధ్యతలున్నాయి. ఆ బాధ్యతల వల్ల ప్రతి పైసనూ బాగా ఆలోచించి మరీ ఖర్చుపెడుతూంటాను

ప్రస్తుతం నా భార్య పురిటికి పుట్టింటికి వెళ్ళింది. నే నొక్కడినే వుంటున్నాను. కొన్నాళ్ళపాటు వుంటాడని ఇంటి దగ్గర్నుంచి రామాన్నీ తీసుకువచ్చాను. రామం నా ఆఖరి

తమ్ముడు వాడెప్పుడూ విశాఖపట్నం చూడ లేదు.

శ్రీమతి లేకపోవడం వల్ల ఖర్చులు బాగా తగ్గాయి డబ్బులు మిగుల్తున్నాయి

అదేమిటోగానీ భార్య దగ్గర లేనందుకు అందరిలా తను తపించిపోవడంలేదు. అందు వల్ల కలిగే లాభాన్ని అంచనా వేసుకుంటు న్నాడు.

నా భార్య అనుకూలవతి నా మనసుకు నచ్చిన మనిషి. తను కాపురానికి వచ్చి శారీరకంగానూ, మానసికంగానూకూడా ఎంతో సుఖపెట్టిందామె నన్ను ఇంటి ఖర్చుల విషయంలోకూడా ఎంతో పొదుపుగా వ్యవహ రిస్తుంది అందరి ఆడవారిలా చీరెలూ, నగలూ కావాలని వేధించదు సరిగదా నేను కొంటా నంటే వారిస్తుంది

మా వివాహమై నాలుగు సంవత్సరాలు కావ స్తోంది. ఈ నాలుగు సంవత్సరాలూ నాలుగు క్షణాల్లా దొర్లిపోయాయి అందుకు మరో కారణం కూడా వుంది ఈ నాలుగేళ్ళూ మేము పిల్లలు కలక్కుండా జాగ్రత్తపడ్డాము ఇప్పుడే మొదటిసారిగా పురిటికి పుట్టింటికి వెళ్ళిందామె.

ఈ నాలుగేళ్ళలోనూ నాలుగుసార్లు పుట్టిం టికి వెళ్ళింది శ్రీమతి. తండ్రి స్వయంగా వచ్చి ఆమెను పుట్టింటికి తీసుకెళ్ళాడు. మొదటిసారి ఆమె పుట్టింటికి వెళ్ళినప్పుడు ఒంటరితనంతో నేను చాలా బాధపడ్డాను. ఆమె కూడా అలానే బాధపడింది కానీ తలిదండ్రుల బలవంతంవల్ల అక్కడే అయిదారు వారాలపాటుండిపోవలసి వచ్చింది

ఈ అయిదారు వారాల్లోనూ నాకు నూట యాభై రూపాయల్పైగా కలసి వచ్చింది అప్పుడే నేను ఆమెను పుట్టింటికి పంపడం రుచి మరిగాను. నూటయాభై రూపాయలంటే సామాన్యమైన మొత్తం కాదు నాకు అందుకే ప్రతి సంవత్సరం విధిగా ఆమెను ఓ నెలరోజు లయినా వుండేవిధంగా పుట్టింటికి పంపేస్తూ వుంటాను.

ఇప్పుడు నా జేబులో కాస్త డబ్బులు ఆడు తున్నాయి. ఈసారి నా భార్య పుట్టింట్లో అయి దారు నెలలవరకూ ఉండవచ్చు. ఈ అవకాశా న్నుపయోగించుకుని కనీసం నాలుగయిదువంద లయినా పోగుచెయ్యాలి

కాస్త డబ్బు చేతిలో ఆడుతుండడంవల్లనే తమ్ముడి కోసం రెడీమేడ్‌లో ఓ జత బట్టలూ, కాళ్ళకు జోళ్ళూ కొన్నాను ఎందుకంటే రేపు నా స్నేహితుడి చెల్లెలి పెళ్ళి. ఆ పెళ్లికి నేను వెళ్ళాలి.

ఆ స్నేహితుడు బాగా డబ్బున్నవాడు. చెల్లెలి పెళ్లి వైభవంగా జరిపించబోతున్నాడు. ఆ పెళ్లికి నేను వెళ్ళాలి నాతోపాటు నా తమ్ముడూ వస్తాడు నా ఆర్థిక పరిస్థితి ఎటు వంటిదయినా నేను చేస్తున్న వుద్యోగాన్నిబట్టి సంఘంలో నాకొక హోదా వుంది. ఆ హోదాను నిలబెట్టుకునే రీతిలో నేనూ, నా తమ్ముడూ అక్కడ వుండాలి అందుకే తమ్ముడికి బట్టలూ, జోళ్ళూ కొన్నాను. పెళ్లికి ఖరీదయిన ప్రజంటేషన్ కొన్నాను

బట్టలూ, జోళ్ళూ కొనమని తమ్ముడు అడగలేదు. అయినా అవి కొన్నాను. స్నేహి తుడి చెల్లెలికోసం కొన్న ఖరీదయిన ప్రెజెం టేషన్ కూడా వాడు చూశాడు వాడి చిన్న బుర్రకు ఏం తోచిందో, వాడి పసి మనసులో ఏం ఆశలు రేగాయో తెలియదుకానీ వాడా క్షణం నుంచీ తన కంటికి నదురుగా కనిపిం చిన ప్రతి వస్తువు గురించీ నాతో చెబుతు న్నాడు

పాపం వాడికి తెలియదు - వాడి ఇష్టా ఇష్టాల ననుసరించి వస్తువులు కొనే ఆర్థిక స్తోమత నాకు లేదనీ-వాడికేమయినా కొంటే నా స్వార్థానికి సంబంధించిన ఇతర విషయాలు కారణమనీ అర్థం చేసుకునే వయసు కాదు వాడిది

ఏమైతేనేం కోరిన విధంగా—మర్నాడు పెళ్ళికి వెళ్లాం ఆ పెళ్ళి చెప్పలేనంత వైభ వంగా జరిగింది పెళ్లికి వచ్చినవాళ్ళలో నేనూ,




నా తమ్ముడూ కూడా సమంగా కలసి పోగలిగాం.

*　　*　　*

"కమాన్ మిస్టర్ మధూ—" అన్నాను. అతనితో చేతులు కలిపేలోగా—"మిస్టర్ శంకర్—ఇప్పుడా రావడం?" అంటూ నిష్టురమాడాను అప్పుడే వస్తున్న శంకర్‌ని చూసి.

నేను నీలా బిజీగా ఉన్నాను. అవును మరి-బిజీ అంటే అంటే బిజీకాదూ—చెల్లెలి పెళ్ళి—!

ఎంతో వైభవంగా వివాహం జరిగింది. అందరూ నాన్నగారిని కాదు—నన్నే మెచ్చుకుంటున్నారు. "కుర్రాడు ఏం చలాకీ అయిన వాడండీ—ఒక్క చేతిమీద ఏం చక్కగా జరిపించాడు. ఎలాగైనా చదువుకున్నవాళ్ళ పద్ధతులే వేరు " అంటూ పొగిడేశారు.

చాలామంది నావంటి కొడుకును కన్న నాన్నగారి అదృష్టాన్నభినందించారు. నాన్నగారు తమాషాగా మీసాలు దువ్వి అదోరకమైన నవ్వు నవ్వారు. ఆ నవ్వులో గర్వముంది.

ఇప్పుడు ఆ పెళ్లికి రిసెప్షన్ యేర్పాటు చేశాను. అది సమయం రాత్రి ఎనిమిది కావస్తోంది. కనుచీకటిగా వుంది. ఆవరణలో నేను ఎరేంజ్ చేసిన నియాన్ లైట్లు వెలుగుతున్నాయి.

నా ముఖ్యస్నేహితులు వస్తున్నారని పరుగెత్తుకు వచ్చానుకానీ అంతవరకూ రిసెప్షన్ వద్ద నేను లేను. నా ప్రాణమిత్రుడు మూర్తీ, చెల్లెలి స్నేహితురాలు సుభద్రా అక్కడ వున్నారు.

అతిధులందరికీ టేబిల్‌మీల్స్ యేర్పాటు చేయించాను. అందుకు కావలసిన టేబిల్సూ, కుర్చీలూ సంపాదించడానికి పలుకుబడితోబాటు డబ్బుకూడా బాగానే ఖర్చయింది. డిన్నర్ గ్రాండ్‌గా ఉండాలని నా అభిప్రాయం. అందుకే అయిటమ్స్‌లో రెండు స్వీట్సు ఇంక్లూడ్ చేశాను. మైసూర్‌పాక్, గులాబ్‌జాం, ఇవికాక చక్కెరకేళీ అరటిపళ్ళు. హోటలో పులిహోర మామూలే—ఇవికాక వెజిటబుల్ పలావ్. బంగాళాదుంపల కూర. అన్నం—పెరుగు. చదువుకునే రోజుల్లో హాస్టల్లో జరుపుకునే విధంగా అయిటమ్స్ ఎరేంజ్‌చేశాను.

డిన్నర్ అనంతరం అతిధులకు సిగరెట్ ప్లస్ కిళ్ళీ. ఒక్క సిగరెట్, కిళ్ళీ, అరటిపళ్లు

తిప్ప మిగతా అయిటమ్సన్నీ ఇంట్లో తయారయినవే. ఎక్కువ ఛార్జీచేసే మంచి వంట వాళ్ళని తయారీకి కుదిర్చాను.

ఆహ్వానించిన అతిథులందరూ వచ్చేశారు. రిసెప్షన్ దగ్గరున్న బల్లలు ప్రెజంటేషన్స్‌తో నిండిపోతున్నాయి. ఆ ప్రాంతంలోనే కూర్చుని ఉన్న నా చెల్లెలు, బావగారు తమమీద కురిసే అభినందనల పరంపరలకు తట్టుకోలేకఉక్కిరై పోతున్నారు.

నా చెల్లెలు చాలా సిగ్గుపడుతోంది. కానీ దాని కళ్ళలో మెరుపుఉంది. మంచి హోదాలో వున్న అందమైన భర్తా, ఆ భర్త తనకు లభించిన తీరూ రెండు కలసి దానికళ్ళలో ఆ మెరుపు యేర్పడిందని నాకు తెలుసు.

"ఈడూ జోడూ యెంత బాగా కుదిరిందో చూశారా?" ఒక భార్య భర్తతో అంటోంది. "ఎందుకు కుదరదు. పదిహేనువేల కట్నం మరి" అన్నాడు భర్త.

"అయిదువేల కట్నానికే మొహం మాడ్చుకున్నాడు మీ అన్నయ్య—ఆతనికి చెల్లెలిమీద ఎంత ప్రేమ—" అంటున్నాడో భర్త.

"అవును మరి—ఇతనికి ఒకే ఒక చెల్లెలు· ఖర్చు పెట్టకేం చేస్తాడు" అంటూ జవాబిస్తోంది భార్య.

"ఒకే చెల్లెలు " అని నవ్వుకున్నాను నేను.

*   *   *

హఠాత్తుగా మెలకువ వచ్చింది.

ఎప్పుడూ యింతే-మంచిపెళ్ళి చూసివచ్చినప్పుడల్లా నాకిటువంటి కల వస్తూంటుంది. ఆ కల సరిగ్గా అక్కడే ఆగిపోతూంటుంది. అక్కడే ఒకే ఒక చెల్లెలు దగ్గర.

కలకీ ఇలకీ అక్కడే తేడా వుంది.

నేను పదో ఏట ఒక పెళ్ళికి వెళ్ళాను. ఆ పెళ్ళి ఒక అన్నగారి ఆధ్వర్యంలోనే చెల్లెలికి జరిగింది. ఎంతో వైభవంగా జరిగిన ఆ పెళ్లిలో అందరూ ఆ అన్నగారిని అభినందించారు. ఆ అభినందనలు వింటున్నపుడే నాకు కోరిక కలిగింది. నేనూ నా చెల్లెలి పెండ్లి అంత వైభవంగానూ చేసి అలా అభినందనలు పొందాలని. అప్పుడే నేను చెల్లెలి పెళ్ళి గురించి కలలు కనడం మొదలు పెట్టాను. అప్పట్లో నా కల ఒకే ఒక చెల్లెలు దగ్గర ఆగేది కాదు· ఎందుకంటే అప్పటికే ముగ్గురు చెల్లెళ్ళున్నారు నాకు. అయినప్పటికీ వైభవంగా వివాహం జరిపించడం కష్టమని నాకు తెలియదు. ఎవరేనా లేపడంవల్లకానీ, మంచం మీంచి కింద పడిపోవడంవల్లకానీ నిద్రాభంగమై కల ఆగిపోయేది అప్పట్లో.

మేము ఆస్తిపరులమే మరి. బాగా పండే పదెకరాల భూమి ఉంది. బాగా చదువుకునే నేనున్నాను. కానీ

కానీ నా తర్వాత వరుసగా అయిదుగురు ఆడపిల్లలు. ఆ తర్వాత రామం.

వీళ్ళు మాకు దక్కినవాళ్ళు. దక్కకుండా పోయినవాళ్ళు ముగ్గురున్నారు. అందులో ఇద్దరు పురిట్లోనే పోయారు. ఒకడు మూడేళ్ళు మాత్రం బ్రతికాడు. ఇవికాక అమ్మకు ఒకసారి గర్భస్రావమయింది.

పిల్లల మూలంగా అమ్మ ఆరోగ్యం చెడింది. అందరినీ ఆమె సమర్ధించుకు రాలేకపోయేది. సరయిన ఆలనా పాలనాలేక పిల్లల ఆరోగ్యాలు కూడా అంతంతమాత్రంగా వుండేది· ఫలితంగా నాన్నగారి బడ్జెట్‌లో మందులకింద చాలా ఖర్చయ్యేది.

నా చదువు పూర్తికాకుండానే మొదటి చెల్లెలి పెళ్ళి చేశారు నాన్నగారు. ఈ పెళ్లిలో నా పాత్ర ఏమీ లేదు. పెళ్లి సామాన్యంగానే జరిగిపోయింది. నా కలలో పెళ్లికీ దీనికీ సామ్యం లేదు. అమ్మ దగ్గర ఒకటి రెండు సార్లు గొణిగాను-పెళ్లికి ఇంకాస్త ఖర్చుచేసి వుండవలసిందని.

అమ్మ నవ్వి—"బాగుందిరా - మనకిద్దొక్కర్తే ఆడపిల్లేమిటి? ఇంకా నలుగురున్నారు" అంది.

అప్పుడే నాకో భయం కలిగింది. ఆ

భయం ఇది అని చెప్పలేనుకానీ అప్పట్నుంచీ నా కల ఒకేఒక్క చెల్లెలు దగ్గర ఆగిపోతోంది.

అయినా నా కలలో నాకు ఒకే ఒక చెల్లెలు. లేకపోతే కలలో కూడా అలాంటి వివాహం నేను చేయలేను.

నేను యమ్మెస్సీలో వుండగా నా రెండో చెల్లెలి వివాహం జరిగింది. మొదటి వివాహం కంటే తీసికట్టుగా జరిగింది. ఈసారి నేనేమీ మాట్లాడలేకపోయాను.

నేను వుద్యోగంలో ప్రవేశించాక ఇంటి పరిస్థితులు బాగా అర్థం అయ్యాయి. నాన్నగారి యిబ్బందులు అర్థం కాసాగాయి. కానీ కానీ ఎవరా ఇబ్బందులకు కారకులు అని ఆలోచించినప్పుడల్లా అయనమీద జాలి కలగదు.

ఆయనకు చాలా అప్పులున్నాయని తెలుసుకుని నా జీతంలోంచి వీలయినంత ఎక్కువగా ఆయన కోసం కేటాయించసాగాను. చెల్లెళ్ళ పెళ్ళయ్యేవరకూ వివాహం చేసుకోకూడదనుకున్నాను. కానీ చెల్లెలి పెళ్ళి కోసమే-నేనూ వివాహం చేసుకోవలసి వచ్చింది. బజార్లో నా ధర పదివేలు పలికింది.

నా పెళ్ళయిన ఏడాదికి నా మూడో చెల్లెలి వివాహం జరిగింది. ఈసారి కార్యక్రమాలలో కొంత ప్రాముఖ్యత వహించాను. కానీ ఇలలోని నేను కలలోని నేను కాదు. కలలో అయితే నాకు ఒకే ఒక్క చెల్లెలు

నాకు చాలా బాధ అనిపించేది. నా కల అతి సులభంగా ఇలలో నెరవేరేది. కానీ నాన్నగారందుకు సహకరించలేదు. అందుకు పూర్తిగా ఆయన్ను తప్పుపట్టలేము. ఆయన పూర్వకాలపు మనిషి సంస్కారమేకానీ చదువు లేదు.

ఆయన వ్యవసాయంలో ఆరితేరినవారు. కానీ పొలంలో కలుపు మొక్కలు చేసేహాని జీవితంలో ఎక్కువమంది పిల్లలు చేస్తారని ఆయన వూహించలేదు.

ప్రస్తుతం నాలుగో చెల్లెలికి సంబంధాలు చూస్తున్నాం మేము. వీలయినంత చవుకలో తేల్చేయాలాని ప్రయత్నిస్తున్నాం. చౌక అనుకున్నప్పుడల్లా నా మనసులో ఏ మూలో బాధ కలుగుతూంటుంది.

ప్రస్తుతం కలగా కంటున్నది—కొంత కాలానికి కలగానయినా మిగలదనే భయం నాకుంది. ఎందుకంటే క్రమంగా నా కలలో బలం తగ్గుతోంది. ఒకప్పుడు రాత్రి తెల్లవార్లూ వచ్చేటంత పెద్దదిగా వుండే ఆ కల యిప్పుడు ఓ పావుగంటకు మించి వుండడంలేదు.

ఆ కల నన్ను తాత్కాలికంగానైనా ఆనందలోకాల్లో విహరింపజేస్తోంది. ఆ కల కూడా నాకు దూరమైతే ”

“సార్ టెలిగ్రామ్.”

అందుకున్నాను. ఒక్కసారి ఆనందంతో పొంగిపోయాను. నాకు కూతురు పుట్టిందట.

అవును-నేనో ఆడపిల్ల తండ్రినయ్యాను. దాన్ని నా ఆశయాలకు అనుగుణంగా పెంచి ఇరవై ఏళ్ళ తర్వాత పెళ్ళి చేస్తాను.

పెళ్ళి .

పెళ్ళి అత్యంత వైభవంగా జరగాలీ పెళ్ళి.

నలుగురూ మెచ్చేలా చేస్తానీ పెళ్ళి।

తన పెళ్ళిలో అందరూ నా కూతురి అదృష్టాన్నభినందించాలి “ఆమెకేమండీ ఆ తండ్రికి ఒక్కగానొక్క కూతురు ” అని అంతా అనుకోవాలి.

ఒక్కగానొక్క కూతురు

అవును. ఇది నా చేతుల్లోనే వుంది. నాన్నగారు చేసిన తప్పు నేను చేయకూడదు.

ఫరవాలేదు. ఈరోజునించీ నేను కొత్త కలను కనడం ప్రారంభించవచ్చు. ఈ కల మధ్యలో ఆగేది కాదు। రాత్రితెల్లవార్లూ నన్నానందపరచి-ఇరవై ఏళ్ళ అనంతరం ఇలలో కూడా జరుగుతుంది.






'ఛీ! ఛీ! నువ్వింత నీచుడివనుకోలేదు రఘూ. ఇప్పుడు నా జీవితం ఏంకావాలి?'

"నీ జీవితం ఏంకావాలో చెప్పడానికి నేను జ్యోతిష్కుడ్ని కాను. ఈ విషయంలో నేను ఇంతకన్నా చెయ్యగలిగింది ఏంలేదు."

"అంటే?"

"నాకు తెలిసిన డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళి అబార్షన్ చేయిస్తా."

"ఛీ. ఆ మాట అనడానికి సిగ్గులేదూ? అడ్డం అయిన తిరుగుళ్ళూ తిరిగి అబార్షన్లు చేయించుకొనే బజారుదాన్ని అనుకొన్నావా?"

రఘు ఏం మాట్లాడలేదు. రాధకి అతన్ని చూస్తుంటేనే దహించుకుపోతున్నది. నమ్మింది. ప్రేమించి అనుభవించి అఖరికి తను ఇప్పుడు ఏంచెయ్యలేనని అతను అంటుంటే ఆడదిగ భరించలేకపోతున్నది. ఆమెలో అహం అభిమానం దెబ్బతిని బుసలుకొడ్తున్నాయి.

ఐదునిమిషాలు నిశ్శబ్దంగా గడిచింది. రాధ దీనంగా ఏడుస్తున్నది. "రఘూ! నిన్నే నా సర్వస్వంగా భావించి నన్ను నేను అర్పించుకున్నా. నాకు ఏం తక్కువ అయిందని ఇప్పుడు కాదు పొమ్మంటున్నావో చెప్పు. నువ్వు ఊఁ అంటే నాన్నగారితో చెప్పి నీకు ఏంకావాలన్నా ఇప్పిస్తాను. డబ్బు కావాలా? మేడలు కావాలా? ఏంకావాలి ?"

"నాకు ఏం అక్కర్లేదు" రాధ భోరని అతని గుండెలమీద పడి, "అలా అనకు రఘూ!

నువ్వు లేకుండా నేను బతకలేను.ఆ ఒక్కమాట దయచేసి అనకు."

"క్షమించు రాధా! ఇది నేను ఎంతో ఆలోచించి తీసుకున్న నిర్ణయం. దీన్ని మార్చాలని నువ్వు చేసే ప్రయత్నం అంతా వృధా."

రాధ కన్నీటి తడిమధ్య తల యెత్తింది. "పోనీ ఈ నిర్ణయం ఎందుకు తీసుకున్నావో చెప్పు" అతని గుండెలమీద చొక్కా పట్టుకుని కుదుపుతూ అడిగింది. కానీ అతను ఏం మాట్లాడలేదు.

అతని ముఖం నిర్లిప్తంగా ప్రశాంతంగా ఉంది. కనీసం ఏ విధంఅయిన సంఘర్షణగానీ బాధగానీ రాధకి కనబడలేదు. అతన్ని యెలా అర్థంచేసుకోవాలో తెలీడంలేదు.

"సరే, ఇంక నేను వస్తా రాధా" రఘు లేచాడు. పార్కులో పదినిమిషాలు కూర్చుని తర్వాత ప్యాంటు దులుపుకుని వెళ్ళిపోయే మనిషి మాదిరిగా తన జీవితంలో ఆడిపాడి ఎగిరిగంతి మాటలు చెప్పి అన్నిపనులూ చేసేసి చివరికి ఏం ఎరగనట్లే లేచి వెళ్ళిపోబోతున్న అతనిలో యుగయుగాలుగా మగజాతి ఆడదాని పట్ల ప్రవర్తించే నీచత్వం అవకాశపరత్వం రాధకి కనిపించాయి. ఆ క్షణంలో ఆమెకి మగజాతి మొత్తాన్ని కత్తికి ఒక ముక్కగా నరికి పారేయ్యాలనే రాక్షసత్వం పొంగి పొర్లింది.

కానీ రాధ ఆడది కేవలం సగటు ఆడది! ఏం చెయ్యగలదు? కన్నీళ్ళు ఒత్తుకొంటూ తల వంచుకుని వెళ్ళిపోవడం తప్ప?.

వెళ్ళిపోతున్న రాధని క్షణంసేపు చూసి రఘు సిగరెట్ అంటించుకుని లేచాడు.

ర్ ర్ ర్

సుధీర్ పక్కకితిరిగి పడుకున్నాడు. రాధకి ఇంకా నిద్రరావడంలేదు. కిటికీలోనుంచి వెన్నెల ఒయ్యారంగా పక్కమీద పడ్తున్నది. చల్లటి గాలి పసిపిల్లాడి మాదిరిగా అల్లరిచేస్తున్నది.

రాధకి యింకా డాక్టర్ సుమతి మాటలు గుర్తువస్తున్నాయి. ఆక్షణంలో సుధీర్ ఆనందం చెప్పడానికి వీల్లేదు. తను తల్లికాబోతున్నట్లు డాక్టర్ చెప్తున్నప్పుడు సుధీర్ మొహం యావత్ ప్రపంచాన్ని జయించిన చక్రవర్తిలా వెలిగిపోయింది. అప్పుడు అతను తననిచూసిన చూపుకి సిగ్గుతో ఒణికిపోయింది. తనలో తెలిని ఏవో భాగాల్ని ఆ చూపు ఒక్కసారి స్పృశించినట్లు అయింది. ఆదమరచి నిద్రపోతున్న సుధీర్‌లో పసివాడు ఆమెకి కనిపించాడు. అతని చెరిగిన క్రాఫ్‌ను వేలిగోళ్ళతో సవరించి తలను గుండెలమధ్య పొందికగా ఉంచుకొంది.

ఇంక తనకి జీవితమే లేదనుకుంటున్న సమయంలో అకస్మాత్తుగా సుధీర్ కలిసి మళ్ళీ జీవితం ప్రసాదించాడు. అతనే కలవకపోతే ఈపాటికి తన ప్రాణం అనంతవాయువుల్లోనో పంచభూతాల్లోనో లేదా మరే మాతృగర్భంలోనో ఉండేది గాబోలు. మానవుల్లో దేముళ్ళు ఉంటారనడానికి యింతకి మించిన నిదర్శనం యేం కావాలి? తనకి కావలసినంత సిరిసంపదలు ఉండవచ్చు. తండ్రికి ఈదేశంలో ఏంఅయినా చెయ్యగల స్థోమత ఉండవచ్చు. కానీ ఆనాడు తను వున్న స్థితిలో తనకిమాత్రం ఏం చెయ్యలేదు. ఎంత డబ్బున్నా అదిగూడా చెయ్యలేని పనులు వుంటాయని ఆనాడే తెలిసింది.

సుధీర్ చేతివేళ్ళు తన గుండెల ఎత్తుపల్లాల మీద ఆడుకొంటూ వుండటం గమనించి అతను యింకా నిద్రపోవడంలేదని అర్థంచేసుకుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?"

"బయట వెన్నెల చూస్తుంటే అందులో మీ మనస్సు కనిపిస్తున్నది. అందుకని "

"ఏమిటి మళ్ళీ ఈ పొగడ్త? రేపు ఏదన్నా ఇన్‌డెన్టు పెడ్తున్నావా?" సుధీర్ నవ్వుతూ.

"ఛీ! మీరు మరీను. ఈ భూమిమీద మీ రూపంలో దొరికిన ఇన్‌డెన్టు తన్నా నాకు యింకేం కావాలి?"

"సరేగానీ, గర్భిణీస్త్రీలు ఎక్కువగా ఆలోచించకూడదు, పొగడకూడదు, ఇలా అర్ధరాత్రి దాకా ఆలోచించకూడదూ అని డాక్టర్ చెప్పింది గుర్తుందా?"

రాధకి సిగ్గు కోపం ముంచుకువచ్చి సుధీర్‌ని వీపుమీద ప్రేమగా కొట్టింది. "మాట్లాడితే మీరు నన్ను గర్భిణీస్త్రీ అంటే నాకు మహా కోపం వస్తుంది తెలుసా?"

"ఈ ఆడవాళ్ళతో నిజాలదగ్గర యెప్పుడూ తగాదానే. గర్భిణీస్త్రీని గర్భిణీస్త్రీ అనక మరేం అంటారు?"

"ఏం అక్కర్లేదుగానీ మీరింక పడుకోండి"

సుధీర్ రాధ మెత్తదనాల్ని మత్తుగా చూస్తూ మరింత దగ్గరికి తీసుకున్నాడు. రాధ తట్టుకోలేని తన్మయత్వంలో ద్రవీభవిస్తున్న మంచు గడ్డలా అతని భుజాల వెచ్చదనంలో అతుక్కుపోయింది.

ర ర ర

"యాభై ఆరేళ్ళ జీవితంలో ఏనాడూ ఎవర్నీ దేహీ అని అర్థించలేదు బాబూ. నీకాళ్ళు పట్టుకుంటా, రాధ జీవితం అన్యాయంచెయ్యకు"

"ఇందులో నేను అన్యాయం చెయ్యడం అనే ప్రసక్తి అసలు లేనేలేదు. అన్యాయం జరిగింది నాకు. అలాంటిది నేను నోరు మూసుకుంటే, మీకు అన్యాయం చెయ్యద్దంటారేమిటి?"

"రాధ ఇందులో కావాలని ఏంచెయ్యలేదు. ఆనాడు ఎవరో నయవంచకుడు మంచిదనంతో చేసిన వంచనకి అమాయకంగా బలి అయింది. అంతకన్నా ఏంలేదు. అయినా నువ్వు రాధతో ఐదేళ్ళుగా కాపరంచేశావ్. ఏనాడు అయినా ఏ విధం అయిన పొరపాటుగానీ చూశావా?"

"నేను మాట్లాడుతున్నది నా ముందు ఐదేళ్ళపాటు రక్తి కట్టించే విధంగా ఆడిన నాటకం గురించి కాదు. అంతకుముందు సంగతి. రఘుతో రాధకి అక్రమ సంబంధం వుందా లేదా? అది కొన్నేళ్ళు జరిగిందా లేదా? అతని సంపర్కంతో రాధకివచ్చిన కడుపుని ఎబార్షన్ చేయించారా లేదా? వాళ్ళిద్దరూ రాసుకున్న ఉత్తరాలు అబద్ధమా? ఆ ఫోటోలు అబద్ధమా? రాధకి అబార్షన్ చేసిన డాక్టర్ చెప్పిన మాటలు అబద్ధమా? ఏది అబద్ధం? ఇందులో ఏది అబద్ధం అని నన్ను మీరు ప్రశ్నించడానికి వచ్చారు?"

"నిన్ను ప్రశ్నించడానికి రాలేదు బాబూ, అర్థించడానికి వచ్చాను. దేశంలో ఒక ప్రముఖ వ్యక్తి బాధ్యతాయుతం అయిన ప్రజా ప్రతినిధిగా నాకువున్న పరువు ప్రతిష్ఠలు సంఘంలో గౌరవం ఈ నాడు నీ చేతుల్లో వున్నాయి." సుబ్బారెడ్డి యెంత ఆపుకోవాలని ప్రయత్నిస్తున్నా ఏడుపు ఆగడం లేదు. జీవితంలో ఎప్పుడూ ఎదుటివారి బాధల్ని కష్టాల్ని కన్నీరుని చూసి పైకి సానుభూతి నటిస్తూ లోపల ఆనందించే సుబ్బారెడ్డి ఈనాడు నిజంగా ఏడుస్తున్నాడు.

సెంటు వాసనల ఖరీదయిన ఖద్దరు సిల్కులాల్చీ గ్లాస్కో ధోవతిలో ఆరడుగుల సుబ్బారెడ్డిని ఆ క్షణంలో ఎవరు చూసినా ఆశ్చర్యపోక తప్పదు. ఎందుకంటే రాజకీయ రంగంలో ఆయన అపరచాణక్యుడు జీవితంలో మహోగ్ర సింహం. అసంబ్లీలో వెయ్యి ఎలిగేషన్లు వచ్చినా రాజకీయ జీవితంలో ఎంతటి కల్లోలం పీచినా పీసం యెత్తు తొణకని సుబ్బారెడ్డి ఆ క్షణంలో పసిపిల్లాడిలా మరోక్షణంలో ఉరికంబం ఎక్కుతున్న నేరస్థుడిలా దీనంగా పరమ దారుణంగా నిలబడి సుధీర్‌ని చూస్తున్నాడు.

ముఖం మీద చెమట తుడుచుకొని సుబ్బారెడ్డి మళ్ళీ అన్నాడు. 'ఈ రోజున నీ భార్య అవినీతి పరురాలని కోర్టులో దావావేసి విడాకులు తీసుకొన్నంతలో నీకు చేకూరే లాభం గూడా ఏం లేదు అల్లాడూ. రాధమీద కసి తీర్చుకోడం ఒక్కటే నువ్వు చూస్తున్నావు గానీ రేపు నీ కొడుకు భవిష్యత్ ఆలోచించావా? రేపట్నించి వాడికి తండ్రి ఎవరు? లోకానికి తన తండ్రి యెవరని ఆ పిల్లాడు చెప్పుకోవాలి? రేపు నీ కొడుకుని నలుగురూ వేలెత్తిచూపించి అవమానిస్తే ఆ అవమానం నీదికాదా? " సుధీర్ వ్యక్తిత్వం మీద అతని రక్తం మీద పేగుతీపి మీద ఆఖరి అస్త్రం ప్రయోగించాడు సుబ్బారెడ్డి.

"మీ కూతురు చేసిన అక్రమాన్ని మీరు గాబట్టి సమర్థిస్తున్నారు రెడ్డిగారూ. రాధకి పుట్టిన పిల్లాడ్ని రేపు ఎవరేం అన్నా ఇవాళ నన్ను అంటున్న దానికి మాత్రం నేను భరించలేకపోతున్నా."




"సుధీర్! నాకు యెదురుతిరిగి అడ్డం తిరిగి నువ్వు ఏదో సాధించాలను కుంటున్నావేమో? నువ్వు ఇంత మొండిగా తయారయ్యావంటే ఇందులో ఖచ్చితంగా ప్రతిపక్షాల చెయ్యివుండి వుంటుందని నాకు ఇప్పుడు బాగా నమ్మకం కలుగుతున్నది."

సుధీర్ సుబ్బారెడ్డి మాటలకి వ్యంగ్యంగా నన్వాడు. 'చూడండి రెడ్డిగారూ. నేను డిప్లమాటిక్ సర్వీసులో వున్నవాణ్ని. నా దగ్గర మీరు డిప్లమసీ వాడితే ఎలా? మీ కూతురు పెళ్లికి ముందే చెడిపోడానికి అది తెలిసి నేను విడాకులు అడగడానికీ మీరు రాజకీయపు రంగు పులుముతున్నారంటే మనదేశ రాజకీయాలు ఎంత అధ్వాన్న స్థితికి దిగాయో అధికార తాపత్రయం ఎంత హేయంగా పతనం అయిందో అర్థం అవుతున్నది," అని సుధీర్ నీచంగా ఒకసారి చూశాడు.

"బహుశ మీకువున్న అధికారబలం అంగబలం రాజకీయ ప్రాబల్యంతో నా ఉద్యోగం తీయించేస్తారు. అంతకన్నా ఏం చెయ్యలేరు. అందుకు నేను ఇంతకు ముందే సిద్ధపడ్డా. మీ వంటి చాలా పవర్ ఫుల్ అయిన వ్యక్తిని కాదని ఎదిరించడంలోని ఇబ్బందులు నాకు తెలుసు. నేను పెళ్లాడబోతున్న సుసాన్ నాకు అమెరికాలో పౌరసత్వం కల్పించబోతున్నది. వాళ్ళ ఫ్యాక్టరీ నాకు ఇస్తున్నారు. దాన్ని నిర్వహిస్తే మీవంటి వాళ్ళని నెలకి ఇద్దర్ని కొనగలను." సుబ్బారెడ్డి రాక్షసంగా చూశాడు సుధీర్ని. ఆయన కింది దవడ ఆవేశంతో ఒణికి పోతున్నది. బుగ్గలు ఎర్రబడ్డాయి. కతత కెంపువారి పోయింది. మెడకింద చెమట ధారాపాతంగా కారుతున్నది.

"అయితే నా పరువు ప్రతిష్ఠలు బజారుపాలు చెయ్యడమే లక్ష్యంగా పెట్టుకున్నావ్? దీనివలన నీకు వచ్చేదేమిటి? పోనీ ఒక పని చెయ్. రాధను నువ్వు ఏలుకోవద్దు. ఆమె ఈ దేశంలోనే వుంటుంది. నువ్వు అమెరికాలో సెటిల్ అయిపో. నీ ఇష్టం అయినదాన్ని పెళ్లాడు అక్కడ. కానీ ఇక్కడ కోర్టుకి విడాకులు అడగకు. ఆ ఒక్క మేలు చెయ్."

"నావల్ల కాని పని అది. రాధ జీవితంలో ఇలా జరిగిందని పెళ్ళికిముందు కనీసం ఒక్క మాట అయినా చెప్పివుంటే నేను ఎంతో ఆనందిద్దును. కానీ మీరు దాన్ని దాచిపెట్టారు. పైగా ఇంగ్లండులో పదేళ్ళుగా చదువు కొంటున్న నాకు అఫ్టరాల్ ఈ విషయం ఎలా

తెలుస్తుందని అనుకున్నారు. నా అమాయ కత్వాన్ని విదేశాలలో వుండటాన్ని ఆధారం చేసుకొని మోసం చెయ్యాలనుకొన్నారు. అదే నేను భరించ లేకపోతున్నా" సుధీర్ కసి అంతా ప్రతిమాటలో పొంగుతుంటే సుబ్బారెడ్డి రెడ్‌హాండెడ్‌గా పట్టుబడ్డ అంత ర్జాతీయ నేరస్థుడిలా షేక్ అయిపోతున్నాడు. ఎంత ప్రయత్నించినా అఫెన్స్‌కి డిఫెన్స్‌కి దారి చిక్కడంలేదు.

"నా పెళ్ళికి ముందే మీరు నాకు అమెరికా లోని ఇండియన్ రాయబార కార్యాలయంలో ప్రముఖ ఉద్యోగం రావడానికి యెందుకంత ప్రయత్నించారో ఇప్పుడు అర్థం అవుతున్నది. ఇక్కడ గూడా నాకు చాలా మంచి ఉద్యోగాలు వచ్చాయి. అంతే కాకుండా స్వయంగా నేను ఇండస్ట్రీ ఆరంభించుకొనే తాహతు నాకు ఉన్నప్పటికీ అదీ జరగనివ్వలేదు. పెళ్ళిచేసి వెంటనే నన్ను విదేశాలకి తోలేశారు. మీ అభిమానం వెనక ఇంత లౌక్యంవుందని మీరు నాకోసం చేసిన శ్రమలో ఇంత కుట్ర వుందని నేను వూహించలేక పోయినందుకు బాధపడ్తున్నా."

"ఇందులో దాచింది ఏం లేదు. అప్పుడు చెప్పడానికి వీల్లేకపోయింది. అంతకన్నా మరేం లేదు." నీళ్ళు నముల్తూ సుబ్బారెడ్డి యెలాగో అన్నాడు.

"మిమ్మల్ని అసహ్యించుకోడానికి గూడా నాకు సిగ్గువేస్తున్నది. పెళ్ళికి ముందు ఇరవై రోజులపాటు మీ సిరిసంపదలు హోదా రాబోయే పదవులు ఆస్థిపాస్థులు మీకువున్న బ్లాక్ మనీ స్వరూపం బినా మీ పేర్లమీద మీ కున్న పరిశ్రమలు వంటి యెన్నో చెప్ప గలి గారు గానీ ఈ ఒక్క విషయం చెప్పడానికి వీల్లేక పోయిందా! బ్రూటల్ మెజార్టీతో అసంబ్లీలో ప్రతిపక్షాలు అడిగే నిజాల నోరు నొక్కడానికి ప్రజలు అడిగే ప్రశ్నల్ని మీకున్న బలంతో ఖాతరు చెయ్యక పోవడానికి మీరు అలవాటు పడవచ్చు. అసహాయులు అజ్ఞానులు మూర్ఖులు అయిన ప్రజల్ని వంచించి విభజించి భుజించడం అక్కడ సాగవచ్చు. కానీ నా దగ్గర కాదు. పెళ్ళికిముందు మీకు, పెళ్ళికి తర్వాత ఐదేళ్ళు నాతో కాపరం చేసిన రాధకీ గూడా ఈ విషయం నాతో చెప్పడానికి తీర లేదు. అది నన్ను నమ్మమంటారు. అంతేనా? "

సుధీర్‌ని సుబ్బారెడ్డి తదేకంగా చూశాడు. ఆ క్షణంలో నియంత అయితే అతన్ని గ్యాస్ ఛేంబర్‌లో పడేసి గ్లాసుడోర్స్‌లోంచి చూసి ఆనందించేవాడు. కానీ ఏం చెయ్యలేని నిస్సహాయస్థితి ఏంచెయ్యకుండాగూడా ఉండ లేని దుర్భరస్థితి.

ఇప్పటికే ఢిల్లీ, బొంబాయిల్లోని ఇంగ్లీషు పత్రికలు వి.ఐ.పి. స్కాండల్ పేర రకరకాల వ్యాసాలు తనమీద వేశారు. ఈ స్థితిలో సుధీర్ కోర్టులో విడాకులకి దావావేస్తే దేశంలో రక రకాల వదంతులకి మరింత శక్తి వస్తుంది. దేశంలో ప్రముఖ రాజకీయవాది ఒక మంత్రి ఎంతో రాజకీయ చరిత్రగల వ్యక్తి అయిన తను చివరికి ప్రొఫ్యూమా మాదిరిగా రాజకీయాల్నించి శాశ్వతంగా విరమించవలసి వస్తుంది. నేడో రేపో మంత్రివర్గాన్ని సస్పెండ్ చేయించి తిరిగి తను ముఖ్యమంత్రిగా కొత్త మంత్రివర్గంతో ప్రమాణస్వీకారం చేసి దేశాన్ని ఏలాలి అను కుంటున్న సమయంలో సుధీర్ తన కూతురుని తనని రచ్చకి ఈడిస్తే ఏం అవాలి? ఈ నాడు తను ఉన్నస్థితిని ముప్పై సంవత్సరాలు కష్టపడి సాధించింది. అదంతా తన కళ్ళముందు ఇసుక కుప్పలా కూలిపోతుంటే సుబ్బారెడ్డికి స్పృహ తప్పిపోతున్నట్లు అనిపించింది.

ర ర ర

ఇంకా సరిగ్గా తెల్లారలేదు. అప్పుడే వీధి తలుపు చప్పుడుఅయితే వెళ్ళి బద్ధకంగా తలుపు తీశాను. ఎదురుగా నాథ్! నా కళ్ళముందు కని పిస్తున్నది నిజమా అబద్ధమా అని సందిగ్ధంలో ఉండగానే వాడు నన్ను కావలించుకొన్నంత పనిచేశాడు.

చాలాకాలం తర్వాత వచ్చిన స్నేహితుడి రాకతో ఇల్లంతా సందడిగా వుంది. ఆఫీసుకి శలవుపెట్టేసి ఇంట్లో కూర్చున్నా. అందులో

రాత్రి సరిగ్గా నిద్రగూడా లేదు. నాలుగు రోజుల్నించి మంచి కథ రాయాలని ఎంతగా ప్రయత్నిస్తున్నా ఫలించడంలేదు. అవతల పండగ స్పెషల్ ఇష్యూకి కథపంపమని పత్రిక ఆఫీసు నుంచి వచ్చిన ఆరోతాఖీదుకి సిగ్గుపడి రాత్రి తెల్లార్లూ కథ రాయాలని నేను చేసిన యత్నం, పూర్తిగా వ్యర్థం అయిపోయింది.

"కళ్ళేమిటి అలా యెర్రగా వున్నాయ్ " నాధ్ గమ్మత్తుగా అడిగాడు ఖరీదయిన సిల్కు లుంగీని సర్దుకొంటూ. నా అవస్థ అంతా చెప్పి 'రోజుకి నాలుగు ఊళ్లు తిరిగేవాడివి. మంచి కథ చెప్పరాదూ, రాసుకొంటాను' అన్నా.

నాధ్ చాలా కష్టపడి పైకి వచ్చినవాడు. స్కూలు ఫైనల్ దాకా కలిసి చదివాం. ఆ తర్వాత సంబంధాలు తెగిపోయాయి. ఢిల్లీలో యిప్పుడు రెడీమేడ్ దుస్తుల ఎక్స్‌పోర్టు వ్యాపారం భారీగా సాగిస్తూ చాలా పెద్దవాడు అయిపోయాడు.

నా రచనలుమాత్రం తరచు పత్రికల్లో చదువుతాడుట. అందుకని వాడు నన్ను మర్చిపోలేదు. ముందుగా ఏదో పత్రిక ఆఫీసులో నా యెడ్రెస్ సంపాదించి తిన్నగా నా ఇంటికి ఇలా వచ్చేశాడు. వాడ్ని ఈ రోజు ఈ స్థితిలో చూస్తుంటే ఆనందంతోపాటు మా పెద్దవాడికి ఏదన్నా చిన్న ఉద్యోగంగూడా ఇప్పిస్తాడని ఆశ కలుగుతున్నది. సాయంత్రం దాకా కబుర్లతో కాలక్షేపం అయిపోయింది. చీకటి పడ్తుంటే మళ్ళీ కథ సంగతి గుర్తువచ్చి భయంవేసింది. తెల్లారి యెలాగయినా పోస్టు చెయ్యాలి. కానీ ఎలా? మంచి ప్లాట్ దొరకడం లేదు. ఏం చెయ్యడం?—

"కథ చెప్పరా బాబూ " బతిమలాడాను వాడ్ని.

"కథలు చెప్పడం రాదు నాకు."

"పోనీ ఏదన్నా మంచి అనుభవం చెప్పు."

"ఆల్‌రైట్ చెప్తున్నా విను," అని నాధ్ దేశంలో విపరీతంగా వినబడ్తున్న సుబ్బారెడ్డి కూతురు రాధ కథ మొత్తం చెప్పాడు. ప్రస్తుతం సుధీర్ విడాకుల కేసు కోర్టులో విచారణ జరుగుతున్నది. ఏ పేపరు తీసినా ఎవరినోట విన్నా రాధకేసే. ఇదే సందు అనుకొని మెల్లిగా కొందరు సుబ్బారెడ్డి గతంలో చేసిన ఇంకొన్ని కుంభకోణాల్ని బయటికి

లాగుతున్నారు. వీటన్నిటి మధ్య సుబ్బారెడ్డి రాజకీయ జీవితం ఇటు మంత్రివర్గం ఏం అవు తుందోనని అంతా అనుకుంటున్నారు.

"ఎక్కడో ఢిల్లీలోవున్న నీకు ఈ వ్యవ హారం యింత వివరంగా యెలా తెలుసు?" అన్నా ఆసక్తిగా. నాథ్ నవ్వి త్రిబుల్ఫైవ్ సిగరెట్ని మహా నిర్లక్ష్యంగా వెలిగిస్తూ "అందులో రఘుని నేనే! ఈ కేసులో తెల్లారి కోర్టులో రాధని పెళ్ళికిముందు అక్రమంగా అనుభవించిన వ్యక్తిగా సాక్ష్యం ఇస్తున్నది ఎవరోకాదు నేనే' అన్నాడు గర్వంగా నవ్వి.

ఒక్కసారిగా నా తల తిరిగిపోయింది. ఎదురుగావున్న నాథ్లో ఇంత నీచం అయిన రాక్షసుడు దాగివున్నాడా అని నివ్వెర పోయాను. సహజంగా ప్రతి చిన్నదానికీ మూవ్ అయిపోయే నేను నాథ్ చెప్పింది విన గానే షాక్ తిన్నాను.

ఒక అమాయకురాల్ని పెళ్ళికి ముందు వంచించి అక్రమంగా అనుభవించడం కాకుండా, తను ఆ పని చేసినట్లు కోర్టులో సాక్ష్యం యివ్వ డానికి నాథ్ వచ్చాడంటే వాడు ఎంత సిగ్గు విడిచేశాడో! సిగ్గు విడిచేసి ఆర్థికంగా ఎదిగే శాడు. ఛీ! ఛీ! ఒక ఆడపిల్లని అనుభవించడం కాకుండా దాన్ని ఆసరాగా ఆమె జీవితం మొత్తం కూలదీస్తాడా నాథ్? నా ఆలోచన్లు పరిపరి విధాల పోతున్నాయి.

"నాథ్! ఒక సంస్కారం గల మనిషిగా నువ్వు చెయ్యాల్సిన పనికాదు ఇది. దయచేసి ఈ సాక్ష్యం చెప్పకు" అన్నా దీనంగా. నిజంగా ఆ రాధ ఎవరో నాకు తెలీదు. కానీ నాకు అదేదో నా కూతురికే జరుగుతున్నట్లు లోపల అంతా బాధ.

"లేదు? నేను సాక్ష్యంచెప్పి తీర్తాను. ఈ సృష్టిలో ఏ శక్తి నన్ను ఆపలేదు." అన్నాడు నాథ్ ఖండితంగా. అతని గొంతులో ఎంతో బలం అయిన నిర్ణయం కనిపించింది.

"పాపం! ఆపిల్ల నిన్ను ఏం చేసింది? అమా యకంగా నిన్ను నమ్మినందుకే గదా యింత పాపం చేస్తున్నావ్? నా మాట విను. నీకు ఏం తక్కువ అయిందని, ఇంకా ఏం సంపా దించాలని యిదంతా? ఒక కాపరం నిలబెట్టాలి గానీ కూలదొయ్యకూడదు. ఇదే నీ చెల్లెలికో భార్యకో జరిగితే నీకు ఎలా వుంటుందో ఒక్కసారి ఆలోచించు"నాథ్నిఎలా మార్చాలో తెలీక పదాలు వెతుక్కోవలసి వస్తున్నది.

ఆ మాటకి నాథ్ నన్ను ఒక వెధవగా జమ కడుతున్నట్లు చిత్రంగా నవ్వాడు. "రాధ అనే అందమైన అమాయకం అయిన అగర్భ శ్రీ మంతురాలికి అన్యాయం జరిగి పోతున్నదని భరించలేక నీ హృదయం తల్లడిల్లి పోతున్న దని నాకు తెలుసు మిస్టర్ రచయితా! కానీ ఇప్పుడు నువ్వు ఒకమాట అన్నావ్ ఏమిటి? ఇదే నా చెల్లికో మరెవరికో జరిగితే నేను ఇలాగే ప్రవర్తిస్తానా అన్నావ్.

కానీ నాకు నా కుటుంబానికీ యింతకన్నా భయంకరం అయిన ఘోరం జరిగిపోయి నప్పుడు నువ్వు నీ లోకం నీ సంఘం ఈ నీతులు ఆదర్శాలు మానవత్వాలూ ఏవీ నాపట్ల నా కుటుంబంపట్ల ఆమాట అనుకోలేదు రవీ! ముప్పై ఏళ్ళనాడు నా తండ్రిని ఈ సుబ్బారెడ్డి పబ్లిక్గా హత్యచేయించి కేసు తనమీదకి ఏ మాత్రం పడకుండా జాగ్రత్త పడ్డ నాడు జరిగిన దాన్ని కళ్ళారా చూసిన వేలాది మందిలో ఒక్కడు కనీసం ఒక్కడయినా ఆ ఘోరం తన తండ్రికి జరిగింది తన కుటుంబానికి జరిగిం దని అనుకోలేదు. అలాంటప్పుడు నేను ఇప్పుడు ఎలా అనుకుంటా. ఎందుకు అను కుంటా. అదంతా విధి తలరాత నాన్సెన్స్ అను కుని మర్చిపోయే వెధవని కాను రవీ నేను.

—రవీ! ఈ రోజు ఆ రాధ కోసం యింత తపించిపోతున్న హృదయం ఆనాడు మనం చదువుకునే రోజుల్లో ఏనాడూ నా పరిస్థితులు నా సమస్యలకి ద్రవించలేదు. నీ కళ్ళముందు నేను అన్నం లేకుండా కట్టుకో బట్టలేకుండా మాడి చస్తున్నా అయ్యో అనుకోలేదు. నువ్వే కాదు ఎవరూ అనుకోలేదు.

మా నాన్నగారు స్వతహా మంచి తెలివి తేటలు నిర్వహణ దక్షత రాజకీయ విజ్ఞానం




వున్నవాడు. అప్పటిదాకా మా ఊళ్ళో ఈ సుబ్బారెడ్డి ధ్వజానికి తిరుగులేదు. కానీ మా నాన్న వీడి అక్రమాల పతాకలకి నిప్పు అంటించడానికి ఏనాడు నడుం కట్టుకున్నాడో ఆనాడే ఆయన్ని భూమి మీద నుంచి తొలగించెయ్యాలని సుబ్బారెడ్డి పథకం అల్లాడు. ఫలితంగా యెదిగీ యెదగని ఆరుగురు పిల్లలు వాళ్ళ తల్లి అనాధలై రోడ్డున పడ్డారు. పట్ట పగలు ఇంటిమీదకి బరిసెలు తీసుకొచ్చి మా నాన్నని వీధిలోకి లాగి నరికిపారేస్తే ఒక్క రాస్కెల్ ఆదేం అనలేదు. ఒక్కడు కోర్టుకి వచ్చి సాక్ష్యం చెప్పలేదు.

—ఆ తర్వాత ఆ కుటుంబం ఏంఅయింది యెలా బతికింది? ఆందులో యెందరు ఆకల్తో చచ్చారు? ఎందరు రోగాల్తో సృష్టిలో ఆనందం కోల్పోయారు?—ఎవరూ ఆలోచించ లేదు.

నువ్వు దేశంలో ప్రముఖ రచయితవి! సాహిత్యంలో సంస్కారం మానవతలాంటివి మనిషిలో పెంపొందించడానికి కలం పట్టాననుకునే హిపోక్రట్స్‌లో నువ్వొకడివి కానీ నీ కలానికి యెప్పుడన్నా నే చెప్పిన నేను అనుభవించిన జీవితం తగిలిందా? లేదు. అంతేకాదు మూడేళ్ళ పసిపిల్లాడు చలిజ్వరంతో కళ్ళ ముందు మందులేక చనిపోవడం అనుభవంలో నీకు తెలుసా రవీ?

ఏ దిక్కూ లేక అనాధ శరణాలయంలో ఒక పన్నెండేళ్ళ పసిపిల్ల చేరితే ఆ అమ్మాయి చెరచబడి చచ్చిపోతే, దాన్ని సహజం అయిన మరణంగా ఆ శరణాలయం ధృవపరచడం జరిగితే యెలా వుంటుందో తెలుసా! నాచెల్లెలికి జరిగింది గాబట్టి నాకు తెలుసు!

నీ ఊహ తెలిసిన వయస్సులో నీ కుటుంబాన్ని బతికించడం కోసం నీ తల్లి వ్యభిచరించి తన మీద ఆధారపడ్డ వాళ్ళని బతికించడం అంటే ఏమిటో అది అనుభవంలో యెలా వుంటుందో క్షణంసేపు ఊహించగలవా రవీ?

వాస్తవంలో అనుభవించడం వేరు, ఆదర్శాలు ప్రబోధించడం వేరు. వాస్తవంలో నువ్వే నా పాత్ర అయితే నేను చేసినదానికన్నా ఇంకా నిజంగా ప్రతీకారం తీర్చుకునేవాడివి. సుబ్బారెడ్డి కూతుళ్ళు మొత్తాన్ని అనుభవించి కంపెనీలకి అమ్మేసేవాడివి. కానీ నా కథని రచయితగా నువ్వు ఏంచేస్తావో తెలుసా? సుధీర్‌ని ఏడిపించడానికి రఘు అలా ఉత్తరాలు సృష్టించాడనో లేదా సుధీర్ వదిలేసిన రాధని రఘు మళ్ళీ పెళ్ళిచేసుకుని తన తప్పు తెలుసుకున్నా

# ప్రగతి ప్రభవిస్తోంది

నిరంతరం శ్రమించే నిరుపేదల బ్రతుకుల్లో ఆశా లతలు చిగురిస్తున్నాయి.

ఈ ఏడాది బడ్జెటులో నిరుపేదల సంక్షేమం కోసం రు. 35 కోట్లు కేటాయించారు. దీనికి తోడు రు. 23 కోట్లు సంస్థాగత ఆర్థిక సహాయం కూడ తోడవుతుంది.

బహుముఖ సహాయ కార్యక్రమాలతో వీరి జీవితాల్లో వెలుగుబాటు కలిగించే కార్యక్రమాలెన్నో చేపడుతున్నారు.

అందుకే పేదల జీవితాల్లో ప్రగతి ప్రభవిస్తోంది.

డి.జి.ఐ. అండ్ పి.ఆర్.

42/78-79



డనో రాస్తావ్. అలా రాసి ప్రజల్ని మోసం చేస్తూ బతుకుతావ్ కాబట్టి నీకన్నా నేనే గొప్ప వాడ్ని, ఉత్తముడ్ని.

కానీ రవీ, రచయిత నియంత కాడు. ప్రవక్త కాడు.

నియంత అయి కలం బలంతో శాసించ గూడదు.

ప్రవక్త అయి నీతులు ధర్మ శాస్త్రాలు బోధించగూడదు.

రచయితలు ఎప్పుడూ వాస్తవాల్ని నిజాల్ని చెప్పాలి. తద్వారా నిర్ణయం పాఠకుల్ని తీసుకో నివ్వాలి.

ఇప్పుడు నువ్వేగానీ నా కథ రాస్తే చదివే పాఠకుల్లో రఘు ఉండవచ్చు సుబ్బారెడ్డి వుండ వచ్చు. ఇంకా చనిపోయిన మా నాన్న వుండ వచ్చు. మా అమ్మ ఉండవచ్చు. రాధ గూడా ఉండవచ్చు. కానీ వాళ్ళలో రఘుల్ని అన్యాయం చేసి అపమార్గం పట్టించే హక్కు నీకులేదు. పదేళ్ళుగా నీ రచనలు చదివి చదివిన తర్వాత సమాజంలో నువ్వు ఎంతమందిని అప మార్గంలో పడేశావోనని భయంవేసి నిన్ను కలవాలని వచ్చా.

అందుకే నా కథ చెప్పా. నేను భయపడ్డట్లు గానే తప్పు నాది అన్నావ్. కానీ అది ఎప్పటికీ కాదు. ఎందుకంటే సుబ్బారెడ్డి దురాగతాలకి నా కుటుంబం బలి అవడం ఏంత న్యాయమో నేను చేస్తున్నదీ అంతే న్యాయం. అతని అన్యా యాన్ని ఆపలేని సంఘానికి ఈ అన్యాయం మీద గొంతుచించుకునే హక్కు లేదు. నువ్వు బాధపడుతున్న రాధకి అలాంటి వాళ్ళకి అదే చెప్పు"

బయట చాలా చీకటిపడిపోయింది. వరండా బయట కూర్చున్న మాకు టైం ఎంతఅయిందో తెలీడంలేదు. ఎదురుగా వున్న నాథ్ కూడా కని పించడంలేదు. కేవలం అతని గొంతు విని పిస్తున్నది.

"ఇంతకీ నా కథ రాస్తావా?" అన్నాడు నాథ్ మళ్ళీ.

"నావల్ల కాదు నాథ్. నన్ను క్షమించు."

నాథ్ ఫక్కున నవ్వాడు. "ఆ సంగతి నాకు ఎప్పుడో తెలుసు. పోనీ నిజంగా నీకథ ఏదన్నా వుంటే చెప్పు. నువ్వు నిజంగా రాసిన కథ ఒక్కటి ఉందా?"

"అంటే నేను రాసినవి యేవీ కథలు కావంటావా?"

"ఆ నిజం నీకే తెలుసు. పద భోజనానికి. అప్పుడే పన్నెండు అయింది" అని నాథ్ లేచాడు.

నిజంగానే రాణాలో గంటలు వినిపించాయి. ⊡

---

ఒకాయన హడావుడిగా ఆర్. టి. సి. సమాచారం ఆఫీసుకి వెళ్ళి ''విజయవాడ బస్ ఎన్ని గంటలకండీ'' అనడిగాడు. ''తొమ్మిది గంటలకి'' జవాబు వచ్చింది. నిమిషం తర్వాత మళ్ళా వచ్చి ''కాకినాడ బస్ ఎన్నింటికీ?'' అనడిగాడు. ''ఎనిమిదింటికి'' అన్నారు సమాచారం వాళ్లు. వెళ్ళి మళ్లా వచ్చాడు ''బందరు బస్సు ?'' జవాబు చెప్పారు. నిమిషం తర్వాత మళ్ళా ''గూడానికి....'' అన్నాడు. జవాబు చెప్పారు. మళ్ళా మళ్ళా వచ్చి ఎక్కడ కెక్కడికో అడుగుతున్నాడు. సమాచారం వాళ్ళకి ఓర్పు నశించింది. ''అసలింతకీ తమరు ఎక్కడికి వెళ్ళాలి ?'' అనడిగారు.

''అబ్బే. . టైంటేబులు పట్టీ రాసుకుంటున్నాను'' అన్నాడాయనతో తాపీగా.

# హోటల్

వంశీ

పసలపూడి ఎఱ్ఱ కంకరరోడ్డుమీద ఎరుపు రంగు పల్చటి తెరలాంటి దుమ్ము రేపి "వెల్ల"మీది నుంచి వెళ్ళే అచ్యుతాపురం టు కాకినాడ దెయ్యాల బస్సు ఆగింది. అప్పుడు సమయం బాగా రాత్రి. అన్ని బస్సులు వెళ్ళాకా ఆఖర్న వస్తుందా బస్సు. అందుకేనట దానికి దెయ్యాల బస్సు అని పేరుపెట్టారు.

ఆ రాత్రివేళ అతను రంగుపోయిన పాత రంగూన్ పెట్టె పట్టుకుని బస్సు ఎక్కుతుంటే గంగరావి చెట్టుచాటున ఉన్న అతని బీద ప్రేయసి చెయ్యి వూపుతూ శోకం నిండిన కళ్ళతో చూస్తుంది. బస్సు కిటికీలోంచి ఆమెకేసి చూశాడు. చవకరకం చినిగిన బట్టల్లో జాలిగా-బీదగా-బాధగా కన్పించిందామె. అప్పుడతనికి అన్పించింది ఆమె శరీరంపై చిరగని కొత్త శిల్కుగుడ్డ కప్పాలని.

## 2

మెట్రిక్‌తో మూడుసార్లు దెబ్బలాడి నాలుగోసారి గెల్చాడు.

సన్నగా రివటలా వున్నా అందంగా వుంటాడు. అందుకేనా ఆ ప్రేయసి అతన్ని ప్రేమించింది? కాదు మరైతే సన్నగా బక్కచిక్కినట్టుండే ఆడవాళ్ళలో సెక్స్‌దాహం చాలా విపరీతంగా వుంటుందట. సదరు సన్నటి మగాడైన అతడిలోకూడా సదరు వుద్రేకం ఇమిడివుందనా?

కాదు అసలు అలాంటిది ఏదీ కాదు. అతని దేహానికన్నా మనసుకి ప్రాముఖ్యత నిచ్చిందా యువతి. నిజంగా అతని బాహ్య రూపం కంటే అంతర్యమే మరీ మరీ అందమైంది. అందుకే అతను వూరువిడిచి వుద్యోగానికని మద్రాసు వెళ్తుంటే గుండెలు కరిగేలాగా, హృదయం సన్నగా కడిగేలాగా ఏడ్చింది.

ఔను. జనం అతనితో అన్నారు, "వోరే ప్రసాదం! నీలాంటి తెలివైన కుర్రాడు తెగించి పట్నం వెళ్తే యెవడైనా ఉద్యోగం ఇవ్వక మానడ్రా. రామచంద్రపురంలో ఆ కేరళానుం చొచ్చాడు చూడు 'రఫీ' మొదట్లో రామకృష్ణా హోటల్లో టీ మాస్టరు. ఇప్పుడు ఎదురుగుండా వున్న మరో హోటలుకి ప్రొప్రయిటరు. అంతేరా. దూరం కొండలు నునుపట. ఉన్న వూరు ఎప్పుడూ ఆదరించదు."

రామచంద్రపురంలో ఆ చిన్న ట్రెడిల్ ప్రెస్‌లో కంపోజిటర్ ఉద్యోగంచేసే ప్రసాదం నరనరాల్లో జనం మాటలు బాగా ఇంజెక్ట్ అయ్యేయి.

ఏ పట్నం వెళ్ళాలి అని ఆలోచిస్తుండగా చెన్నపట్నం గుర్తొచ్చింది. ఔనౌను అక్కడ సినిమా ఇండస్ట్రీ వుంది. రకరకాల తెలుగు పత్రికలూ—వాటిని ముద్రించే ప్రెస్సులూ వున్నాయ్.

ప్రస్తుతానికి చిన్న ఉద్యోగం దొరికి ఆ తర్వాత శాశ్వతానికి మరో మార్గం దొరక్కుండా వుంటుందా? లేదు లేదు దొరికే



ఆస్కారాలు బాగా కన్పిస్తున్నాయ్. మద్రాసే బయలుదేరాలి. ఔను మద్రాసు.

ఆ కారణంగా అచ్యుతాపురం టు కాకినాడ వయా "వెల్ల" బస్సు ఎక్కాడు ప్రసాదం.

## 3

మద్రాసు !!!

తనేదో అనుకున్నాడు-మరేదో, యింకేదో వూహించుకున్నాడు. కానీ అమ్మో!

భయంకరమైన ఊబిలా వుందీ వూరు. చెడిపోయినస్త్రీ శరీరంలా-స్పృశిస్తే పాపంలావుంది.

అసలు వచ్చేముందు ఏమనుకున్నాడూ యీ వూరు గురించి? తను సిన్మా స్క్రీన్ మీద అందమైన మనుషుల్ని లాలిత్యమైన మనసుల్నీ చూశాడు. నిశ్శబ్దమైన ప్రకృతినీ పారి పాల నురుగులా పొంగే సెలయేళ్ళనీ-చూశాడు. అలాగే ఏ ప్రెస్సుకెళ్ళినా మరే సంస్థకెళ్ళినా మర్యాదజేసి ఉద్యోగం ఇస్తారు అనుకున్నాడు. కానీ ఇక్కడంతా మిధ్య-మృగ్యం-తారుమారు.

ఓ దినం మద్రాసులో వో చెడిపోయిన స్త్రీలుండే ప్రాంతంలో వో తెలుగుప్రెస్సు కనబడితే వెళ్ళాడు. ప్రెస్సు అరుగుమీద నిలబడి ఆ వీధిని పరికించి చూస్తే పగటివేళ రాక్షసుడు సంచరిస్తాడని తలుపులుమూసుకుని రాత్రివేళలు మాత్రమే తెరిచే జానపద కథలు స్మరణకొస్తున్నాయ్. ఆ ప్రాంతమంతా రాత్రివేళలు దేహంతో వ్యాపారంచేసి పగలంతా సుషుప్తా

వస్థలో దొర్లి మూలుగుతూ పగటిని రాత్రిగా రాత్రిని పగలుగా మార్చుకుని బ్రతికే రకం స్త్రీలున్న ప్రాంతం.

లోనికెళ్ళాడు.

ప్రెస్సు యజమాని ప్రసాదం ముందు ఇంటర్వ్యూ ఆఫీసరు అవతారమెత్తాడు.

అతడి వాడయిన ప్రశ్నలకి చాలా ఓపిగ్గా సమాధానా లిచ్చేడు ప్రసాదం.

తొంబై రూపాయిల జీతంమీద ఉద్యోగం దొరికింది కడకి. కంపోజిటర్ వుద్యోగం.

కొండెక్కినంత ఆనందమైంది ప్రసాదానికి. తనకీ వూళ్ళో వుద్యోగం దొరికింది. ఆనందంగా వుండదూ!!!

## 4

తినగా తినగా వేపాకులో తియ్యదనం పుడుతుంది. స్త్రీని అనుభవించగా అనుభవించగా అసహ్యమో వైరాగ్యమో పుడుతుంది. అలాగే వుండగా వుండగా యీ వూరు కష్టాలు తెల్సి వచ్చాయి ప్రసాదానికి. తొంబై రూపాయిల్తో రెండుపూటలు తింటూ బ్రతకలేనని తెల్సుకున్నాడు.

సహోద్యోగి పాండురంగంతో అదే చెప్పి "బాబూ! యీ జీతంతో జీవితాన్నెలా నెట్టుకొస్తున్నావ్?" అనడిగాడు.

పాండురంగం పళ్ళు బయటపెట్టి పదిలంగా నవ్వాడు ఆ ప్రశ్నకి.

"నువ్వు ఓవర్‌టైమ్ జాబ్ చేస్తానంటే చెప్పు తంబీ! ప్రొప్రయిటర్‌తో నేను మాట్లాడ్తాను. అన్నట్టు ఓ.టీ.కి గంటకి యింతని వుంటుంది. ఎమౌంట్ చాలా ఎక్కువే ఇస్తారు" అన్నాడు పాండురంగం.

అతని మాటకికాస్సేపు ఆలోచించుకోకుండా "సరే చేస్తాను" అనిఒప్పేసుకున్నాడు ప్రసాదం.

"నైట్‌టైమ్ నువ్వు ఎంతసేపయినా వర్క్ చేసుకోవచ్చు. నీ ఓపికనిబట్టి ఉంటుంది ప్రతిఫలం" అని చెప్పాడు పాండురంగం.

ఆ ప్రెస్సులో ఎడ్యుకేషనల్ బుక్స్ ప్రబంధాలూ-కవితా సంపుటాలు ప్రచురిస్తుంటారు. రాత్రివేళలుకూడా ముద్రణ జరిగేంత యెక్కువగా వుండదు వర్క్.

మరేం అచ్చువేస్తారు ఆ పాండురంగం చెప్పిన రాత్రివేళల్లో???

## 5

ఆమె దేహంమీద మరే ఆచ్ఛాదనా లేదు.

అడుగు దళసరి ఉన్న ఆ ఫోమ్ బెడ్‌లో ఆమె కూరుకుపోతూ కామోన్మాదంతో ఫిట్స్ వొచ్చినట్టు గిలగిలా కొట్టుకుంటోంది.

అతనొచ్చి ఆ గుమ్మానికున్న కర్టెన్ అంచు తీసి పళ్ళకొసల్తో కొరుకుతూ ఆమెని చూస్తున్నాడు.

ఆమె రారా అని సైగచేసింది కళ్ళతో.

అతనొచ్చి ఆమెమీద పడ్డాడు విరిగిన నాగమల్లి కొమ్మలా.

"అబ్బా ఇంతసేపా?"

"ఎంత సేపయిందని?"

"నిరీక్షణలోవున్న బాధ నీకుతెలీదులేమరి."

"నిరీక్షిస్తేనే నీలోనిది మరింత పటిష్ఠం ఔతుంది."

"సరే లే ఇటు జరిగి, నీ చెయ్యి నా నడుం చుట్టూ అలు "

ఆ రాత్రివేళ కేసుమీద పెట్టిన వో సెక్స్ కథ వ్రాతప్రతి చదూతూ చెస్‌మీద లైపుల్ని కంపోజ్ చేస్తున్న ప్రసాదం చేతులు ఒణుకుతున్నాయ్. గుండెలు కొట్టుకోడం చెవులకి స్పష్టంగా విన్పిస్తోంది. రక్తం వెడెక్కిమరుగుతున్నట్టు తనకి అనుమానమే.

దాహం. ఏదో దాహం. ఏదో ఆవశ్యకత దేహానికి

లేకుంటే దొరక్కుంటే దాహం తీరదు— రక్తం చల్లారదు—తనని నలిపి నరకంలోకి విసిరెయ్యడం ఖాయం—ఔను. ఔనౌను.

కోరిక వోపక్క ప్రేరేపిస్తూ మరి అక్కడి నుంచి లేచి చేతులూ, ముఖం నీళ్ళతో కడిగి, నల్లటి మసిబట్టలు విప్పి మరకలున్న గోడకున్న మేకుకి తగిలించిన తన తెల్లబట్టల్ని తీసి దేహానికి తగిలించుకుని ఇక బయలుదేరాడా వీధిలోనికి.

కుళ్ళుకాల్వల పక్కన తాటాకు గుడిశల ముందు ఉతికిన శిల్కుబట్టలు కట్టుకుని అరవ




తెలుగులోనూ, శుద్ధ అరవంలోను, మళయాళం లోనూ కబుర్లాడుకుంటున్న పిల్లలు (వాళ్ళనలాగే పిలిస్తే బావుంటుందట) కన్పించారు.

వో గుడిశముందు పిల్ల 'రా' అని సైగ చేసింది.

ఆమె పిలుపులో శక్తి అని దేహంలో హోరు కలిపి ప్రసాదాన్ని ఆ వైపుకి మళ్ళించాయ్.

ఆ అర్థరాత్రివేళ ఆ మురికి గుడిశలో ఇరుకు మంచంమీద కుళ్ళిన దుప్పటికి మొట్ట మొదటిసారిగా పాడయ్యాడు ప్రసాదం.

అతని తలకింద ఆసమయంలోవున్న కుళ్ళు దిండులో కుళ్ళు మస్తిష్కానికి సోకి పాకినట్టు అనుమానం.

6

ఔను ప్రసాదం పాడైపోయాడు.

రాత్రివేళలు ప్రెస్‌లో సెక్స్ మేటర్ కంపోజ్ చేస్తూండగా ఉద్రేకం కలిగితే వెంటనే చేతులూ, ముఖం కడుక్కుని, బట్టలు వేసుకుని ఆ వీధిలో స్త్రీల ఇళ్ళకి బయల్దేరుకున్నాడు చాలా రెగ్యులర్‌గా.

ప్రసాదం రక్తం కుళ్ళుతోంది—ప్రసాదం దేహం పాడవుతోంది.

తనకి తెల్సు. కానీ, వూహలు మనసంతా పాకి ఒంటిని వేడెక్కించి అట్టు పొమ్మంటున్నాయ్.

7

మీ అమ్మ మృతశయ్యమీదుంది. వెంటనే నువ్వు రావాల్సింది- అని వాళ్ళ నాన్న రాసిన ఉత్తరం అందింది.

రెండేళ్ళ తర్వాత పట్నంనుంచి వాళ్ళవూరు వెళ్తున్నాడు. యీ రెండేళ్ళలో తనలో వచ్చిన మార్పుని తల్చుకుంటూ ప్రయాణిస్తున్నాడు ప్రసాదం.

8

పసలపూడి ఎర్ర కంకరరోడ్డుమీద ఎరుపు రంగు పల్చటి తెరలాంటి దుమ్మురేపి "వెల్ల" మీదినుంచి వెళ్ళే అచ్యుతాపురం టు కాకినాడ దెయ్యాల బస్సు ఆగింది.

అతను టిప్‌టాప్ కంపెనీ ఎర్ర సూట్‌కేస్ పట్టుకుని బస్సు దిగుతుంటే, గంగారావి చెట్టు చాటున ఉన్న అతని బీద ప్రేయసి చెయ్యి ఊపుతూ బస్సుదిగి వస్తూన్న ప్రియుడికేసి చూస్తూంది మెరిసే కళ్ళతో. అతను ఆమెకేసి చూశాడు. చవకరకం చిరిగినబట్టల్లో జాలిగా - బీదగా-బాధగా కన్పించిందామె. అప్పుడతని కన్పించింది—

ఆమె దేహంపై ఆచ్ఛాదనని తొలగించి ఆ గంగరావి చెట్టు చాటుకి ఆ చీకట్లోకి ఆమెని తీసుకుపోవాలని. □




వినాయకం ఆరోజు నిద్ర పోకుండా చాల ఆలోచించాడు.

తను నమ్ముకున్న సైకిల్‌పార్టీ రెండు చీలికలయింది. ఏ చీలికలో చేరాలా అన్నదే అతని ఆలోచన.

ఎన్నాళ్ళనించో అతను సైకిల్ పార్టీ టిక్కెట్టుమీద ఎన్నికవుతూ, ప్రజాసేవ చేస్తున్నాడు. అలా ప్రజాసేవ చేస్తూనే, నాలుగు చేతులా యధాశక్తి సంపాదించి, రైస్ మిల్లులా, పుగాకు కంపెనీలు, నిమ్మతోటలూ స్వంతం చేసుకున్నాడు. ఇంత ప్రజాసేవ చేసినా ప్రజలకు యింకా యెంతో చేయవలసి వున్నదనీ, వాళ్ళ ఆరోగ్యమే తనకు మహాభాగ్యమనీ, అతని నమ్మకం. ఆ నమ్మకంతోనే అతను ౘాయశక్తులా ప్రజాసేవ చేస్తున్నాడు.

ఇప్పుడు తననింతవాడిని చేసిన సైకిల్ పార్టీ రెండుగా చీలిపోయింది. కేంద్రస్థాయిలో రెండు పార్టీలవారూ, దేశంలో నా బలగం ఎక్కువంటే నా బలగం యెక్కువంటున్నారు. కాని నిజంగా, ఎవరికి ఎక్కువ పలుకుబడి వుందో, రాబోయే ఎన్నికలలో యెవరికి గెలిచే అవకాశముందో, వినాయకానికి అంతుబట్టటంలేదు. ప్లస్ పాయింట్లూ, మైనస్ పాయింట్లూ, కాగితంమీద వ్రాసి ఎన్నో కూడి

కలూ, తీసివేతలూచేసి (వినాయకం కూడికలూ తీసివేతలూ చేయటం ఏమిటి రైటరూ అని ఆశ్చర్యపోకండి. ఆయన యెంత వేలిముద్రగా డయినా, లెక్కలు చేయటం తెలిసిన చెమ్చా ఒక డున్నాడు ఆయనకి) చివరికి రెండు పార్టీ లకూ సమానమైన బలగం వున్నట్టుగా నిర్ణ యించుకున్నాడు. అందుకే యింతగా ఆలోచి స్తున్నాడు——సైకిల్ ముందు చక్రం పార్టీలో చేరాలా, వెనక చక్రం పార్టీలో చేరాలా అని. తన బట్టతలమీదవున్న నాలుగున్నర వెంట్రు కలూ పీక్కున్నా, వెంట్రుకలు తెగాయే కాని, ఆలోచన మాత్రం తెగలేదు.

మర్నాడు తన మేడమీద బాల్కనీలో కూర్చుని, తలమీద జుట్టు పీక్కుందామంటే అలాటిదేమీ అక్కడ లేదు కనుక, యేం చేయాలో తోచక, రోడ్డుమీద వచ్చే పోయే జనాన్ని చూస్తూ కూర్చున్నాడు.

చేతిలో పేపరు మాత్రం వుంది. అంటే ఆయన పేపరు చదువుతున్నాడని కాదు—— చదవటం రాదు కనుక వూరికే, అలా, హస్త భూషణంలాగా పట్టుకుని కూర్చున్నాడు.

ఇంతలో రోడ్డుమీద జరిగే ఓ సంఘటన ఆయన్ని ఆకర్షించింది. రోజూ స్నేహంగా తిరుగుతూ, ఒకదాని శరీరం యింకోటి నాక్కునే, ఆ రోడ్డుతాలుకు రెండు కుక్కలూ, కాట్లకుక్కల్లా, అదే రోడ్డుమీద, పెద్దగా అరుస్తూ కొట్టుకుంటున్నాయి. అది చూడగానే ఆయనకు సైకిల్‌పార్టీ గుర్తుకొచ్చింది.

ఈలోగా యీ అరుపులు విని ప్రక్కరోడ్డు లోని కుక్క ఒకటి పెద్దగా అరుచుకుంటూ వచ్చింది. రావటం, రావటం, ఈ రెండు కుక్కలమీదా విరుచుకు పడింది. ఈ రెండు కుక్కలూ అనవసరపు అరుపులు మాని, తోక ముడిచి పరుగెత్తాయి. ప్రక్కవీధికుక్క, వాటిని రోడ్డు చివరిదాకా తరిమి, వెనక్కి వచ్చింది. విజయోత్సాహంతో, గర్వంగా,రీవిగా అక్కడే తిరుగుతున్నది.

అది చూసి తల ఎత్తిన వినాయకానికి, గోడమీద అర్జునుడికి గీతోపదేశం చేస్తున్న శ్రీకృష్ణుడి తైలవర్ణచిత్రం కనపడింది.

బట్టతల పంకించి, లేచి, ధోవతి సర్దుకుని, క్రిందకు వచ్చాడు.

మర్నాడు పేపర్లన్నింటిలోనూ వచ్చింది - వినాయకం సైకిల్‌పార్టీనుంచి రాజీనామా చేసి ఏనుగుపార్టీలో చేరాడని——సైకిల్‌పార్టీ విడి పోవటం తనకేకాక, దేశానికి నచ్చలేదన్నాడు. "కలసి వుంటే కలదు సుఖం" అన్నాడు. "దేశమంటే మనుషులోయ్" అన్నాడు. "మనుషుల్లో దేవుడులాగా వుండాలి రాజకీయ నాయకు"డన్నాడు. యింకా తనకు తెలిసిన నాలుగయిదు తెలుగు సినిమా పేర్లు కలిపి కొన్ని డైలాగులు చెప్పాడు. లక్ష్యం, చిత్త శుద్ధి, వున్నపార్టీ ఏనుగుపార్టీ ఒక్కటే అన్నాడు——తాడిత పీడిత ప్రజానీకానికి రక్షణ నిచ్చేది ఏనుగే, ఏనుగే, అన్నాడు. తన అంతిమక్షణం వరకూ, ప్రజాసేవకే తన జీవితం అంకితమనీ, మానవసేవే మాధవ సేవ అనీ అన్నాడు. ఫోటో కూడా వేయించు కున్నాడు.

వెంటనే రాష్ట్ర రాజధానికి వెళ్ళి, ఏనుగు పార్టీ టిక్కెట్టు సంపాదించుకుని, ఎన్నికలకు తన వూరినించే, ఏనుగుపార్టీ అభ్యర్థిగా నామి నేషన్ పడేశాడు.

మొత్తం ఆ వూరినించి నలుగురు అభ్యర్థులు నుంచున్నారు. వినాయకం ఏనుగు పార్టీ టిక్కెట్టుమీద, యింకొకాయన సైకిల్‌ముందు చక్రం పార్టీమీదా, యింకొకాయన సైకిల్ వెనక చక్రం పార్టీమీద, ఇంకో అనామకుడు స్వతంత్ర అభ్యర్థిగా గుర్రంమీదా (సారీ, గుర్రం గుర్తుతో ఇండిపెండెంట్‌గా) నుంచు న్నారు. అందరూ ముమ్మరంగా ప్రచారం సాగించారు ఒక్క గుర్రంగారు తప్ప—— గుర్రం ఆయన అసలు యిల్లు కదలటం లేదు. హాయిగా యింట్లో గుర్రం ఎక్కి పేకాట ఆడుతూ కూర్చున్నాడు. మిగతావాళ్ళుమాత్రం, నోట్లు చల్లి ఓట్లు పండించటానికి ప్రయత్నం చేస్తున్నారు.

వినాయకం పుగాకు, బియ్యం,నిమ్మకాయలు

మొదలయినవి పండించటంలోనేకాక, ఓట్లను పండించటంలోకూడా చాల అనుభవం కల వాడు—అందుకని అతని పంట మూడు పువ్వులూ, ఆరు కాయలుగా వచ్చింది. అసలు ఎనిమిది కాయలుగా వచ్చేదేకాని, ముందే రెండు (మందు) కాయలు గుర్రంగారి ఇంటికి పంపించాడు. వాటితోపాటూ కొన్ని విత్తనాలు కూడా పంపించాడు. దాంతో గుర్రంగారు,పంచ కల్యాణి గుర్రమెక్కి, వినాయకంగారికి సపోర్టుగా తను విరమింకుంటున్నానని, సీసాలు బద్దలుకొట్టి మరీ ప్రకటించాడు.

తరువాత కథ తెలుగు సినిమాలా చివరికి సుఖాంతం అవటంతో, వినాయకం, పదివేలు ఓట్ల మెజారిటీతో, మళ్ళీ ఎన్నికయాడు— ఏనుగుపార్టీ, ఏనుగు పార్టియే అన్నాడు— ఏనుగు పార్టీ ఎం.ఎల్.ఏగా తన ప్రజాసేవలో ఏమీ లోపం వుండదన్నాడు.

యిక్కడిదాకా కథ బాగానే వున్నా, యిక్కడే కొంచెం అడ్డం తిరిగే సూచనలు కనపడ్డాయి.

మొత్తం ఆ రాష్ట్రానికి వున్న సీట్లు తొంభయి—గమ్మత్తేమిటంటే ఏనుగుపార్టీ ముప్ఫయి సీట్లూ, సైకిల్ వెనక చక్రం పార్టీ ముప్ఫయిసీట్లూ, ముందుచక్రంపార్టీ ముప్ఫయి సీట్లూ గెల్చుకున్నాయి. అంటే యెవరికీ ఆబ్సల్యూట్ మెజారిటీ రాలేదు. ఏ పార్టీలోంచయినా పదిహేనుమంది యింకో పార్టీలో చేరితే ఆ పార్టీ ప్రభుత్వాన్ని నిలపగలదు. ఈ నిజాన్ని గుర్తించినవాడై వినాయకం వెన్వెంటనే— చెమ్చాతో సహా రాకెట్ వేగంతో రాజధాని చేరుకున్నాడు.

సరాసరి ఏనుగుపార్టీ ఆఫీసుకి వెళ్ళాడు. వెళ్ళి "హలో" అందామనుకునేలోపలే, ఏదో అనుమానం వచ్చింది. ఎందుకేనా మంచిదని, చెమ్చాని, అక్కడ యెంతమంది వున్నారో లెక్కెయ్యమన్నాడు. ముప్ఫయిమందీ అక్కడికి చేరుకున్నారటకానీ—అప్పుడు అక్కడ పదిమందే వున్నారు—అంటే మిగతా యిరవైమందీ ఏమయినట్టు? వేరే పార్టీలో చేరిపోలేదు కదా?

వినాయకం గుండెలు జారిపోయాయి.

"మనమూ యిక దేంట్లోనో చేరిపోదాం గురూ" అన్నాడు చెమ్చా.

కాని ఎక్కడకు వెళ్ళేట్టు? ఆ యిరవై మంది ముందుచక్రం పార్టీలో చేరారో, వెనక చక్రం పార్టీలో చేరారో తెలీదే? తను ముందు చక్రం ఆఫీసుకు వెడితే, ఈలోగా వెనకచక్రం వాళ్ళు మంత్రివర్గాన్ని ప్రకటిస్తే? తనేం కాను? యిక ప్రజాసేవ యెలా చేసుకునేట్టు?

ఏమైనా కానీ, ఆలోచనకు సమయంలేదు. అంతేకాదు, యెవరినయినా, సలహా అడిగే విషయంకూడా కాదు, ఏదయినా మాట్లాడితే, ముందుగా అవతలివాడు, పరుగెత్తేసి ఆ పార్టీలో చేరిపోయేను.

"జై సాయిబాబా, నువ్వే రక్షించాలి" అనుకుని, వినాయకం, టాక్సీ యెక్కి యెంత వేగంగా పోగలిగితే అంత వేగంగా ముందు చక్రం ఆఫీసుకు ముందు పోనిమ్మన్నాడు—

టాక్సీ ఆగగానే చెమ్చాతో సహా టాక్సీ దిగి, లోపలకు పరుగెత్తాడు. పరుగెత్తుతున్నప్పుడే చెమ్చా అన్నాడు.

"గురూ దారిలో నాకో టాక్సీ కనపడింది. దాంట్లో ముందుచక్రం పార్టీవాళ్ళు పదిమంది వున్నారు—వాళ్ళు—ఏనుగుపార్టీ ఆఫీసుకి వెడుతున్నారులా వుంది!"

రక్కున ఆగిపోయాడు వినాయకం.

"సరే అక్కడ పదిమంది వున్నారు—ఈ పదీ కలిస్తే యెంతమంది అవుతారు?" అని అడిగాడు.

చెమ్చా వేళ్లు లెక్కేసి "ఇరవై—అంటే వాళ్ళు మంత్రివర్గం నిర్మాణం చేయలేరుగురూ" అన్నాడు.

వినాయకం మళ్ళీ "జై సాయిబాబా" అనుకుని గబగబా లోపలకు వచ్చాడు.

వినాయకం చెప్పేలోగానే చెమ్చా గబగబా అక్కడ వున్నవాళ్ళను లెక్కపెట్టాడు. "పది మంది గురూజీ" అన్నాడు.

"అంటే యిక్కడినుంచి కూడా కొంత



మంది లేచిపోయారన్న మాట" వినాయకం అరిచాడు.

"ఇక్కడా లాభంలేదు! పదండి గురూ, వెనకచక్రం ఆఫీసుకి" చెమ్మా పరుగెత్తుకుంటూ వెళ్ళి—టాక్సీ తలుపులు తెరిచాడు.

వినాయకానికి చిన్నప్పుడు గేదెలమీదనించి, కాలవలమీద నుంచీ దూకే అలవాటుంది. అది గుర్తుంచుకుని ఒక గెంతు గెంతి టాక్సీలో కూర్చున్నాడు.

టాక్సీ వాయువేగ మనోవేగాలతో వెనక చక్రం ఆఫీసువేపు వెడుతున్నది—

ఎదురుగుండా వస్తున్న టాక్సీని చూసి పెద్దగా అరిచాడు వినాయకం.

ఉలిక్కిపడ్డ చెమ్మా గబగబా టాక్సీలో వాళ్ళను లెక్కేశాడు.

"గురూ—పదిహేనుమంది మొత్తం!"

"డ్రయివర్‌తో కలిపి కాదు కదా" అన్నాడు వినాయకం.

"కాదు గురూ—పదిహేనుమంది వెనక చక్రంవాళ్ళు, ముందుచక్రం పార్టీలో చేరటానికి పోతున్నారు. మొత్తం " చెమ్మా చెప్పటం ఆపి తన చేతివేళ్ళూ, కాలివేళ్ళూ, వినాయకం కుడిచేతివేళ్ళూ అన్నీ లెక్కేసి, "ఇరవయి అయిదు అవుతారు గురూ—వాళ్ళకి లాభం లేదు!" అన్నాడు.

"అయితే యింకా వేగంగా పోనీ" అరిచాడు వినాయకం.

టాక్సీ, రెండు ఊరకుక్కల్నీ, నాలుగు సైకిళ్ళనీ, ఆరు కోడిపుంజుల్నీ తినేసి వెనక చక్రం ఆఫీసుకి ఆఘమేఘాల్లో వచ్చేసింది.

వినాయకం, చెమ్మా ఒకేసారి దూకారు టాక్సీలోంచి—

ఒక లాంగ్ జంపూ, రెండు హైజంపులూ చేసి ఆఫీసులో పడ్డారు.

చెమ్మా గబగబా లెక్కేశాడు, అక్కడి జన్నాన్ని.

"పదిమంది గురూ" అన్నాడు.

"ఏమిట్రా—నీ లెక్కలు తగలడా! ఎక్కడ పోయినా పదిమంది అంటావు. మిగతావాళ్ళు ఎక్కడ?" కోపం వచ్చింది వినాయకానికి.

చెమ్మా తలనిండా వెంట్రుకలున్నాయి—అందుకని కాసేపు తల గోక్కుని, వెంట్రుకలు పీక్కుని, ఆలోచించాడు.

"అర్థమయింది గురూ—అందరూ మన లాగానే పరుగెత్తుతున్నారన్న మాట తొంభై మందికీ ముప్ఫయిమందే ఆఫీసుల్లో వున్నారు. అంటే మిగతా అరవైమందీ యిలాగే తిరుగు తున్నారన్నమాట—"

"అయితే యిప్పుడేం చేద్దాం—త్వరగా చెప్పు" తొందరపడ్డాడు వినాయకం.

చెమ్మా రక్కున చెప్పాడు. "ఏనుగు ఆఫీసుకే పోదాం గురూ—కానీ వెంటనే పోవాలి మనం" ఈ వాక్యంలోని చివరిభాగం చెప్పేలోగానే, యిద్దరూ టాక్సీ ఎక్కేశారు.

ఈసారి టాక్సీ యెన్ని కోడిపుంజుల్నీ, కుక్కల్నీ తిందో యెవరికీ తెలీదు—ఎందు కంటే లెక్కపెట్టేలోపునే టాక్సీ ఏనుగుపార్టీ ఆఫీసుకి వచ్చేసింది.

అక్కడ టాక్సీ ఆగగానే, చటుక్కున దిగి, యెగిరి గంతేసి, లోపలకు రాబోయిన వినాయ కానికి, మూసివున్న తలుపు రపీమని కొట్టు కుంది. తలుపుకు వేసివున్న తాళానికి గుద్దు కున్నాడు చెమ్మా.

"ఎక్కడకుపోయారు చెప్మా" అన్నాడు వినాయకం.

ప్రక్కనే కూర్చుని తీరిగ్గా అరటి ఆకులో వుప్మా తింటున్న వాచ్ మెన్ చెప్పాడు. "అయ్యా—ఏనుగు పార్టీలోవాళ్ళు యిరవై మంది యిందాకే వెళ్ళి సైకిల్ ముందు చక్రం పార్టీలో చేరిపోయారు. అందుకని వాళ్ళు ముప్ఫయి మందీ, వాళ్ళు యిరవయ్యీ కలిసి మొత్తం "

చెమ్మావేళ్ళు కబగబా లెక్కపెట్టేయటం చూసి, తనలో ఓసారి నవ్వుకుని మళ్ళీ అన్నాడు వాచ్‌మన్.

"—మొత్తం ఏభయిమందీ 'ముందు చక్రంపార్టీ' తరఫున మంత్రివర్గం తయారు చేస్తారట—యిప్పుడే గవర్నర్ బంగళాకేసి వెళ్ళిపోయారు!" చెప్పటం ఆపేసి, జీడిపప్పు వేసిన ఉప్మాని, మళ్ళీ తినటం ప్రారం భించాడు.

హతోస్మి అనబోతున్న వినాయకం తల తిరిగిపోయింది.

చెమ్మా "అరెరె" అని నాలిక కొరుక్కు న్నాడేమో, నాలిక చుర్రుమంది.

"అవును! వీళ్ళందరూ గవర్నర్ బంగళా కేసి వెళ్ళటం నేను చూశాను.పాపం వినాయకం గారు యిప్పుడేం చేయాలి? ఆయన ప్రజాసేవ ఎలా చేసేట్టు? ఆయనకి ప్రస్తుతం ఏమిటి శరణం?" అన్నది,ప్రక్కనేనుంచుని ఇందాకటి నించీ యిదంతా చూస్తున్న గాడిద.

"మరి ఏనుగుపార్టీని గెలిపిద్దామనే వుద్దే శ్యంతో, ఈయనకు ఓట్లువేసిన ప్రజల కేమిటి శరణం?" తింటున్న కాగితాలను, కాసేపు నమలటం ఆపి, అడిగాడు ప్రక్కనే వున్న ఆ గాడిద కొడుకు.

"ఒరేయ్—అలా కాగితాలు తినవద్ద న్నానా. కాగితాలు తింటే నీకు చదురాదు!" కసిరింది తల్లి గాడిద. □

---

ఫ్రాన్సుదేశపు వార్తాపత్రికలు అమెరికా ప్రభుత్వంమీద కోపం ప్రదర్శిస్తాయి. ఇంగ్లండుదేశపు పత్రికలుకూడా అమెరికా ప్రభుత్వంపై కోపం ప్రదర్శిస్తాయి. జాలి కలిగించే విషయం ఏమిటంటే అమెరికా పత్రికలు కూడ అమెరికా ప్రభుత్వంపై వాటి కోపం ప్రదర్శిస్తాయి.

—శ్రీ శ్రవణ్

ఒకో దేశంవారికి ఒకో అలవాటు. అందమైన అమ్మాయిని పరిచయం చేసి నప్పుడు, ఇంగ్లండు దేశీయుడు ఆమె చేతిని పట్టుకొని కరచాలనంచేస్తాడు. ఫ్రాన్సు దేశస్థుడు చేతిని ముద్దుపెట్టుకుంటాడు. అమెరికావాసి, ఆమెను ఎక్కడైనా వెళదాం రమ్మంటాడు. రష్యా అతను అయితే సలహాకోసం మాస్కో తంతి పంపుతాడు.

—శ్రీ శ్రవణ్

# తెరుబారు కథ

## ఇచ్ఛాపురపు రామచంద్రం

"యస్ సర్ " తమకేం కావాలన్నట్లు చేతులు కట్టుకుని నిలుచున్నాడు బేరర్.

అతను చాలా ఆలోచించి—చివరకు ఒక నిశ్చయానికి రాగలిగినట్లు — చిరునవ్వు నవ్వుతూ—"ఛిల్డు బీర్." అన్నాడు.

బేరర్ కొంచెం ఆశ్చర్యపడి—అది తన కర్తవ్యం అన్నట్లు సూచించాడు. "చలిగా వుంది."

ఆ సూచనలోని అంతరార్థం—బీరువొద్దు, హాట్ డ్రింకేదయినా తీసుకొండని.

అతను నవ్వి— "నాకు నిజంగా డ్రింక్స్ అలవాటు లేదు. బీరుకూడా యెక్కువ తాగను. ఒకేగ్లాసు. తరువాత నువ్వే తీసుకోవలసిందే," అన్నాడు.

"ఇంతరాత్రి డ్రింక్స్ కోసం కాకుండా - శ్రమపడి బారుకి రావడం " అనుమానంగా చూశాడు బేరర్, కస్టమర్ అప్పటికే తెగతాగి వున్నాడేమో అని. కాని - నిజంగానే అతను కొంచెమయినా తాగినట్లు లేదు.

"చాలా కారణంవుంది. చెబుతాను. బీరు తీసుకురా. కబుర్లు చెప్పుకుంటూ కానిద్దాం—" అతని ముఖంలోకి చిత్రంగా—పరీక్షగాచూసి కదిలాడు బేరర్.

తాగడానికి వేళాపాళా ఏమిటికానీ, సాధారణంగా—అది తాగుడు పూర్తి చెయ్యడానికే తప్ప ప్రారంభించడానికి మాత్రం వేళకాదు. రెండో ఆట విడిచిపెట్టేసే వేళౌతూంది. మానేజర్‌కి కూడా నిద్ర వొచ్చేస్తూంది. చాలామంది బేరర్లు అప్పటికే నిద్రపోతున్నారు. రెస్టారెంట్ సెక్షనెప్పుడో మూసేశారు. తాగుతూ తిండానికి బిస్కట్లూ జీడిపప్పూ తప్ప ఏమీలేవు.

ఆ కస్టమర్ వింత మనిషిలావున్నాడు. కాకపోతే యిప్పుడు రావడం తాగడానికి కాకుండా బార్‌కి రావడం—తనతో కలసి తాగుతూ కబుర్లు చెబుతాననడం అన్నట్లు యితనెవరో కాని ఎప్పుడో ఎక్కడో చూసి నట్లుంది. ఎంత ఆలోచించినా జ్ఞాపకం రావడం లేదు.

ఏదీ కానివేళ ఎద్దీనిందన్నట్లు యిప్పుడు బారుకి రావడం కబుర్లుచెబుతాననడం వెర్రి వెయ్యి విధాలుట. అందులో యిదొకటి కాదు కద? ఏమయినా యిప్పుడో చిత్రమయిన కథ జరిగేటట్లుంది. కానియ్ చూద్దాం.

బీరు బాటిలూ గ్లాసులూ పట్టుకుని నడిచాడు బేరర్. కొంచెమయినా నురగ తేలకుండా బాటిలు తెరిచి ఒక గ్లాసునింపి అతని ముందుకు జరిపాడు.

"నువ్వూ పోసుకో. నా కొక్క గ్లాసుచాలు. అన్నట్లు బీర్‌కి చీర్సుండవు కదూ?"

"ఉండవు కాని క్షమించండి."

"మంచింగ్ గురించా? ఫరవాలేదు. నాకు ఆకలిగా లేదు. బీరుకి మంచింగ్ పెద్ద అవసర మని నే ననుకోను."

"అదికాదు "

"మరి?" బీరు ఒక గుక్క తాగాడు. "బీరు సిప్ చెయ్యరు. గల్పింగే. కాని చెప్పానుగా నాకు కొంచెమూ అలవాటూ అవసరమూలేదు." సిగరెట్ అంటించాను.

"నేను తాగను. అందుకే క్షమించమన్నాను. మీతో కలిసి తాగకపోయినా మీ మాటలు వినడానికి నాకేమీ అభ్యంతరం లేదు" విన యంగా అన్నాడు బేరర్.

"నిజంగా తాగవూ?" ఆశ్చర్యపోతూ చూశాడు కస్టమర్. "నమ్మలేక పోతున్నాను. బారులో బేరరుగావుండి కనీసం బీరయినా తాగనివాళ్ళు లేరే మరి"

"నేను చాలా మారిపోయాను. మారవలసి వచ్చింది. పరిస్థితుల లాగ వొచ్చేయి"

"నేనూను. జీవితం చాలా తమాషా అయింది. అది మనిషిని ఏమయినా చెయ్య గలదు. కాకపోతే నేనిప్పుడు యిక్కడ యిలా వుండవలసిన వాడి నెంతమాత్రమూ కాను. నా జీవితం ఓ గమ్మత్తయిన కధ! వింటావా? టూకీగానే చెబుతాలే."

"చెప్పండి. వింటాను. కానీ నన్నొక్క మాట చెప్ప నీయండి."

"తరువాత చెబుదువుగాని తప్పకుండా వింటాను. నే నిక్కడికి యిటువంటి వేళలో ఎందుకు వచ్చానో చెబితే ఆశ్చర్యపోతావు. నే నెవరినో తెలుసా? లక్షాధికారిని? వ్యాపార స్తుణ్ని. కలకత్తా వెళ్తూ యిక్కడ ఆగాను. నిజానికి చాలా ముందే వొచ్చి—యిక్కడ ఎక్కువసేపు గడపాలనుకున్నాను. కాని— పాడురైలు ఆలస్యమైంది. అన్నట్లు పదేళ్ళ కిందట యీ బారుకి రెస్టారెంట్ వుండేది కాదు కదూ?"

"పదేళ్ళ కిందట ఊహుఁ ఉండేది కాదు—"

"నీకెలా తెలుసు?"

"ఇది మా వూరేకదా?" ఆగి "మీరూ పదేళ్ళకిందట యిక్కడ బిజినెస్ చేసేవారా?"

"బిజినెస్ కాదు. ఈ బారులోనే బేరర్ని."

"ఆ!"

"అందుకు — ఆ మాట చెప్పుకుందుకు నేనేమీ సిగ్గుపడను. ఆ ఉద్యోగమే నన్నింత వాడిని చేసింది. ఎలా అంటావా? ఆరోజుల్లో బారుకి వొచ్చే వాళ్ళ సంఖ్య తక్కువే. కాని - రామ్‌లాల్ మాత్రం పదిమంది పెట్టు. కనీసం ఐదారుగురు స్నేహితులని వెంటేసుకుని రోజూ వచ్చేవారు. వారికి విధేయతతో అన్నీ అతి జాగ్రత్తగా సమకూర్చే వాడిని. ఆయన ఉదారుడు. రోజూ నాకు ఐదారు రూపాయలకి తక్కువ కాకుండా టిప్పు యిచ్చేవారు. అప్పటికి నేనింకా బ్రహ్మచారినే. బారువాళ్ళే భోజనమూ వసతీ యిచ్చి జీతమిచ్చేవారు. నా కేమంత ఖర్చులుంటాయి? రామ్‌లాల్ గారిచ్చే డబ్బంతా జాగ్రత్తగా దాచేవాడిని. నేనీ బారులో నాలు గైదేళ్ళ పాటు పనిచేశాను. ఐదారువేలపై చిలుకే జమ అయింది బ్యాంకులో నేను కూడ బెట్టి నది. దానితో బేరర్ పని మానేసి—మా వూరు పోయి బిజినెస్ ప్రారంభించాను. కలిసొచ్చింది. లక్షాధికారి నయ్యాను. నే నెప్పుడూ యీ బారుకీ ఆ రామ్‌లాల్ గారికీ కృతజ్ఞుణ్నే. ఎన్నోసార్లిక్కడకు వొచ్చి నా కృతజ్ఞతలు తెలుపుకుందా మనుకునేవాణ్ని. కాని వ్యాపా రంలో తీరిక చిక్కేదికాదు. చివరకివాళ కలకత్తా వెళ్తూ యిక్కడ దిగాను. కాని ఏం లాభం? రైలు లేటయి అర్ధరాత్రి దాటింది దిగేసరికి. ఆనాటి బారుకాదిది. చాలా మారి పోయింది. మానేజరెవరో కొత్తవాడు వచ్చి నట్లుంది! ఆ మానేజర్ని రామ్‌లాల్‌నీ కలుసుకుని కృతజ్ఞతలు తెలుపుకోవాలన్న నా కోరిక తీరదేమో! అసలు - రామ్‌లాల్ గారిక్కడ లేకపోడం చాలా ఆశ్చర్యమే. చీకటి పడుతూంటే వచ్చి తెల్లవార బోయేవరకూ బార్‌లోనే ఉండే వా రా రోజుల్లో"

"ఇప్పుడూ వారంతే. ఏటొచ్చీ మీ రన్నట్లు చాలా మార్పు." అన్నాడు బేరర్.

"అంటే?"

"జీవితం క్రూరమైంది. బారు—మరేని. జమీందారయిన రామ్‌లాల్ తన ఆస్తినంతటినీ యీ బారుకే ధారపోసేశాడంటే అట్టే అబద్ధం లేదు. ఆ చిన్న జమీందారు — పదేళ్ళలో పకీ రయిపోయాడు. అప్పులే మిగిలాయి. చివరకి భార్యకూడా అతన్నివదిలి వెళ్లిపోయింది. అతని బతుకు రోడ్డుమీద పడింది. వ్యసన

పరుటి కంతకంటె చక్కని శేష జీవితం ఎలా లభిస్తుంది? పాపరయినా అతను చచ్చి పోలేక పోయాడు. ఆత్మహత్య చేసుకోలేకపోయాడు. బ్రతుకు—దొడ్డతీపి కదా? రోడ్ల వెంట పిచ్చి వాడిలా తిరగసాగాడు. ఎవరేనా పెట్టిస్తే తినడం పోయిస్తే తాగడం. అలా వుండేవాడు. అలా రోడ్లుపట్టి తిరుగుతున్న రామ్‌లాల్‌ని చూసి జాలిపడి—బార్ మానేజరు గతం మరవలేని కృతజ్ఞతా విశ్వాసాల కొద్దీ యిక్కడ బేరర్ పని యిచ్చాడు. అందుచేత రామ్‌లాల్ యిప్పుడూ చీకటిపడ్డాక బార్‌కివచ్చి తెల్లవారే ముందే వెళ్తున్నాడు—"

"ఆః రామ్‌లాల్ జమీందారు బేరరయ్యాడా! విధి ఎంత చిత్రమైనది!"

"అంతే కాదు. ఒకనాటి బేరరూ, యీనాటి కస్టమరూ ఐన మీకుబీరు తెచ్చి అందించినది- ఒకనాటి కస్టమరూ, యీ నాటి బేరరూ ఐన రామ్‌లాలే. తన యీ స్థితికి దింపిన తాగుడుమీద అతనికి చాలా ద్వేషం. కనుకనే యివాళ యిప్పుడు మీతో కలిసి బీరయినా తీసుకో లేదు. "

"అంటే మీరు ?"

"ఆఁ రామ్‌లాల్‌నే. చితికి పోయిన చిన్న జమీందారునే." త్వర త్వరగా నడిచివెళ్తూ .. "మీరు కలుసుకుందా మనుకున్న రెండోవ్యక్తి మానేజరు ఊళ్ళోలేరు." అన్నాడు.

కస్టమర్ విభ్రాంతుడయ్యాడు.

నీరసంగా లేచి నడుస్తూ . "జీవితం కామెడీయే కాదు, ట్రాజిడీ కూడా!" గొణుక్కున్నాడు.

[ఈ కథకి నీతి —జార్లనీ పకీర్లనీ తారుమారు చేయగలిగే బార్లుండవొచ్చు. వాటినే తారు బార్లంటారు. బివేరాఫ్ దెమ్.] □






శేఖరం, అరుణా వెళ్ళేసరికి అప్పటికే చాలామంది వచ్చేశారు.

మొదట మూర్తి అన్నగారు వెంకట్రావు ఎదురుపడ్డాడు.

"ఇప్పుడుటయ్యా, రావటం" అంటూ శేఖరం భుజం తట్టాడు.

"వెళ్ళమ్మా! లోపలకి వెళ్ళు" అన్నాడు అరుణతో. అప్పుడే అటుకేసి హడావిడిగా వచ్చిన భార్యతో, "ఇదిగో! శేఖరం చెల్లెలు. లోపలకి తీసుకెళ్ళు" అన్నాడు. భారతి అరుణ చెయి పట్టుకుని చనువుగా "రా" అంటూ లోపలకి తీసుకెళ్ళింది.

వాళ్ళకి పెళ్ళయిన పదేళ్ళకి కొడుకు పుట్టాడు. ఈ రోజుకి వాళ్ళబ్బాయికి ఏడాది నిండింది. పుట్టిన రోజుని ఘనంగా జరుపుకొంటున్నారు.

భారతి అరుణని అలా చెయిపట్టుకుని సరాసరి అత్తగారిదగ్గరకి తీసుకెళ్ళి "శేఖరం

చెల్లెలు అరుణ" అని చెప్పింది ఆమెతో.

అరుణ ఆవిడ చొరవకి ప్రవర్తనకి తెల్లబోతుంటే-ఆవిడ తన పేరు చెప్పడంతో మరింత తెల్లబోయింది- తన పేరు వాళ్ళకెలా తెలుసా అని.

భారతి అత్తగారు, "రామ్మా! ఇలా కూర్చో" అంటూ తన ప్రక్కన కూర్చోపెట్టుకుంది. "మీ వదిన రాలేదేం?" అంటూ ఇంకా ఏవేవో అడిగిందావిడ. అరుణ అన్నిటికీ వినయంగా జవాబు చెప్పింది.

"అమ్మా!" అని వెంకట్రావు పిలవటంతో అన్నపూర్ణమ్మగారు "వస్తున్నా."నంటూ వెళ్లింది. అక్కడ అరుణ ఒక్కతే మిగిలిపోయింది.

తనకెవరూ తెలియదు. ఏంచేయాలో తోచనిదానిలా అలాగే కూర్చుండిపోయింది. అరుణకి శేఖరంమీద చెప్పలేని కోపం వచ్చింది. హాయిగా మీరాతో కబుర్లు చెప్పుకోనీయకుండా ఇక్కడకి లాక్కొచ్చేడు. విసుక్కుంది.

అరుణ ఆ గదిలో ప్రతీ వస్తువును పరీక్షగా చూస్తూ - ఓ పదినిముషాలు అలాగే కూర్చుంది.

మూర్తి ఆ గదిలోకి రావటంతో ఉలికిపడి లేచి నిలబడింది. అతని కళ్ళు మెరిసాయి. "మీరొక్కరూ ఇక్కడ కూర్చున్నారా!" అన్నాడతను ఆశ్చర్యంగా.

ఇందాకటినుండి అతని కళ్ళు అరుణకోసం గాలిస్తున్నాయి. అరుణ ఎంతకీ కనిపించకపోయేసరికి శేఖరం ఒక్కడే వచ్చేడనుకొన్నాడు. రాలేదనుకొన్న అరుణ హఠాత్తుగా ఇక్కడ కనిపించటంతో అతనికి చాలా సంతోషమేసింది.

ఏమనాలో తెలియనిదానిలా చిన్నగా నవ్వి ఊరుకొంది అరుణ.

మూర్తితో ఎప్పుడూ ప్రత్యేకంగా మాట్లాడిందిలేదు అరుణ.

మూర్తి శేఖరంకోసం వచ్చినప్పుడు అరుణ ఎదురుపడి 'శేఖరం వున్నారా?' అని అడిగితే వుంటే వున్నాడని కూర్చోమని లేనప్పుడు లేడని చెప్పి లోపలకి వెళ్లిపోయేది.

మూర్తి అల్మారా దగ్గరకెళ్లి ఏదో తీసుకొంటూ, అన్నాడు, "మీరూ అక్కడకి రండి! ఇక్కడ ఒక్కరూ కూర్చోవడం ఏమిటీ? అసలు మీరొచ్చినట్లు వదినావాళ్ళకి తెలుసా?"

తెలుసు అన్నట్లు తలూపి గుమ్మంవరకూ వెళ్ళి ఆగిపోయింది అరుణ.

అరుణ తనంత తను ఎవరితోటీ మాట్లాడలేదు. కొద్ది పరిచయం పెరిగిందంటే అరుణ మాట్లాడినట్లు ఎవరూ మాట్లాడలేరేమో! అవతల వాళ్ళ మాటా అదీ నచ్చితేనే పరిచయం పెంచుకొంటుంది.

మూర్తి గదిలోంచి వెళ్తూ అరుణదగ్గర ఆగి "రండి" అన్నాడు.

అరుణ తప్పనిసరిగా వచ్చింది.

అరుణ అలా వచ్చి కూర్చున్న అయిదు నిముషాలకి భారతి అరుణని వెతుక్కుంటూ వచ్చి, "ఇక్కడున్నావా! నీకోసం అక్కడంతా వెతికేను. సరే! కూర్చో" అంటూ వచ్చినంత హడావిడిగానూ వెళ్ళిపోయింది.

దాదాపు వచ్చినవాళ్ళంతా వెళ్ళిపోయారు. బంధువులు మాత్రం పదిమందిదాకా వున్నారు. శేఖరం కాస్త విడిగా కనిపిస్తాడేమో వెడదామా అని అడగటానికి ఎదురుచూస్తూ కూర్చుంది అరుణ.

శేఖరానికి అసలు ఇంటికెళ్ళే ధ్యాస లేనట్టుంది. మహతీరిగ్గా కుర్చీలో వెనక్కి జార్లబడి వెంకట్రావుతో కబుర్లు చెప్తున్నాడు. ఒక్క మూర్తితోనే కాదు, ఈ కుటుంబంలో అందరితోనూ అనుబంధం వున్నట్టుగావుంది అన్నయ్యకి అనుకుంది.

మూర్తి శేఖరంకోసం వచ్చినప్పుడు చాలా మామూలుగా మాట్లాడేవాడు. ఇప్పుడు అతని మాటలు అప్యాయతని అభిమానాన్ని వ్యక్తపరుస్తోంటే అతని చూపులు అనురాగాన్ని పలికిస్తున్నాయి.

మూర్తి మాట్లాడినప్పుడు అరుణ గ్రహించేది కాదుగాని అరుణంటే మూర్తికి ప్రత్యేక అభిమానం వుంది. అన్నగారికోసం వచ్చినప్పుడు అడిగినదానికి జవాబు చెప్పి తలొంచుకొని వెళ్ళిపోవటమేగాని శ్రద్ధగా ఎప్పుడూ అతన్ని గమనించలేదు. అంత ముభావంగా వున్న అరుణని మూర్తి ఏం మాట్లాడించడానికీ ప్రయత్నించేవాడు కాదు.

మూర్తికి పెళ్ళి సంబంధాలు వస్తున్నాయి. ఆ మధ్య రెండుసార్లు పెళ్ళి చూపులకి వెళ్ళి రావటం జరిగింది. ఆ రెండూ నచ్చలేదు.

తర్వాత అరుణని చూశాక—అరుణంటే ఇష్టం ఏర్పడ్డాకా అతను పెళ్ళిచూపులకి వెళ్ళడం మానుకొన్నాడు. అన్నగారు పెళ్ళిచూపులకి రమ్మన్నప్పుడు నేనిప్పుడప్పుడే పెళ్ళిచేసుకోనని చెప్పి చూపులకెళ్ళడం తప్పించుకొంటున్నాడు.

నెలరోజుల క్రితం మాటల్లో తన అభిప్రాయాన్ని తెలిపాడు.

శేఖరానికి అంతక్రితమే ఈ అభిప్రాయం వుంది. తల్లి వూరునుంచి రాగానే తల్లితో సంప్రతించి అప్పుడు మూర్తిని అడుగుదామనుకొంటున్నాడు.

మూర్తి ఆమాట అడగటంతో అతనికి చాలా సంతోషమేసింది. తల్లికి వెంటనే ఉత్తరం రాసేయాలనుకొన్నాడు.

కాని మూర్తి అప్పుడే ఎవరికీ చెప్పొద్దన్నాడు. అతనికి అరుణతో ప్రత్యేకంగా మాట్లాడాలని వుంది. అంత అమాయకంగా—సిగ్గుగా వుండే అరుణని ఎలా మాట్లాడించాలో—అసలు ఏవిధంగా మాటల్లోకి దించాలో అతనికి అర్థమయేది కాదు.

శేఖరాన్ని అడిగి ఆల్బంలోంచి అరుణ ఫోటోని తీసుకొన్నాడు - ఆ ఫోటో తనకి బాగా నచ్చిందంటూ. శేఖరంకూడా ఏం అభ్యంతరం చెప్పలేదు.

ఓసారి భారతి మూర్తి పెట్టె సర్దుతూ అరుణ ఫోటో చూసింది.

అది వెంకట్రావువరకూ వెళ్ళింది. తమ్ముడు ఇందుకే పెళ్ళిచూపులకి వప్పుకోవటం లేదా అన్న అనుమానం వచ్చింది. తను తమ్ముడ్ని అడగటంకన్నా భార్యచేతే అడిగించటం మంచిదనుకొన్న వెంకట్రావు ఆ అమ్మాయి ఎవరో, ఏమిటో తెలుసుకొనే భారం భార్యకే వప్పగించేడు.

ఇటువంటి విషయాలు తలిదండ్రుల దగ్గర—అన్నగార్లదగ్గరకన్నా వదినలతోనే చనువుగా చెప్తారు మరదులు. మనసులో మాట సూటిగా చెప్పగలుగుతారు కూడా. మాటల్లో భారతి మరదిని కదుపుతూనే వుండేది. ఆఖరికి ఓసారి ఫోటో గురించి అడిగేసింది.

అసలు సంగతి చెప్పకపోతే ఇంకేవేవో వూహించుకొంటారని మూర్తి అసలు సంగతి చెప్పేశాడు. అతను అరుణతో మాట్లాడే వరకూ ఎంత గుట్టుగా వుంచాలనుకొన్నాడో అంతా తెలిసింది. ఈ సంగతులేవీ అరుణకి తెలియవు.

అరుణా శేఖరం కూడా బయలుదేరారు.

అన్నపూర్ణమ్మగారూ, భారతీ అరుణని "ఎప్పుడన్నా వస్తూండమ్మా!'' అన్నారు.

బస్టాపు వరకూ మూర్తి వచ్చేడు. బస్సు ఎక్కేటప్పుడు ఇంక బాగుండదని, మూర్తితో "వస్తామండీ!" అంది.

అతను కళ్ళతోనే 'సరే' అన్నట్లు సమాధానమిచ్చేడు.

బస్సు దిగి అరుణా, శేఖరం నడుస్తున్నారు.

తన పక్కగా కారు ఆగటంతో ఉలికిపడింది అరుణ.

ఎవరా అని తలెత్తి చూశాడు శేఖరం.

కోటేశ్వరరావుగారు డోరు తెరుచుకొని దిగుతూ, "ఏమిటి శేఖరం! ఎక్కడా జాడలేవు" అన్నారు. అలా అంటూనే అరుణని ఈ అమ్మాయి ఎవరా అన్నట్లు చూశాడు. ఇది గ్రహించిన శేఖరం "మా చెల్లెలు—అరుణ" అన్నాడు.

ఆయన తేలిగ్గా వూపిరి పీల్చుకొన్నారు. "ఇన్నాళ్ళు నువ్వు కనపడకపోతే వూరు వెళ్ళేవేమో ననుకొన్నాను" అన్నాడు. శేఖరం ఏదో చెప్పబోయేంతలో మళ్ళీ ఆయనే అన్నాడు "నిన్న మంగపతి చెప్పేడు. నువ్వు ఊళ్ళోనే ఉన్నావని."

రావుగారు మొదట వూరెళ్ళేవేమోననుకొన్నాను అనగానే మరేనండీ! ఊళ్ళో లేను అందామనుకొన్నాడు-నయం అన్నాను కాదు అనిపించింది.

"రండి! ఇక్కడ మాట్లాడుకోవడం ఏమిటి?" అన్నాడాయన.

"రేపు కలుస్తాలెండి" అన్నాడు శేఖరం.

"పోనీ మీ ఇంటిదగ్గర డ్రాప్ చేస్తాను, ఎక్కండి" వెనక డోరు తెరుస్తూ అన్నాడు.

"మా చెల్లెలు బజారు వెళ్దామంటే ఇలా బయలుదేరేం."

"సరే అయితే! రేపు కలవటం మర్చిపోకు. నాలుగురోజులనించీ నిన్ను కలవాలని— మీ ఇల్లెక్కడో తెలియదు నాకు. ఎక్కడా మీ ఇల్లు?' అడిగాడు.

వెనక్కి చెయి చూపిస్తూ, "ఇక్కడికి దగ్గిరేనండీ! రేపు వచ్చి కలుస్తాలెండి" అన్నాడు వినయంగా.

"మర్చిపోకు" అని మరోసారి చెప్పి వెళ్ళిపోయాడు రావుగారు.

"ఎవరన్నయ్యా!" అని అడిగింది అరుణ.

"పంచదార ఫ్యాక్టరీ!"

ఫక్కుమంది అరుణ.

"ఏమిటే!" తెల్లబోయి చూశాడు శేఖరం.

"ఆయనే పంచదార ఫ్యాక్టరీనా?" నవ్వుతూ అంది.

శేఖరానికి నవ్వొచ్చింది. "యజమాని" అన్నాడు.

జ్యోతి సెంటర్‌కి తీసుకెళ్ళి అలా అవమానించాక మళ్ళీ జ్యోతిని చూడలేదు శేఖరం. అసలు అప్పటినించీ రావుగార్ని కూడా కలవలేదు. రావుగారి ఆఫీసుకి వెళ్ళాలిగాని ఇంటికెళ్ళడం అతనికి అస్సలిష్టంలేదు. జ్యోతినీ, మీరానీ తల్చుకొంటేనే అతనికి కంపరంగా వుంది. జ్యోతిని

చూడగానే తనకి కోపం వస్తుంది—ఆ కోపంలో తనేమంటాడో—ఇలా ఆలోచిస్తున్న శేఖరం ఇందాక అరుణ అడిగినదానికి పరాగ్గా అలా అన్నాడు.

*  *  *

మర్నాడు శేఖరం రావుగారింటికి వెళ్ళాలా వద్దా అని చాలాసేపు ఆలోచించేడు. చివరికి వెళ్ళటానికే నిశ్చయించుకొన్నాడు.

ఈ ఫ్యాక్టరీ సంగతి అటో-ఇటో తేల్చుకొనేవరకూ అతనికి వేరే ఏమీ తోచేలాలేదు.

ఏడాదినుండీ వూరికే కూర్చోకపోయినా పనంటూ ఏం జరగకపోవటంతో అతనికి స్థిమితం లేకుండా పోయింది

ఇదేదో "ఎస్" అనేస్తే శేఖరాన్ని చేజేతులా వదులుకొన్నట్లే। అంతకన్న తెలివి తక్కువపని మరోటుండదు—ఇలాంటి అవకాశం ఇక జన్మలో దొరకదని కోటేశ్వరరావుగారి అభిప్రాయం.

సొంతవూరికి దగ్గరలో వుంది. అన్నివిధాలా అనుకూలంగా వుంటుందని శేఖరం అభిలాష। అందుకే అంత ఓరిమి వహిస్తున్నాడు.

శేఖరం ఆఫీసుకు వెళ్ళేసరికి రావుగారు ఎవరితోనో మాట్లాడుతున్నారు.

శేఖరాన్ని వాళ్ళకి—వాళ్ళని శేఖరానికి పరిచయం చేశాడు.

ఆ వచ్చినవాళ్ళు ఎదో కాలక్షేపానికి వచ్చినట్లుగానే అన్పించింది శేఖరానికి.

కోటేశ్వరరావు వాళ్ళని ఓ పావుగంటలో పంపేశాడు.

శేఖరం ఏమాటా అడగటానికి సందు ఇవ్వకుండా ప్రపంచంలో ఎన్ని అన్యాయాలు జరుగుతున్నాయో వివరంగా చెప్పడం మొదలుపెట్టి, హఠాత్తుగా ప్రసంగం ఆపి, "పదు మనింటికెళ్దాం। ఇక్కడ మాట్లాడుకోవటం ఏమిటీ?" అంటూ లేచేడు.

"పనుందండి। మరోసారి వస్తాను. మీతో వస్తానని చెప్పానుకదా. నా కోసం చూస్తూంటారని వచ్చేను" వినయంగా అన్నాడు శేఖరం. వాళ్ళింటి కెళ్ళడం శేఖరానికి ఏమాత్రం ఇష్టం లేదు.

ఆయన తమాషాగా నవ్వుతూ అన్నాడు "పనులు ఎప్పుడుండవు చెప్పు శేఖరం' వాటి చెప్పు చేతల్లో మనం ఇరుక్కోకూడదు, మనం చెప్పినట్లు అవి వుండేటట్లుగా చూసుకోవాలి."

కోటేశ్వరరావులాంటి వాళ్ళతో ఇదే చిక్కు। వాళ్ళు ఎదుటివాళ్ళ అభిప్రాయాలుగాని ఇబ్బందులుగాని గ్రహించరు, గుర్తించరు. ఒకవేళ గ్రహించనా గ్రహించనట్లే మసులుకొంటారు.

ఈ ఫ్యాక్టరీ విషయంలో ఈయన ఇలా కప్పదాట్లు ఎందుకు వేస్తున్నాడో శేఖరానికి సరిగ్గా తెలియదు. ఆయన వ్యాపారంలో తనని కలుపుకోవాలనే అని అతను అనుకొంటున్నాడు. అందుకే అతని స్వభావానికి విరుద్ధంగా ఆయన 'అవును—కాదు' అని తేల్చకుండా ఇన్నిసార్లు తిప్పుతున్నా ఓరిమి వహించి శ్రమనుకోకుండా తిరుగుతున్నాడు.

కోటేశ్వరరావుగారు, శేఖరం వచ్చేసరికి జ్యోతి—ఇంకా అయిదారుగురు అమ్మాయిలు-దేనికోకాని గట్టిగా నవ్వుకొంటున్నారు.

శేఖరం అడుగు ముందుకి పడనివాడిలా అక్కడే నిలబడిపోయాడు. ఆ అమ్మాయిల్లో ఒకమ్మాయి రావుగారూ, శేఖరం రావటం చూసింది. జ్యోతి చేతిమీద చిన్నగా గిల్లుతూ "అడుగో మీ ఎర్ర తేలు" అంది గుసగుసగా.

జోతీ—జ్యోతితోబాటు వాళ్ళకి కాస్త ఎడంగా — పరధ్యాన్నంగా ఎప్పుడెప్పుడు ఇక్కడ నించి పోతాన్రా బాబూ అనుకొంటూ ముళ్ళమీద కూర్చున్నట్లు కూర్చున్న మీరా ఒకేసారి ఉలిక్కిపడ్డారు.

మీరా గుమ్మంకేసి చూసింది.

ఈ బృందంలో మీరా వుందా లేదాని చూస్తున్న శేఖరం అప్పుడే మీరాకేసి చూశాడు.

చిత్రంగా ఒకరికేసి ఒకరు ఒకేసారి ఎలా చూసుకొన్నారో ఒకేసారి ఇద్దరు మొహాలు తిప్పేసుకొన్నారు.

"జ్యోతీ!" అని రావుగారు పిలవటం-జ్యోతి వినయంగా బుద్ధిమంతురాలిలా లేచి నిల బడటం కూడా ఒకేసారి జరిగాయి.

జ్యోతి తండ్రి దగ్గరగా వచ్చి, శేఖరానికి నమస్కారం చేసింది.

శేఖరం ఏం మాట్లాడకపోవటం చూసి, రావుగారు అతనేదో పరధ్యానంగా వున్నాడను కొన్నారు.

"రా, శేఖరం!" అని శేఖరాన్ని ఆయన పడక గదిలోకి తీసుకెళ్ళేరు.

శేఖరం తప్పనిసరిగా ఆయన వెనకే తలొంచుకొని వెళ్ళేడు.

జ్యోతి ఫ్రెండ్సుకి ఏదో చెప్పి పంపిస్తోంది.

మీరా తను ముందే లేచి జ్యోతికి చెప్పి ఇవతలకి వచ్చేసింది.

మీరాకి చాలా చిరాగ్గావుంది. అంతమంది అమ్మాయిల్ని వదిలేసి—తనని అవమానించిన జ్యోతిని వదిలేసి—తనకేసి ఎందుకలా చూస్తాడు? తనేం చేసింది మధ్య! తనసలు ఇక్కడికి రావటం పొరబాటు తన కసలు ఇక్కడకి రావటం ఇష్టమేలేదు. తల్లి కూడా వెళ్ళమనటంతో తప్పనిసరిగా వచ్చింది.

మీరా, కాంతమ్మ బజారునుండి వస్తోంటే జ్యోతి, బృందం కలిశారు.

మీరాని వాళ్ళింటికి రమ్మని అడిగింది జ్యోతి. మీరాకి వెళ్ళటం ఇష్టంలేక రేపొస్తానని చెప్పి తప్పించుకో జూసింది.

"మీరు వెళ్ళమని చెప్పండి! మీరా వస్తుంది" కాంతమ్మతో అంది జ్యోతి.

మీరా ఏదో చెప్పబోయింది. కాంతమ్మ బాగుండదని "వెళ్ళు మీరా!" అంది.

మీరాకి వాళ్ళతో వెళ్ళక తప్పలేదు. వాళ్ళు వెడుతోంటే "తొందరగా వచ్చెయ్!" అంది కాంతమ్మ వెనకనించి.

తనేదో అరుణతో చెప్తుందని అతనికి భయం కాబోలు. లేకపోతే అస్తమానూ తన కేసెందుకూ అలా చూస్తాడు? తప్పుచేసిన జ్యోతి బాగానే వుంది. అంత పకపకలాడి తైతక్క లాడిన జ్యోతి ఫ్రెండ్సు బాగానే వున్నారు. అసలు సంగతేమిటో తెలియకుండా ఆ అట్ట చేత్తో పట్టుకున్న నేరానిగ్గాను- కనిపించినప్పుడల్లా ఆ చూపేమిటి!

ఠ ఠ ఠ

అదివరకు పెళ్ళిమాట ఎత్తేసరికి ఇంతెత్తు ఎగిరిపడి, తలిదండ్రులు ఎన్నివిధాల చెప్పినా వాళ్ళమాటలు లెక్కచేయక పెళ్ళిచూపులకొచ్చిన వాళ్ళతో పెంకెగా మాట్లాడిన జ్యోతి ఇప్పుడు శేఖరం గురించి చెప్పినప్పుడు చాలా బుద్ధిమంతురాలిలా వినటమే కాకుండా అచరించ బలుచుకొంది.

అదివరకు అతన్ని ఎలా పరాభవించాలా అని ప్లానువేసే జ్యోతి ఇప్పుడు అతన్ని ఎలా లొంగదీసుకోకలదా అని ఆలోచించని క్షణంలేదు.

శేఖరాన్ని సెంటర్‌కి ఆరోజు అలా తీసుకొచ్చినప్పటినించీ జ్యోతిలో చిత్రమైన మార్పు ప్రవేశించింది. దానికి సాయం స్నేహితుల వేళాకోళాలు—తల్లీ, దండ్రీ అతని గురించి చెప్పడం జ్యోతిలో చిత్రమైన ఆలోచనలు రేపి కోర్కెలను పెంచసాగాయి.

జ్యోతి తనే స్వయంగా టీ, బిస్కట్లు ట్రేతో పట్టుకొచ్చింది. జ్యోతి అలా తీసుకు రావటం రావుగార్ని ఎంత సంతోష పర్చిందో అంతకి రెట్టింపుగా శేఖరాన్ని ఆశ్చర్యపరిచింది. "ఇదీ ఒక నటనే" అనుకొన్నాడతను.

"అమ్మ లేదామ్మా!" కూతుర్ని అడిగా డాయన।

జ్యోతి ఏదో అనబోయేంతలో సరోజినీదేవికి శేఖరం వచ్చినట్లు ఎలా తెలిసిందో కాని వచ్చింది. శేఖరాన్ని ఆప్యాయంగా పలకరించింది.

తల్లి కూర్చున్న సోఫా వెనగ్గావచ్చి నిలబడింది జ్యోతి, శేఖరాన్ని పరీక్షగా చూస్తూ.

రావుగారూ సరోజినీదేవీ కూడా "కూర్చోమ్మా!" అన్నారు. కాని జ్యోతి కూర్చోలేదు. కూర్చుంటే శేఖరాన్ని అంత పరీక్షగా చూడ్డానికి వీలుండదని ఒకటి తను పూర్తిగా మారిపోయినట్లు గ్రహించాలని ఒకటి ఈ రెండు కారణాలదృష్ట్యా జ్యోతి కూర్చోలేదు.

వాళ్ళు మాట్లాడుకొంటోంటే వింటూ నిలబడింది.

కోటేశ్వరరావు వ్యాపారంలో సాధకబాధకాల గురించి- లాభనష్టాల గురించి తనకి ఆత్మీయులనేవాళ్ళకి చెప్పినంత ఇదిగా చెప్తున్నారు.

ఆయన దగ్గర అదే విశేషం! ఆయనేం చెప్పినా అంతా శ్రద్ధగా వింటారు. అలా వినాలనిపించేలా చెప్పే నేర్పు ఆ భార్యాభర్తల కిద్దరికీ భగవంతుడు వరంలా ప్రసాదించాడేమో!

తను వచ్చిన పని ఈ రోజుకి సశేషమే అనుకొన్నాడు శేఖరం.

రావుగారు చెప్పిందంతా శ్రద్ధగా, వినయంగా విని, ఊకొట్టి ఆ భార్యాభర్తలదగ్గర శలవు తీసుకొని బయటపడ్డాడు శేఖరం.

జ్యోతికేసి కన్నెత్తికూడా చూడకపోవటం జ్యోతితోపాటు రావుగార్కి సరోజినీదేవికికూడా ఏమిటోగా అన్పించింది.

జ్యోతి చిన్నబుచ్చుకొన్నట్లుగా ఇవతలకి వచ్చేసింది. కాని ఇంకా పట్టుదల పెరిగింది. ఎలాగ్గయినా అతన్ని తనవాడుగా చేసుకోవాలి! ఆ!! ఈ బింకం ఎన్నాళ్ళు! డబ్బుకి లొంగని వాడు ఈ ప్రపంచంలో ఒక్కడు లేడు. లోకువయిపోతానని భయమేమో' కాస్త బెట్టు చూపిస్తున్నాడు.

చాలా నిర్లక్ష్యంగా అనుకొంది జ్యోతి.

అదివరకు జ్యోతిచేసిన పెంకెతనానికి కొన్నాళ్ళు ఓరిమి వహించాలని భార్యాభర్తలిద్దరూ అనుకొన్నారు.

శేఖరం ఇంటికొచ్చేసరికి ఎవరో వచ్చివున్నారు. కుసుమ స్నేహితులేమో అనుకొన్నాడు శేఖరం. ఈ మధ్య కుసుమకి స్నేహితులు మరీ ఎక్కువయ్యారు.

కుసుమ పిల్లలులేని చింత మరవడానికి క్షణం తీరికలేకుండా ఎక్కడికో అక్కడికి వెళ్ళటమో-ఎవర్నయినా ఆహ్వానించడమో చేస్తూంటుంది.

అరుణ వెళ్ళిపోతే ఇంచక్క అక్క కూతుర్ని, చెల్లెలు కొడుకుని తెచ్చుకోవచ్చు. అప్పుడు గుమ్మం కదలవలసిన పనేవుండదు. అరుణ ఇక్కడ లేకపోతే శేఖరం అంత రాడు. ఎందుకో తెలియదుగాని శేఖరానికి కొన్ని కొన్ని విషయాలకి భయపడుతుంది కుసుమ. అప్పుడప్పుడు శేఖరం ముందు రాజేంద్ర బుద్ధావతారంలా కనిపిస్తాడు. అలాంటప్పుడు అకారణంగా భర్తని విసుక్కుంటుంది. అలా అని రాజేంద్ర తనకి చెప్పకుండా ఏ చిన్నపనిచేసినా సహించ లేదు. విచిత్రమైన మనస్తత్వం కుసుమది. ఒక్కొక్కసారి తనకేం కావాలో తనే తెలుసుకోలేని పరిస్థితుల్లో కొట్టుకొంటూంటుంది.

శేఖరం లోపలకి వెళ్ళేసరికి కుసుమ నవ్వుతూ ఏదో అంటోంది. కుసుమ పక్కన కూర్చున్న అమ్మాయి వళ్ళంతా కదిలిపోయేలా నవ్వుతోంది.

చేతిలో టిఫిన్ ప్లేటు వుంది.

కుసుమే లావంటే కుసుమకి రెట్టింపులావుంది ఆ అమ్మాయి.

వాళ్ళకి ఎదురు సోఫాలో అరుణ గడ్డంకింద చెయిపెట్టుకుని వాళ్ళకేసి చూస్తూ మౌనంగా కూర్చుంది.

శేఖరం పైకి వెళ్ళబోయాడు.

"ఇదిగో శేఖరం" చాలా ఆప్యాయంగా పిలిచింది కుసుమ.

కొంపతీసి పరిచయం చేయదు కదా అనుకొన్నాడు.

"ఏమిట"న్నట్లు అక్కడే నిలబడి కొద్దిగా మెడతిప్పి చూశాడు.

"ఇలారా! మా పిన్ని రాజమండ్రిలో వుందని చెప్పలేదూ! వాళ్ళమ్మాయి సుందరి" అంది.

అలా శేఖరంతో అంటూనే సుందరిని మోచేత్తో పొడిచింది.

సుందరి టిఫిన్ ప్లేటు పక్కన పెట్టి నమస్కారం చేసింది.

శేఖరం అయిష్టంగానే వచ్చి అరుణ పక్కన కూర్చున్నాడు.

శేఖరం బదులు-సుందరి బదులు కుసుమే మాట్లాడేసింది.

శేఖరం ఎలాగూ అట్టే మాట్లాడడని కుసుమకి తెలుసు. బడబడళ్ళాడుతూ మాట్లాడే సుందరికూడా మాటా పలుకూ లేకుండా బొమ్మలా కూర్చోవటంతో లోలోపల విసుక్కుంటూ పైకి నవ్వుతూ మాట్లాడేసింది.

కుసుమ అవస్త శేఖరం గ్రహించేడు. అసలు కుసుమే పనిగట్టుకుని సుందరిని రప్పించి వుంటుందనుకున్నాడు.

శేఖరం మనసులో సంగతి గ్రహించినదానిలా కుసుమ సుందరి ఎందుకొచ్చిందో చెప్పింది. సుందరి స్నేహితురాలి పెళ్ళిట! అసలు సుందరి అమ్మా నాన్నగారూ కూడా రావలసిందేట. ఆ కుటుంబానికీ ఈ కుటుంబానికీ చాలా స్నేహంట. కాని, సుందరి అమ్మ గార్కి ఒంట్లో బాగుండలేదు. అందుకని తండ్రి కూడా రాలేదు. సుందరి ఒక్కతే వచ్చింది.

అరుణ కేసి చూశాడు శేఖరం.

మాటా పలుకూ లేకుండా బొమ్మలా కూర్చుంది.

ఇంట్లో ఎప్పుడూ ఇలావుండే అరుణ మీరాని చూస్తూనే అలా పరవశించి పోతుందేం! అసలు ఆ అమ్మాయి గురించి చెప్తున్నప్పుడు కూడా అంతే!

అసలు ఆడవాళ్ళు నవ్వకూడదు మాట్లాడకూడదు అని కాదు అతని అభిప్రాయం. దేని కయినా ఒక హద్దంటూ వుండాలనేదే అతని వుద్దేశ్యం.

నిజానికి అరుణ ఎక్కడకీ కదలదని అప్పుడప్పుడు సతాయిస్తూంటాడు.

మీరా ఇక్కడకి రావటంగాని—మీరా వచ్చినప్పుడు అరుణ అలా పరవశించిపోవటం గాని అతను సహించలేకుండా వున్నాడు.

వాగి వాగి అలసిపోయినట్టుగా కూర్చుంది కుసుమ.

శేఖరం అసలు తన మాటలు వింటున్నాడా అన్న అనుమానం వచ్చింది.

కొంచెం కోపంకూడా వచ్చింది.

తనసలు అలా పదినిముషాలు కూర్చున్నందుకే ఆశ్చర్యపోతూ లేచి నిలబడ్డాడు శేఖరం.

శేఖరం పైకి వెళ్లిపోయాడు. అరుణకూడా అన్నగారి వెనకే వెళ్ళిపోయింది.

సుందరి భుజంమీద ఒక్కటేస్తూ, "ఏమిటలా మొద్దులా కూర్చున్నావు. నీకేమని చెప్పేను," అంది కుసుమ.

"బాగుంది! అతనంత సీరియస్‌గా కూర్చుంటే. . అమ్మో! నాకు చచ్చేభయం బాబూ!" అంది కళ్ళు వెడల్పు చేసుకొని, గుండెలమీద చెయివేసుకొంటూ.

"అందుకే నువు మాట్లాడించటం! అతను మామూలుగా మాట్లాడేవాడే అయితే అనుకోవటం ఎందుకూ?"

సుందరి టిఫిన్ ప్లేటు చేతిలోకి తీసుకొంటూ "ఏమేం మాటాడాలో చెప్పెయ్! రేపు మాట్లాడేస్తాను" అంది.

"ఏమిటీ! అన్నీ రేపే మాట్లాడేస్తావా?" అంది కోపాన్ని అణుచుకొంటూ.

"ఊఁ" అంది సుందరి గబగబా తల ఊపుతూ, తల ఎత్తకుండానే.

సుందరిని చాచి లెంపకాయ కొట్టాలన్నంత కోపం వచ్చింది కుసుమకి. కాని, ఎలాగో నిగ్రహించుకొని అంది "అబ్బ! ఏమిటి సుందూ! ఇంకా చిన్నపిల్లవనుకొంటున్నావా?"

కుసుమ చెప్పింది సుందరికి వినిపించిందో లేదోగాని తలెత్తలేదు—సమాధానం చెప్పలేదు.

ఇంక ఇప్పుడు ఆ గోడతో చెప్తే ఎంతో సుందరితో చెప్పినా అంతే అనుకొంది కుసుమ.

సుందరి నిశ్చింతగా టిఫిను తినసాగింది.

* * *

రాత్రి తొమ్మిదిగంటలు దాటినా కుసుమా, సుందరీ కబుర్లు తెమిలేలా లేవు. రాజేంద్ర వచ్చి డైనింగ్ టేబుల్ ముందు కుర్చీలో కూర్చుంటూ కుసుమని పిల్చాడు.

కుసుమకన్నా ముందు తాయారమ్మ నడుంమీద చేత్తో రాసుకుంటూ వచ్చి, "వడ్డించమంటారా బాబూ!" అంది.

"ఏం అలా వున్నావేం? ఒంట్లో బాగుండలేదా?" అని అడిగాడు.

తాయారమ్మ ఏదో చెప్పబోయి కుసుమ రావటంతో ఆగిపోయింది.

కుసుమ "ఏమిటి?" అంది.

"అబ్బే!....ఒంట్లో బా పుండలేదా అన్నాను'' నెమ్మదిగా అన్నాడు రాజేంద్ర.

"ఆవిడకి బాగున్నదెప్పుడు? మీరెందుకు పిల్చారూ అంటున్నాను" విసుగ్గా అంది




కుసుమ. ఇందులో కుసుమకి కోపం రావలసిన విషయం ఏముందో రాజేంద్రకి అర్థంకాలేదు. "తొమ్మిదిన్నర అవుతోంది, ఏమిటి ఆలస్యం" అన్నాడు.

"తొమ్మిదిన్నర పెద్ద పొద్దుపోవటమా!...శేఖరం వస్తాడేమోనని చూస్తున్నాను." చివరి మాట కాస్త శాంతంగానే అంది.

రాజేంద్రతోబాటు తాయారమ్మకూడా కుసుమకేసి ఆశ్చర్యంగా చూసింది. వాళ్లిద్దరిమీదా కుసుమకి చాలా కోపం వచ్చింది. ఏ కళనుందోగాని ఏమీ అనలేదు.

తాయారమ్మ వడ్డిస్తోంది. సుందరి వచ్చి కూర్చుంది.

అసలు కుసుమ ఎప్పుడు భోజనానికి పిలుస్తుందా—ఎప్పుడు తిని హాయిగా పడుకుందామా అని ఇందాకటినుండి ఎదురుచూస్తోంది సుందరి.

కుసుమ కూర్చుంటూ తాయారమ్మతో అరుణని పిల్చుకురమ్మని చెప్పింది.

వాళ్ళ భోజనాలు అవుతోంటే శేఖరం వచ్చేడు.

అతను గుమ్మం బయటే నిలబడి తాయారమ్మని మంచినీళ్లిమ్మని అడిగాడు.

సుందరి గబగబా తింటోంది తలవంచుకొని.

అప్పటికి అరుణ పెరుగు పోసుకొంది.

"కాళ్ళు కడుక్కురా! భోజనం చేద్దువుగాని" అంది కుసుమ.

తను రెండు మూడుసార్లు గుర్తుచేస్తున్నట్లుగా హెచ్చరిస్తేనేగాని తమ్ముడికి అన్నంపెట్టే

ప్రయత్నం చేయని కుసుమ ఈరోజు శేఖరం మీద ఆపేక్ష ఒలక బోస్తోందేమిటా అని ఆశ్చర్య పోయాడు రాజేంద్ర.

ఇదంతా శేఖరానికి అర్ధమయిపోయింది.

కుసుమ ఇంకోసారి చెప్పబోయింది.

ఆవిడకా శ్రమ కలిగించటం ఇష్టంలేని శేఖరం "నా భోజనం అయింది" అన్నాడు.

శేఖరం చూపులు 'నీ నటన అంతా నాకు తెలుసులే!' అన్నట్లు వున్నాయనుకొంది కుసుమ. వెంటనే మొహం తిప్పేసుకొంది.

నిజానికి కుసుమ ఉద్దేశ్యం గ్రహించినా అతనా భావాన్ని చూపుల్లోగాని మాటల్లోగాని వ్యక్తపరచలేదు.

తాయారమ్మ ఇచ్చిన నీళ్ళు తాగి, గ్లాసు కిందపెట్టి అతను వెళ్ళిపోయాడు.

సుందరికి పక్క అరుణ గదిలో వేసింది కుసుమ.

తర్వాత అరుణతో అంది: "ఈ పూటకి నీ గదిలో పడుకుంటుంది. రేపు పక్క గది సర్దిస్తాను" అరుణ సరే అంది.

కుసుమ కిందకి వెళ్ళిపోయింది.

సుందరి ఏదన్నా మాట్లాడుతుందేమోనని—పడుకుంటే బాగుంటుందని కుర్చీలో కూర్చుంది అరుణ. సుందరి మంచంమీద కూర్చుని, "మీరు ఏదన్నా చదువుకొంటారా? చదువుకొంటే చదువుకోండి. నాకు లైటువున్నా ఫర్వాలేదు" అలా అంటూనే ఆవలించి చిటికలు వేస్తూ పక్కమీద ఒరిగిపోయింది. అయిదు నిముషాలకే గుర్రుపెట్టి నిద్ర పోయింది.

"అబ్బ! ఇంత గుర్రేమిటి!" అనుకొంది అరుణ.

'ఇంక ఈ రాత్రికి నిద్రపట్టినట్టే' సుందరికేసి చూసింది. ఈ చెయ్యిటూ ఆ చెయ్యిటూ వేసుకొని గుర్రుపెడ్తూ ఎన్నాళ్ళనుండో నిద్రలేనిదానిలా హాయిగా నిద్రపోతోంది.

అరుణ లేచి పుస్తకం తెచ్చుకొని వచ్చి కూర్చుంది.

అరుణ చదువుకొంటున్నదల్లా ఎవరో పిల్చినట్లయి ఉలికిపడి చూసింది. కాని, ఎవరూ లేరు. తర్వాత అయిదు నిముషాలకి "నాకు చచ్చే భయం బాబూ!" అని వినిపించింది. మళ్ళీ తలెత్తి చూసింది. మళ్ళీ సుందరి అస్పష్టంగా ఏదో అంది. 'పలవరింతలు కూడానా! చచ్చాన్రా బాబూ! నిద్రలో లేచి ఫైటింగు చేయదుగదా?' అరుణ పుస్తకం టేబిల్‌మీదపెట్టి సుందరినే చూస్తూ కూర్చుంది.

ఓ పదినిముషాలు అలాగే చూస్తూ కూర్చుంది. తర్వాత లేచి లైటు తీసేసి వచ్చి మంచం మీద కూర్చోబోతూ సుందరి మంచంకేసి చూసింది.

అంతే! ఒక్కంగలోవెళ్ళి చప్పున లైటు వేసింది. అరుణ కాళ్ళలో చిన్నగా వణుకు ప్రారంభమయింది. ఇప్పుడు తనతో ఫైటింగు చేయడం ఖాయం అనుకొంది. సుందరి లేచి నుంచున్నదల్లా అమాంతం మంచంమీద కూలబడింది. కాస్సేపు అటూ, ఇటూ ఏమిటోలా చూసి, పడుకుంది.

అరుణకి కంటిమీద, నిద్రన్నమాట రాలేదు.

మళ్ళీ పుస్తకం తీసుకునివచ్చి మంచంమీద కూర్చుంది.

ఇక్కడ సుందరి ఏ వేళప్పుడు అమాంతంగా లేచి తనమీద యుద్ధం ప్రారంభిస్తుందోననే భయంతో అరుణకి నిద్రలేదు.

అక్కడ సుందరి పెళ్ళి గొడవ ఎత్తి శేఖరాన్ని ఎలాగయినా ఈ పెళ్ళికి వప్పించమని కుసుమ ఒకటే పోరు. దాంతో రాజేంద్రకి నిద్రలేదు.

"ఈ రోజేగా వచ్చింది! నాలుగు రోజులుపోనీ, చూదాం" అన్నాడు ఆఖరికి. కుసుమ పడుకోబోతూ ,భర్తతో అంది: "సుందరి తన ఫ్రెండు పెళ్ళికి వచ్చిందని చెప్పేను శేఖరానికి. మీరూ అలాగే చెప్పండి."

"అదేం?" ఆశ్చర్యంగా అడిగాడు రాజేంద్ర.

"అబ్బ! అన్నీ అక్షరం, అక్షరం విడమర్చి చెప్పాలి—మీరుమాత్రం నేను రప్పించినట్లు చెప్పకండి" విసుక్కుంది.

రాజేంద్ర ఇంకేం అనలేదు. అటు తిరిగి పడుకొన్నాడు.

సుందరి తల్లి ఉత్తరం రాసింది - మీ మరిది సంగతి ఆ మధ్య చెప్పావు ఏమైయిందీ అంటూ. కుసుమకి మళ్ళీ ఆశ మొలకెత్తింది. వెంటనే సుందరిని పంపమని రాసింది. వాళ్ళు వెంటనే పంపేరు.

* * *

ఉదయం కాఫీల టైముకే శేఖరం డ్రెస్సయి వున్నాడు . కుసుమకి చాలా నిరుత్సాహం కలిగింది. రాత్రి ఎన్నో ఆలోచించుకొంది. తెల్లారి లేస్తూనే సుందరికి ఎన్నో నూరిపోసింది.

శేఖరం చాలా హడావిడిగా కాఫీ తాగుతున్నాడు. ఇంకో క్షణం ఇలాగే ఆలోచిస్తూ కూర్చుంటే అతను మెరుపులా మాయం అవగలడనుకొన్న కుసుమ, "సాయంత్రం నీకు వీలుంటుందా శేఖరం"అని అడిగింది.

అతను పూర్తిగా కుసుమకేసి చూడకుండానే "ఏం? ఏమన్నా పనివుందా?" అన్నాడు.

కుసుమ గొంతుక్కి ఏదో అడ్డు పడ్డట్టయింది.

వెంటనే ఏం మాట్లాడలేకపోయింది.

ఇప్పుడు తనని దెప్పడానికి మంచి సమయం శేఖరానికి అనుకొంది.

అతను మామూలుగానే అడిగినా అది కుసుమకి వికృతార్థంగా అన్పించింది. ఏదేనా అవసరం వుంటేనే అడుగుతావు అన్నట్లుగా అర్థం చేసుకొంది.

శేఖరం కుసుమని ఏమిటని మరోసారి అడగలేదు. లేచి నిలబడ్డాడు. 'హుం! ఇతనితో తనకేమిటి! ఇప్పుడు తనదీ అవసరం' అనుకొని, "సాయంత్రం సుందరికి వూళ్ళో కాస్త చూపిస్తావేమోనని—ఎల్లుండే ఫ్రెండు పెళ్ళి! మళ్ళీ రాజమండ్రీ వెళ్ళిపోతుంది . నువ్వూ, అరుణా, సుందరీ వెడుదురుగాని ... "

కుసుమ మాట పూర్తికాకుండా మధ్యలోనే అన్నాడు శేఖరం "వాళ్ళిద్దరూ వెళ్ళి చూసొస్తారు. అరుణకి తెల్సుగా,"

అరుణ గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి.

సుందరి తన విషయం కాదన్నట్లు తలొంచుకొని కూర్చుంది.

రాజేంద్ర పేపరు ముఖానికి అడ్డంగా పెట్టుకొన్నాడు.

కుసుమ ముఖం నయాపైసంతయింది.

తను చెప్పాల్సింది చెప్పాననుకొన్న శేఖరం వెళ్ళిపోయాడు.

అరుణ అక్కడనుంచి వెళ్ళేవరకూ ఆగి, భర్తమీద గయ్‌మని లేచింది కుసుమ.

"నన్నేం చేయమంటావ్; వాడికేమైనా పనుందేమో!" అన్నాడు.

"అయినా మీరు చెప్పి చూడ్డానికేం? ఆ పేపరుకే పుస్తి కట్టలేకపోయారూ! దాని మీదున్నంత శ్రద్ధ అవగింజంతయినా నా మాటమీదా—నే చేస్తే పనిమీదా లేదు." రుస రుస లాడుతూ అక్కడనించి వెళ్ళిపోయింది. అక్కకి అంత కోపం ఎందుకొచ్చిందో సుందరికి అర్థం కాలేదు.

పొద్దున్ననగా వెళ్ళిన శేఖరం రాత్రి పదింటికొచ్చాడు.

రాత్రి ఏడుగంటలయేవరకూ అరుణ గుండెలు పీచు పీచు మంటూనే ఉన్నాయి. సుందరిని తీసుకొని వదిన ఎక్కడ తీసుకెళ్ళమంటుందోనని.

అన్నగారితో కాస్సేపు మాటాడి పైకి వెళ్ళబోతున్న శేఖరంతో కుసుమ అంది "భోజనం చేద్దువుగాని రా" అని,

"అయింది" అనేసి వెళ్ళిపోయాడు శేఖరం.

రాజేంద్ర తన గదిలోకి వెళ్ళిపోయాడు.

కుసుమకి భర్తమీద చాలా అసహ్యం కలిగింది. దేనికీ కలగజేసుకోడు. తను ఎంతగా శేఖరం మనసు మార్చగలదు.

ఆ రాత్రంతా కొత్త పంథాలో ఆలోచించిన కుసుమ మర్నాడు పొద్దున్న శేఖరంతో అంది; "ఈ రోజు నీ కెలాగయినా తప్పదు శేఖరం! ఎదో నీకు వీలైనంత తిప్పి చూపించాలి."

"సారీ, వదినా! నాకు పనుంది" అని, క్షణం ఆగి అన్నాడు: "నాకు తీరిక లేక కాని—లేకపోతే నాకూ సర్దానే!"

అతనన్న చివరి మాటకి అరుణా, రాజేంద్రా ఆశ్చర్యంగా చూశారు.

కుసుమకి శేఖరం అలా ఎందుకన్నాడో అర్థంకాలేదు. అయినా వూరుకోకుండా అంది "ఆ పనేవో రేపు చూసుకో! ఈ రోజుమాత్రం తీసుకెళ్ళు."

"చెప్పలేను" అన్నాడు పూర్తిగా తలెత్తకుండానే.

సుందరి ఏం మాట్లాడకుండా కూర్చోవటం కుసుమకి చాలా కోపం వచ్చింది. అన్నింటికీ తను ఏడవ్వలసిందే! ఉత్త మొద్దావతారం. విసుక్కొంది మనసులోనే.

సుందరిని ఊదరబెట్టి అర్థగంటలో తయారయేలా చేసింది.

దార్లో శేఖరంతో ఏమేం మాట్లాడాలో ఎలా ప్రవర్తించాలో ఒకటికి రెండుసార్లు చెప్పింది. తర్వాత అరుణ దగ్గరకొచ్చి, "నువ్వుకూడా వెళ్తావా?" అంది.

అరుణ ఇబ్బందిగా పెట్టింది ముఖం.

"నీ ఇష్టం! వెళ్లేమాటయితే తొందరగా తెములు. మళ్ళా ఎవరేనా వచ్చేరంటే మీ అన్నయ్య తుర్రుమంటాడు" అంటూ వెళ్ళిపోయింది.

అరుణ తన గదిలోనే కూర్చుంది. అన్నయ్య సుందరిని తీసుకెళ్తాడనుకుంటోంది వదిన. అన్నయ్య తీసుకెళ్ళకపోతే యుద్ధం జరిగేది ఖాయం!

తొమ్మిది అవుతున్నా శేఖరంకోసం వచ్చినవాళ్ళు వెళ్ళలేదు.

కొత్త బడ్జెట్టొచ్చింది






---

రాజేంద్ర తను వెళ్లిపోవాలని టిఫిను తీసుకొంటూ, అరుణనీ సుందరినీ కూడా తీసుకో మన్నాడు, వాళ్ళు శేఖరంకోసం చూస్తూంటే.

శేఖరం వచ్చేడు.

సుందరి టిఫిను తినటం మానేసి తలొంచుకొని బుద్ధిమంతురాలిగా కూర్చుంది. ఇది ఎవరూ అంత గమనించకపోయినా కుసుమ గ్రహించింది. 'ఉత్త మొద్దు మొహం! ఒక ఉపాయం లేదు, పాడులేదు' విసుక్కుంది.

శేఖరం టిఫిను తినటం పూర్తిచేసి కాఫీ ఇచ్చేలోపలే లేచి నిలబడ్డాడు.

"ఏమిటంత హడావిడి," అంటూ కాఫీ కప్పు అందించింది కుసుమ.

"పదినిముషాల్లో వస్తానని చెప్పాను వాళ్ళకి."

"అయితే—వీళ్ళని తీసుకెళ్ళటం లేదా?"

"ఎవర్నీ!" తలెత్తుతూ అడిగాడు.

కుసుమకి ఒళ్ళు మండింది. "ఎవర్నేమిటీ! సుందరినీ అరుణనీ తీసుకెళ్తానన లేదూ?"

"నేనా!!" కొద్దిగా కనుబొమలెత్తుతూ అడిగాడు.

"లేకపోతే నేనా?"

"ఏమో! అన్నట్టు గుర్తులేదు. ఒకవేళ అన్నానంటే—అది పొరపాటే!"

కప్పు టేబుల్‌మీద పెట్టేసి అన్నగారితో చెప్పి వెళ్ళిపోయాడు శేఖరం.

"హుం! ఎంత పొగరు!' మనసులోనే పళ్ళు నూరుకొంది కుసుమ.

ఏం గొడవ జరుగుతుందోనని అరుణ గుండెలు పీచుపీచుమంటున్నాయి.

రాజేంద్ర భార్య విసరబోయే బాణాల్లాంటి మాటలకి సిద్ధంగా వున్నవాడిలా వినయంగా తలొంచుకొని కూర్చున్నాడు.

ఇదేమీ పట్టని సుందరి మహతీరిగ్గా చంటి పిల్లలు ఐస్‌క్రీమ్ తిన్నంత తీరిగ్గా కాఫీ నెమ్మదిగా చప్పరిస్తున్నట్లుగా తాగుతోంది.

"ఇప్పుడు చెప్పండి అతడు చేసిన పని బాగుందా?" అంది కుసుమ గద్దిస్తున్నట్లుగా రాజేంద్రని.

"ఏమిటి!" అన్నాడు రాజేంద్ర. భార్య చాలా కోపంగా వున్నప్పుడు అతనికి అస్సలు మాటలు రావు.

"ఏమిటా! ఇప్పుడు జరిగింది మీరేం వినలేదా? నిద్రపోతున్నారా?" కస్సుమంది.

"అబ్బ! ఏమిటో చెప్పరాదూ!" అలా అన్నాదేగాని ఈ ఉగ్రరూపాన్ని ఎలా శాంతింపజేయాలా అని ఓ చెంప ఆలోచిస్తూనే వున్నాడు.

"నిజం చెప్పండి! ఇందాక నేను శేఖరాన్ని అడిగిన విషయం—ఇంతక్రితం నేనూ, శేఖరం మాట్లాడుకొన్న విషయాలూ మీరు వినలేదా? చెప్పండి!" రెట్టిస్తున్నట్టుగా అడిగింది.

రాజేంద్ర బలవంతంగా నవ్వు తెచ్చుకొంటూ అన్నాడు "పొరబాటు చేశాడు మీ నాన్న. నిన్ను "లా" చదివించవలసింది."

"ఎక్కడ సంపాయించారీ హాస్యం! మీ జోకులు ఆనక తీరిగ్గా వేద్దురుగాని, కానీ, ముందు నేను అడిగినదానికి జవాబు చెప్పండి."

"ఏం చెప్పను!" బుర్ర గోక్కున్నాడు రాజేంద్ర.

"అరుణా! నువ్వు చెప్పు! ఇందాక మీ చిన్నన్నయ్య తీసుకెళ్తాననలేదూ?"

అదిరిపడింది అరుణ, ఆ గాలి తనవేపు మళ్ళడంతో.

"చెప్పు, అరుణా! ఇందాక అనలేదూ?" రెట్టించింది కుసుమ.

అరుణకి యేం చెప్పాలో తోచలేదు.

అరుణని చూస్తే రాజేంద్రకి జాలేసింది. కాని, ఇప్పుడు తనేమైనా మండిపడ్తుంది కుసుమ. అందుకని ఇలా అన్నాడు "ఏమన్నాడు అరుణా! చెప్పు—ఫర్వాలేదు" అనునయంగా అన్నాడు.

"పనుందన్నాడు...... "

"ఇంకేమీ అనలేదా?" ఉరిమిచూస్తూ అడిగింది కుసుమ.

"తీరిక లేక కాని, సరదానే అన్నాడు" బిక్కు బిక్కుమంటూ చెప్పింది.

"అవున్లే! మీ అన్నయ్యల మాట మాట్లాడక నామాట మాట్లాడుతావా?" అలా అంటూనే సుందరికేసి తిరిగి అంది, "సుందూ! అతను ఇందాక తీసుకెళ్తానన్నట్లు మాట్లాడలేదూ!"

ఏం చెప్తే ఏం ముప్పో అని, సుందరి గబగబా అటూ, ఇటూ గాకుండా బుర్ర వూపింది. ఈ సందట్లో నింపాదిగా అరుణా, రాజేంద్రా అక్కడనుండి జారుకొన్నారు.

"ఏమే, అనలేదూ!" అంది కుసుమ.

అనలేదన్నట్లు తలవూపింది సుందరి ఈసారి ధైర్యంగా.

"అసలు నిన్ననాలి. నీకేమని చెప్పాను? అతను వచ్చినప్పుడు ఏదోవిధంగా కలగ చేసుకొని మాట్లాడుతున్నానా? అసలు నువ్వొచ్చాకా అతన్తో ఒక్కమాట మాట్లాడావా!" నీర్సంగా కుర్చీలో కూలబడింది.

"ఏం మాట్లాడనక్కా!" బుంగమూతి పెట్టి చంటిపిల్లలా అడిగింది.

"ఎన్ని చెప్పానే నీకు! ఇందాక ఏంచేశావ్?"

"ఏం చేశాను?"

"టిఫిన్ తింటున్నదానివి హఠాత్తుగా ఎందుకు మానేశావ్?"

"నువ్వేగా చెప్పావ్! తింటూండగా వస్తే మానేయాలని."

"ఖర్మ!" నెత్తి మొత్తుకొంది కుసుమ. "మానేసి బొమ్మలా కూర్చోమన్నానా? ఏదోఒకటి మాట్లాడొద్దూ!"

"ఏం మాట్లాడను!"

"ఏదో ఒకటి! సమయ సందర్భాలనుబట్టి మాట్లాడాలి. ఇంత ఆలస్యం చేశారేమనో—ఇంతవరకూ మీకోసం చూశామనో. . "

"ఎవరో వచ్చేరూ మీరు తీసుకోండి అన్నాడు బావ" అమాయకంగా మధ్యలోనే అంది సుందరి.

ఇంక నిగ్రహించుకోలేకపోయింది కుసుమ. కస్సుమని లేచింది.

"ఇంకేమనలేదూ! కనీసం ఆ రాజమండ్రిలో కూడా వుండకుండా "బామ్మ బామ్మం"టూ ఆ పల్లెటూర్లో వుంటావు, ఇంతకన్న తెలివితేటలు ఎక్కడనించి వస్తాయి. నేను నీకు చెప్పలేను బాబూ! రేపే బండెక్కిస్తాను నిన్ను. ఇంకా నేనేదో సహాయం చేస్తున్నాననుకొంటుంది మీ అమ్మ. పని జరగనప్పుడు ఎందుకూ!"

"ఈసారి నువు చెప్పినట్టు చేస్తానక్కా!" వినయంగా అంది.

"నేను చెప్పినట్టే చేస్తావా? . "

ఇంకా కుసుమ మాట పూర్తికాకుండానే చేస్తానన్నట్లు బుర్ర వూపింది.

"బంగారు తల్లే! ..."

కుసుమ మెచ్చుకొంటోందనుకొన్న సుందరి నవ్వబోయి, అంతలోనే కుసుమ కళ్ళలో కనిపించిన కఠినత్వం చూసి, ఆగిపోయింది.

ఆ రోజంతా చాలా కోపంగావుంది కుసుమ.

రాత్రి శేఖరం వచ్చేసరికి అందరూ హాల్లోనే కూర్చున్నారు. కాని, అంతా నిశ్శబ్దంగా వుంది. ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకొంటున్నట్లు లేదు.

శేఖరం వస్తూనే తల్లి దగ్గరనుండి ఉత్తరం వచ్చిందని చెప్పాడు రాజేంద్రకి. "ఏమని రాసింది! ఎప్పుడొస్తుందట" అని అడిగాడు రాజేంద్ర.

"ఎప్పుడొచ్చేదీ రాయలేదు—డబ్బు పంపమని రాసింది. ఈరోజే పంపాను."

'గొప్పపని చేశావ్' తన డబ్బు పోయినట్లే విసుక్కొంది కుసుమ.

"గోపాలరావుగార్ని కలిశావా?" అని అడిగాడు రాజేంద్ర.

అన్నదమ్ములు గోపాలరావుగారి గురించి మాట్లాడుకోసాగారు.

కుసుమ ఓ అర్ధగంట ఓపిక పట్టింది. అన్నదమ్ముల కబుర్లు తెమిలేలా కనిపించలేదు. "ఇంక భోజనాలకి లేస్తారా?" అంది.

"ఆఁ, ఇదిగో! వస్తున్నాం. పెట్టేయమను" అని తనులేస్తూ, "రారా!" అన్నాడు తమ్ముడితో.

రాజేంద్ర అలా "రారా!" అన్నప్పుడు శేఖరానికి భోజనం అయిందని చెప్పడానికి చాలా ఇబ్బందిగా మొహమాటంగా అన్పిస్తుంది.

శేఖరం బైట హోటల్లో తింటున్నాడని రాజేంద్రకి తెలుసు. "అదేమిట్రా" అని తమ్ముణ్ణి గట్టిగా మందలించలేడతను. తను మందలించినా లాభం లేదని తెలుసతనికి. కుసుమ అభిమానంగా పెట్టదు. అసలా విషయమే పట్టించుకోదు. అభిమానస్తుడు శేఖరం ఏ చిన్న అవమానాన్నీ సహించడని తెలుసు! బైట హోటల్లో తిన్నా ఇంటికొస్తున్నాడంటే అది తనమీది అభిమానం-కుటుంబ గౌరవం కోసమేనని అతనికి తెలుసు! కొన్ని కొన్ని విషయాలు తెలిసినా తెలియనట్లే అతను మసులుకొంటాడు.

పొద్దుట్నుంచీ కోపంగావున్న కుసుమ విసుగ్గా అంది "పనిమనిషి అదృష్టవంతురాలు. పూటకి గిన్నెడన్నం పట్టుకెళ్తోంది."

వెళ్ళబోతున్న శేఖరం ఆగి వెనక్కి చూశాడు.

తమ్ముడేదో విసురుగా అంటాడని. ..అదేం గొడవ అవుతుందోనని ఖంగారుపడ్డ రాజేంద్ర ఎవరికేసీ చూచే ధైర్యం లేనివాడిలా నిలబడిపోయాడు.

అన్నగారి అంతర్యం గ్రహించినవాడిలా శేఖరం, "నాకోసం వంటచేయద్దు—తిన్నపూట చెప్తాను. అనవసరంగా వేస్టు చేసుకోనక్కరలేదుగా" అనేసి వెళ్ళిపోయాడు.

కుసుమ విసురుగా వెళ్ళిపోయింది.

రాజేంద్ర మౌనంగా అనుసరించాడు.

నాలుగురోజులు గడిచిపోయాయి. ఈ నాలుగురోజులూ కుసుమ కోపం తగ్గలేదు. సుందరితో కూడా సరిగ్గా మాట్లాడలేదు. సుందరి "నేను వెళ్ళిపోతానక్కా" అంది. కుసుమ వెంటనే "సరే" అంది. కానీ, ఆరోజే కుసుమ తల్లి దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. "బాబాయ్ ఈ రోజో రేపో బయలుదేరి అక్కడకి వస్తున్నాడు- కుతురిని శేఖరానికి చేసుకోమని అడగడానికి. రాజమండ్రినుండి ఆనందం పిన్ని వుత్తరం రాసింది సుందరి పెళ్ళి విషయం కాస్త చూడమని. మీకూ రాస్తానంది. రాసిందా? సుందరి విషయం నువ్వు కాస్త శ్రద్ధగా వ్యవహరించాలి. మీ పెద్ద బాబాయ్ అసలే చమత్కారి. మాటల్లో ఇట్టే ఎదటివాళ్ళని బుట్టలో వేసేస్తాడు—ఈ వుపకారం పిన్నికిచేస్తే సంతోషిస్తుంది. సుందరికి ఏమీ తెలియదని పిన్ని బాగా బెంగపెట్టుకుంది. ఎలాగయినా ఈ పెళ్ళి జరిగేలా చూడు " ఇలాగే ఉత్తరం నిండా చాలా విషయాలు రాసిందావిడ. మేనరికం కాకుండా శేఖరానికి సుందరిని కట్టబెట్టాలని వాళ్ళకి చాలా కాలంనించి వుంది.

ఇంక సుందరిని రాజమండ్రి పంపడం విరమించుకొంది కుసుమ.

(సశేషం)

# శనిగాడు అను ఆషాఢభూతి కథ

"నందగోకుల బృందావన మురళీమోహన రాధావేణుగోపాల బాలకృష్ణమూర్తికి శని విరగడయింది" అని కృష్ణమూర్తి తాలూకు మిత్రులంతా ఏకకంఠంతో గావుకేక పెట్టారు. అతనీ కొత్తయింట్లో ప్రవేశించి నివసించిన అర్ధ శతదినోత్సవ సందర్భంగా అతనితో ఇప్పించుకున్న టీపార్టీ ముగించి.

"ఇత్తకు బిచ్చిల ఆలదవ్‌తో శతదినోత్సవవ్ చేసుకోవాల ఆశిస్తుల్లా" అన్నాడొక సుబ్బరామయ్య కొంచెం ముక్కుపొడుం పీల్చి. ప్రక్కనున్న ఎస్. కె. పి. వామన్రావుకి కోపం వచ్చి, "చీ నోర్ముయ్! వెధవ శతదినోత్సవం! 25 వారాలని కోరుకోరా" అంటూ అతని వీపు వగలగొట్టేశాడు.

వెంటనే వామన్రావు తాలూకు డొక్క చీరేస్తూ "50 వారాలని అనరా" అంటూ శాసించాడు అంకిరెడ్డి.

"60 వారాలని అంటావా లేదా?"అని అంకిరెడ్డి తోలొలిచేశాడు మావుళ్ళయ్య.

గంగివెర్రులెత్తిపోయిన భావన్నారాయణ వీళ్ళందరి తలలు బద్దలుకొట్టాలనుకున్నాడు గానీ, వాళ్ళలో ఒక్కడికీ తలకాయ ఉన్నజాడ కనబడక, ఆ ప్రయత్నం విరమించి, గట్టిగా ఓ చుట్ట దమ్ములాగి, గొంతు జీరపోకుండా సద్దుకుని, "ఈ వెధవ పీనుగుల కూతలకేంలే కృష్ణమూర్తీ! నువ్వీ యింట్లో పరమానందంతో, స్వర్గసుఖాలనుభవిస్తూ, శాశ్వతంగా..." అంటుండగానే ఒకచెయ్యి వచ్చి అతని పీక నులిమెయ్యసాగింది మరి మాట రానీకుండా.

అందరూ గుడ్లప్పగించి చూశారు.

ఆ చెయ్యి ఆ యింటి ఖామందుగారిది!

"ఉండడానికి వీల్లేదు అని పూర్తిచేస్తావా లేదా" అంటూ ఇంకా గట్టిగా నులిమేస్తున్నాడు ఖామందు.

'అలాగే అంటాను' అనే భావంతో అతని కళ్ళు సజ్ఞచేసిన తర్వాత ఆ చెయ్యి పట్టు వదిలింది.

భావన్నారాయణకు మాటలొచ్చాయి మళ్ళీ! ఖామందుతో చేసుకున్న ఒప్పందం ప్రకారం అదే మాటనేశాడు.

ఖామందుగారు శాంతించి, "నా కిబ్బంది లేనంతకాలం సుఖసంతోషాలకు లోటులేకుండా ఉండు కృష్ణమూర్తీ" అంటూ ఆశీర్వదించారు.

కృష్ణమూర్తి కృతజ్ఞుడై, వట్టి 'థాంక్స్' అనే మాటలతో సరిపెట్టడానికి మనసొప్పక, "మీరుకోరిన తక్షణం మీకుగాని, మీ వల్ల అర్హతపొందిన మరొకరికిగానీ ఇల్లు ఖాళీచేసి ఇవ్వగలవాడను. ఇది నా సమ్మతిని వాగేసి

పెండ్యాల నాగంజనేయులు

ఇచ్చిన ప్రామిసరీ నోటిమాట. ఇట్లు కృష్ణమూర్తి" అన్నాడు హుషారుగా.

మిత్రబృందం చప్పట్లదర గొట్టేసింది.

ఖామందు వారితోబాటు తనచేతులు కలిపాడు.

"కూర్చోండి బాబూ! టిఫిన్ చేద్దురుగాని" అన్నాడు కృష్ణమూర్తి.

"నా వల్ల కాదు నాయనా" అన్నాడు ఖామందు.

"ఒక్కటంటే ఒక్క-స్వీటు" ప్రాధేయపడ్డాడు కృష్ణమూర్తి.

"అమ్మమ్మ! షుగర్ కంప్లెయింట్."

"కాస్త కారబ్బూంది?"

"బాబోయ్! గ్యాస్టిక్ ట్రబులు."

"కాస్త పంచదారలేని టీ?"

"వద్దునాయనా పైత్యం! మీ కళ్ళముందే డోక్కుంటాను."

"పోనీ మీకు జబ్బుచేయని వస్తువేదో చెప్పండి. నిముషంలో రెడీ చేయిస్తాను" అంటూ చిటికేశాడు కృష్ణమూర్తి.

"నాకు జబ్బుచెయ్యని వస్తువు డబ్బు నాయనా! ఎంతయినా హరించుకోగలను. ఇవాళ ఒకటో తారీకుగదా? నా అద్దె నాకు తినిపించేస్తే హాయిగా త్రేన్చుకుంటూ వెళ్తాను" అన్నాడు ఖామందు చిర్నవ్వుతో.

ముసలాడి సెన్స్ ఆఫ్ హ్యూమర్ని కృష్ణమూర్తితోబాటు మిత్రులంతా మెచ్చుకున్నారు.

కృష్ణమూర్తి వెంటనే అద్దె చెల్లించాడు.

"సుఖీభవ" అని ఆశీర్వదిస్తూ "అబ్బాయిలూ! చూడండి! ఇది మీతోబాటు నాకూ సంతోష సమయమే! కాబట్టి మీరంతా "కలసిరాని కాలం" సినిమా చూడాలనుకుంటే, మన హాల్లోనే ఆడ్తోంది కాబాట్టి, ఉచితంగా చూసే ఏర్పాటు చేస్తాను" అన్నాడు ఖామందు.

"జై ఖామందురికీ జై! ఖామందుగారూ జిందాబాద్" అంటూ ఓంద్రపెట్టేరంతా.

"సరే! నేను మేనేజరికి ఫోనుచేస్తాను. బయల్దేరండి" అన్నాడు ఖామందు.

కృష్ణమూర్తి భార్యను తలుపు మూసుకుని జాగ్రత్తగా వుండమని చెప్పి స్నేహితులతో సినిమాకి బయలదేరాడు.

ఇంటిగుమ్మం దిగగానే అతని పోర్షనువైపు వున్న కాంపౌండ్ వాలుమీద ఓ కాకివాలి గోల మొదలెట్టింది.

"ఇదేమిటే నీయమ్మ కడుపుమాడ. చుట్టాలెవరయినా ముట్టడించబోతున్నారా?" అనడిగాడు కృష్ణమూర్తి.

కాకిగోల మానలేదు.

"మా అత్తగారా?" గుండెలు దడదడ కొట్టుకుంటుండగా అడిగాడు.

"కాకా" అంటుందేగాని ఎగిరి గంతెయ్యలేదు కాకి.

కృష్ణమూర్తికి దడ తగ్గిపోయింది. ధైర్యం వచ్చేసింది. జ్ఞాపకమున్నంతవరకూ ప్రతిచుట్టం పేరుపెట్టి అడిగాడు.

కాకి ప్రవర్తనలో మార్పేమీ లేదు.

కృష్ణమూర్తికేమీ తోచక, కాకి శనిగాడి వాహనం గదా! ఒకవేళ వాడేమైనా వస్తున్నాడేమోనని అనుమానం కలిగి ఆ మాటే నిలదీసి అడిగాడు.

ఎగిరి గంతేసింది కాకి—కాని ఎగిరిపోలేదు; కాకా మానలేదు.

అంతా నవ్వుకో సాగారు.

ఖామందుగారికి కాకి ప్రవర్తనకు కోపంవచ్చి "ఇంకా ఎవడొస్తున్నాడే నీ మొగుడు ఆషాఢభూతిగాడు?" అనడిగాడు.

ఈసారి కాకి ఎగిరి గంతేసి మరీ యెగిరిపోయింది.

"నీ యింటికో శనిగాడూ, నా యింటికో ఆషాఢభూతీ వస్తారటయ్యా కృష్ణమూర్తీ! ఎందుకయినా మంచిది ఓ పోలీసు రిపోర్టు యిద్దామా?" అంటూ జోకేశాడు ఖామందు.

"మీరావని చెయ్యండి. నేను మాత్రం తైలాభిషేకంచేస్తాను" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏడ్చినట్టున్నాయి మన జోకులు. సర్లే పదండి! సినిమాకి టైమవుతోంది" అంటూ తరిమేశాడు ఖామందు.

* * *

సుమారు ఆరు నెల్లక్రితం కృష్ణమూర్తి హైద్రాబాద్‌నుంచి మద్రాసు ట్రాన్స్ఫరయి

## కొత్త బడ్జెట్టొచ్చింది




వచ్చాడు ఉద్యోగరీత్యా.

వచ్చేజీతం మొత్తంగా 350 రూపాయలే కావడంవల్ల అద్దె చవగ్గదా అని పాతమాంబళం లోనే నివసించిచడం మొదలుపెట్టేడు. ఇప్పటికి నాలుగిళ్ళు మారి అయిదో ఇల్లన్నమాట!

అదేం ఖర్మమో ఏ ఇంట్లో ప్రవేశించినా ప్రాణానికి సుఖం లేకపోయింది. ఎక్కడా నెలా పదిహేను రోజులకన్నా ఎక్కువ వుండే లేకపోయాడు.

మొదటి ఇల్లు : అన్ని సౌకర్యాలూ బావుం డేవిగాని మిద్దెమీద ఉండేవాళ్ళు ప్రాణభయం తెచ్చిపెట్టేరు. వీళ్ళ నెత్తిమీదెక్కి పిండో, కారమో, సాంబారుపొడో కొట్టేస్తుండేవారు రాత్రి పది గంటల్నుంచీ! కింద వీళ్ళ పడగది. పైన వాళ్ళ రోలూ రోకలీ! సుఖంగా గుర్రుపెట్టే చాన్సు లేకపోగా కప్పుపగిలి మీదకూలి చస్తామేమోనని భయం పట్టుకుంది. ఈ విషయాన్ని ఇంటావిడకు ఎంతో నమ్రతగా విన్నవించుకున్నాడు.

"దానికి నన్నేం చేయమంటావు నాయనా! నువ్వూ నీ భార్యాకూడా రెండు పోర్షనులూ చూసుకున్నారుగదా! పై పోర్షనయితే వీళ్ళు చేదేసుకోడం కష్టమని నువ్వేగా కింద పోర్షన్ తీసుకొన్నావు. నీ తర్వాత వచ్చినవాళ్లేగదా పైవాళ్ళు. వాళ్ళు నీళ్ళబాధ భరిస్తున్నారు. నువ్వు రోలూ రోకలీబాధ భరించు" అంటూ తీర్పిచ్చిందావిడ. కిక్కురుమనకుండా వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

రెండ్రోజులు తిరక్కుండానే ఇల్లు ఖాళీ చేసేశాడు.

రెండో ఇల్లు : ఆరు సంసారాలుగల చిన్న సత్రంలాటి ఇల్లు. ఉద్యోగంలేని సినిమా అసిస్టెంటు డైరెక్టరూ, పంటలుచేసుకు బతికేవాడూ, బట్టలకొట్టు గుమాస్తా, శివావిష్ణు కోవెలముందు జంధ్యాలమ్ముకొనే బ్రాహ్మడూ, చెట్టుకింద జోస్యంచెప్పేవాడూ కాపురం వుండేవాళ్ళు తలవాకిట గదిలోనూ! ఒక్క కృష్ణమూర్తి పోర్షనే పెద్దది. దానికి రెండుగదులున్నాయి.

ఉదయం లేవగానే కృష్ణమూర్తి భార్య తలుపు తెరిస్తే ఎదురుగా కనబడేది ఒక క్యూ- ఆడవాళ్ళది! అనగా పైన చెప్పబడిన మొగ పురుషుల భార్యలది! ఒకరిచేతిలో గిన్నె, ఒకరి

చేతిలో గరిట, ఒకరిచేతిలో స్టోల—ఇలా తల చౌక ఆయుధం. కాఫీపొడుము, పంచదార, బియ్యం, నూనె, మిరపకాయలు వాళ్ళక్కావలసిన వస్తువులు-అప్పుగానే.

తీరా ఇస్తే "ఈ జన్మలో మీ ఋణం తీర్చుకోలేమండీ" అనిమనస్ఫూర్తిగా కృతజ్ఞత వెలిబుచ్చేవారు. అదే మాటమీద నిలబడేవారు కూడా!



మరీ దానకర్ణుడనిపించుకోవడం కష్టమని ఎంచి ఆ యిల్లూ ఖాళీ చేశాడు నెల తిరక్కుండానే.

మూడో యింట్లో పట్టుకోడానికి వీల్లేని లంగా బాడీల దొంగలు. నాలుగో ఇంట్లో-కృష్ణమూర్తిని ఇంటివారి కుక్క కరిచింది. ఆ విషయంలో వీళ్ళకి వాళ్ళకి ఘోర యుద్ధమైన సందర్భంలో కృష్ణమూర్తి భార్య ఇంటావిడ ముక్కు కొరికేసింది. తత్ఫలితంగా 24 గంటల్లో ఆ యిల్లు ఖాళీ చేశాడు.

* * *

కృష్ణమూర్తి సినిమా నుంచి ఇంటికి తిరిగొచ్చేసరికి రాత్రి పదిగంటలైంది. ముందు గదిలో ఒక 22 ఏళ్ళ అయిదున్నర అడుగుల మొగశాల్తీ ఒకటి చాపమీద పడుకుని గట్టిగా గుర్రు పెడ్తోంది.

ఖూనీలు చేసేవాడిలాగా మాసిపోయిన గళ్ళలుంగీ, గారడీ సాయిబు మీసంలాంటి మీసం, దుమ్ము కొట్టుకుపోయిన తల, చామన చాయగా వున్నాడు. చటుక్కున ఇందాకటి కాకి జ్ఞాపకం వచ్చింది.

"ఎవరబ్బా వీడు?" అనుకుంటూ వంట యింట్లో ప్రవేశించాడు. భార్య కమల చారులో తిరగమూత పెడుతోంది.

"ఎవరోయ్ ఆ శాల్తీ? మీ బ్రదరా?" అనడిగాడు.

"అతను చెప్పిన మాటలు నిజమైతే అలాటివాడే!" అంది కమల.

"ఏ వూరు?"

"బందరట."

"ఏ పేట?"

"కొజ్జిల్లి పేటట."

"కొజ్జిల్లిపేటా?"

"మరే! గుణుపూడి పిచ్చమ్మగారి కొడుకటగా!"

"శ్ . ఓ హో హో హో! అదా విషయం? పిచ్చమ్మగారంటే మా మేనమామ భార్యకి అక్కగారులే! ఎప్పుడయినా నేను వాళ్ళ వూరు వెళ్తే చాలా ప్రేమగా చూసేది. భలే మంచిది. 'మాంచి' అంటే ఇంతా అంతా 'మాంచి' కాదు. ఆవిడ హిస్టరీ చెప్పనా? పాపం.. తెల్లగా వుంటుంది. ముద్దపప్పు భలేగా వండుతుందిలే. పొట్టిగా వుంటుంది. అయితే ఏం? సినిమా పాటలదర కొట్టేస్తుంది. జుట్టు? చీలమండల దాకా వుంటుంది. యమస్పీడుగా నడుస్తుంది. చక్రాల్లాటి కళ్లు-శనివారం శనివారం భజన చేస్తుంది.

కమల గుడ్లప్పగించి చూస్తోంది యీ తలాతోకా లేని వాగుడేమిటా? అని!

అది కనిపెట్టాడు కృష్ణమూర్తి.

"అలా చూస్తావేమిటోయ్? నే చెప్పే

దబద్దమనా? ఇంకా చెప్తా చూడు..." అంటుండగానే—

"నమస్కారం శ్రీశ్రీశ్రీ బావగారూ" అంటూ వచ్చి సాష్టాంగపడిందా కొత్తశాస్త్రీ!

కప్పని తొక్కినట్టదిరి పడ్డాడు కృష్ణమూర్తి. అంతలోనే తమాయించుకుని, "భలే వాడివి! లేవయ్యా!" అంటూ లేవదీసి, "ఇదిగో! ఇలాటి నమస్కారాలూ గిమస్కారాలూ మనకినచ్చవ్. ఇప్పుడేచెప్తున్నా! మళ్ళీ నమస్కారంపెట్టావా? పెద్దవాణ్ణి నేనూ నీకు నమస్కారం పెట్టేస్తా! దెబ్బతో నీకాయుక్షీణం కలుగుతుంది జాగ్రత్త" అంటూ హెచ్చరించాడు.



నోట మాటరాక అలాగే చూస్తూండిపోయాడా శాస్త్రీ.

"కూర్చో" అన్నాడు కృష్ణమూర్తి.

కూర్చుంది శాస్త్రీ.

"చూడు! నీ హిస్టరీ, జాగ్రఫీ అంతా నాకు తెలిసిపోయింది. ఇక్కడంతా క్షేమం. అక్కడంతా క్షేమమేనా?" అన్నాడు కృష్ణమూర్తి.

"ఆఁ! క్షేమమేనండి." అందా శాస్త్రీ.

"మీ నాన్నగారేం చేస్తున్నారు?"

"ఆయన పోయారండి" దిగులుగాచెప్పాడు శాస్త్రీ.

"మరంతా కులాసేనంటావేమయ్యా మైల కబురు చెప్పి?"

"ఆయనపోయి నాలుగేళ్ళయిందండి."

"ఓహోహో! అయితే మైల వెళ్ళిపోయిందన్నమాట! హార్దికందొలెన్సెస్."

"థాంక్స్."

"ఇంతకీ నీ పేరు?"

"గుర్నాథం."

"వృత్తి?"

"ఇంకా ఏం లేదండి! దానికోసమే ఇంటర్వ్యూకి ఇక్కడికొచ్చాను. రేపే ఇంటర్వ్యూ! హోటల్లో ఉగే శక్తిలేక...." అంటూ చేతులు నలుపుకున్నాడు గుర్నాథం.

"భలేవాడవయ్యా! ఈ కాస్త భాగ్యం కోసం మళ్ళీ హోటళ్ళూ సత్రాలూ ఎందుకు? ఇక్కడే వుండు. ఇక్కడే భోంచెయ్యి."

"హిహిహి.. ఫర్వాలేదండి. భోజనం హోటల్లో చేస్తాలెండి!"

"మొహమాట పడ్తావేమయ్యా? నాన్సెన్స్. అలాటివేవీ పెట్టుకోకు. ఇది నీ సొంత యిల్లుగా భావించుకో. తెల్సిందా?"

"అ లా . గే....నం . డ... "

"కమలా! నీ బ్రదరు! జాగ్రత్తగా చూస్కో! ఏ లోటూ రాగూడదు! వడ్డించెయ్ ఇద్దరికీ" అంటూ ఆర్డరేశాడు కృష్ణమూర్తి.

ఇద్దరూ భోంచేశారు.

కృష్ణమూర్తి సిగరెట్ కొల్చబోతూ "సిగరెట్ కాలుస్తావుటయ్యా?" అనడిగాడు గుర్నాధాన్ని.

"అబ్బె వద్దండి" అంటూ సిగ్గుపడ్డాడు గుర్నాధం.

కృష్ణమూర్తి కర్థమైంది. కాలుస్తాడుగానీ భయమో, సిగ్గో, మొహమోటమో పడుతున్నాడని.

"అబ్బాయ్! సిగరెట్ కాల్చడం పెద్ద నేరమేం కాదు. నిన్నెవరూ జెయిల్లో పెట్టరు. కాల్చు" అంటూ ఒక సిగరెట్ అందించాడు.

గుర్నాధం మూడు గుక్కల్లో ఊది పారేశాడు.

తర్వాత ఆ కబుర్లూ ఈ కబుర్లూ మాట్లాడుకుని పడుకోడానికి నిశ్చయించుకున్నారు. గుర్నాధానికి ముందు గదిలో పడక ఏర్పాటు చేసింది కమల. దాని తర్వాత గదిలో కృష్ణమూర్తి, కమల టేబుల్ ఫాన్ పెట్టుకు పడుకున్నారు.

మద్రాసు మహానగరంలో పాతమాంబళానికి ప్రత్యేకమైన స్థానం వుంది. ప్రశస్తమైన దోమలిక్కడ విరివిగా ఉత్పత్తి యగును. దోమతెరలుగానీ, ఫాన్లుగానీ లేకుండా నిద్రపోవడం చాలా కష్టం.

రెండూ లేని కారణాన గుర్నాధానికదే కష్టమొచ్చి పడింది. దీనికి తోడు బాత్‌రూం కెళ్ళవలసి వచ్చింది. గబగబా వెళ్ళి కృష్ణమూర్తి రూం తలుపు తట్టాడు.

చేయబోయే 'మన్మధ వ్రతానికి' 'విఘ్నేశ్వర పూజ' చేసుకుంటున్న ఆ దంపతులదిరిపడి లేచారు.

"ఇదేం ఖర్మరా దేవుడా!" అని మనసులో అనుకుంటూనే తలుపు తీశాడు కృష్ణమూర్తి.

"బావగారూ! దోమలు నన్ను తినేస్తున్నాయండీ! నిద్ర పట్టడంలేదు. ఒక్క సిగరెట్ ఇస్తారా?" అనడిగాడు.

ఇచ్చాడు కృష్ణమూర్తి మౌనంగా.

అది వెలిగించుకుని బాత్‌రూమ్ కెళ్ళాడు గుర్నాధం.

దంపతులు ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటూ నవ్వాలేని ఏడ్వాలేని పరిస్థితిలో పడ్డారు.

గుర్నాధం తిరిగొచ్చి, ఇద్దరి మధ్యా తిష్ఠవేసి, "దోమలు-వానివలన బాధలు" అనే అంశం మీద ఉపన్యాసం మొదలెట్టేడు-మధ్య మధ్య కృష్ణమూర్తి దగ్గర సిగరెట్ లాక్కుంటూ.

చివర్లో దోమలబాధా నివారణోపాయాలు కొన్ని ఏకరువు పెట్టాడు. వాటిల్లో వంటికి కిరసనాయిలు రాసుకు పడుకోడం అనే ఉపాయం కూడా వుంది.

దోమల బాధకన్నా గుర్నాధం బాధెక్కువయింది దంపతులకి.

"పోనీ కాస్త కిరసనాయిలు రాచుకు పడుకుంటావేమిటి?" అనడిగాడు కృష్ణమూర్తి.

"అబ్బెబ్బే! అది నా వంటికి ఎలర్జీ అండీ! తెల్లారేసరికి ఒళ్ళంతా దద్దుర్లొచ్చేస్తాయి. మళ్ళీ డాక్టర్ల ఖర్చు, మందుల ఖర్చు! నాకు టేబిల్ ఫానిచ్చేసి, మీరు కిరసనాయిలు వాడుకోండి" అంటూ ఫాన్ పట్టుకుపోయి హాయిగా పెట్టుకు పడుకున్నాడు గుర్నాధం.

దంపతులు కిరసనాయిలు రాచుకుని ఆ వాసన భరించలేక రెండుసార్లు దొక్కుని, నిద్రపట్టక ఎల్లాగో తెల్లవార్చారు. ముందు స్నానం చేస్తేగాని కాలకృత్యాలు కూడా తీర్చుకోలేకపోయారు పాపం!

ఉదయం కాఫీ తాగాక కాస్త పచారి దుకాణానికి వెళ్ళి రమ్మంది కమల-కృష్ణమూర్తితో.




"నేనూ వస్తాను బావగారూ!" అంటూ వెంటబడ్డాడు గుర్నాధం.

సరుకులు తీసుకుని, ఖాతాలో రాసుకోమని చెప్పి, బయల్దేరబోతూండగా "ఒక్క వక్క పొడి పొట్లం ఇయ్యి బాబూ!" అన్నాడు గుర్నాధం కొట్టువాడితో.

వాడిచ్చాడు.

గుర్నాధం డబ్బివ్వాలని జేబులో చెయ్యి పెట్టేడు.

"ఛ ఛ! నువ్వెందుకయ్యా ఇవ్వడం? ఖాతాలో రాసుకుంటాళ్లే! ఇంకేమైనా కావాలంటే తీసుకో" అన్నాడు దర్జాగా.

అంతే—ఒక హెయిరాయిల్ సీసా, దువ్వెన, రేజర్ సెట్టు, బ్లేళ్ళకట్ట, పౌడరు డబ్బా, రెండు సిగరెట్ పెట్టెలు తీసేసుకున్నాడు గుర్నాధం.

కృష్ణమూర్తికి గూబదిరిపోయింది. కాని చేసేదేముంది? మర్యాద, ఆత్మగౌరవం ముఖ్యం గదా.

*　　　*　　　*

గుర్నాధం ఇంటర్వ్యూకి వెళ్ళే టైమైంది.

"బావగారూ! ఒక్క జత లాగూ చొక్కాలుంటే యిస్తారా? ఇంటర్వ్యూ నుంచి వచ్చి మళ్ళీ ఇచ్చేస్తాను" అన్నాడు గుర్నాధం.

కృష్ణమూర్తి "అలాగే" అంటూ అలమరా తెరిచాడు దిగులుగా. గుర్నాధం తనక్కావలసిన మేలైన గుడ్డలు తనే ఎంచుకున్నాడు. పైపెచ్చు కృష్ణమూర్తి కొత్త బూట్లు కూడా తొడుక్కెళ్ళాడు. కృష్ణమూర్తి నగ్న కాలుతో ఆఫీసు కెళ్ళాలి సొచ్చింది.

కమల అతన్ని చూసి నవ్వుకుంది.

గుర్నాధం ఇంటర్వ్యూ అయ్యేసరికి సాయంత్రం 4 గంటలైంది. తిరిగి వస్తూ దారిలో పార్కుకెళ్ళాడు. అయిదారు గంటల్నుంచీ కాళ్లు బూట్లలోనే కాపురం చెయ్యడం వల్ల వేడెక్కిపోయాయి. గబ గబా బూట్లు విడిచి, కాళ్ళకు చల్లగాలి తగులుతుంటే "అమ్మయ్య" అనుకున్నాడు. ఇంతలో అతని కంటికి నీటి కుండీ ఒకటి కన్పించింది. వెంటనే బూట్లు మోసుకుంటూ అక్కడి

కెళ్ళి, వాటిని కిందపడేసి, తన పాదాలు నీటిలో దిగేసి, కుండీ గట్టుమీద కూర్చుని సిగరెట్ కాలుస్తూ ఆనందపరవశుడయ్యాడు.

కాసేపట్లో రెండుకుక్కలు దెబ్బలాడు కుంటున్న అరుపులువిని వెనక్కి తిరిగిచూసేడు. ఒక కొత్తబూటుకోసం ఆ దెబ్బలాట! గభాల్న కిందికి చూశాడు. ఒకబూటే వుంది. గుండె దడదడ లాడింది. అయినా బోలెడంత కోపం వచ్చేసింది. క్రిందిబూటు చంకలో పెట్టుకొని, చిన్నప్పుడు వాళ్ళమ్మమ్మగారి ఊళ్ళో గొడ్డకాటి బుడ్డాళ్ళ దగ్గర నేర్చుకున్న ముద్దయినబూతులు తిడుతూ రాళ్ళుపుచ్చుకుని కుక్కలవెంట బడ్డాడు. ఒకటి పారిపోయిందిగాని, రెండోది మాత్రం బూటు నోటకరచుకుని అటూయిటూ పరిగెత్తి పార్కుకు కంచెగా వేసిన ముళ్ళతీగల సందులోంచి దూరి బజార్నపడింది. గుర్నాథం కూడా ఆవేశంతో అదేపనికి పూనుకోవడం వల్ల లాగూ చొక్కాలు ముళ్ళతీగలకు పట్టు కొని పర్రున చిరిగాయి. అయినా అదేమీ పట్టించుకోకుండా కుక్కవేట సాగించాడు నిండు బజార్లో! ఈవేట ఫలితంగా ఒక కాంగ్రెసు జెండా కారూ, మరో జనతాజెండా కారూ ప్రేమతో ముద్దెట్టుకున్నాయి. పరమ నిష్ఠా గరిష్ఠుడైన బ్రాహ్మణుడొకడు చెప్పులు కుట్టు కుంటున్న హరిజనుడిమీద పడి ఆప్యాయంగా కావిలించుకున్నాడు. ఒక సాహెబు హిందూ దేవుళ్ళ పటాలమ్మే షాపుముందు సాష్టాంగ పడ్డాడు. ఒక రొయ్యలబుట్ట మరో చింతచిగురు కుప్పమీద బోర్లాపడింది. పత్రికల్లో వంటలూ వార్పులూ రాసే లావుపాటి లతాదేవి కూర గాయలు షాపుమీదపడి గుమ్మడి కాయల్ని పప్పుచేసింది, షాపువాణ్ణి పచ్చడి చేసింది.

గుర్నాథం రొట్టెవిరిగి నేతిలో పడింది. అతను మురికాల్వలో పడ్డాడు. వెదకబోయిన తీగె కాళ్ళకు తగలింది. చిరిగిన బూటు చేతికి తగిలింది.

విజయలక్ష్మీ సమేతుడై ఇంటికి నడిచాడు.

* * *

గుర్నాధం చెప్పిన వృత్తాంతం విన్న కృష్ణమూర్తికి "నవ్వు, ఏడ్పు, కోపం" అనే త్రిరసాలలో దేన్నభినయించాలో తెలియలేదు. మర్యాద ఆత్మగౌరవం అనేవి అన్నీ రసాల్నీ మింగేశాయి.

కమల మాత్రం కించిత్తు కోపాన్నభినయించి "సరే! అయిందేదో అయింది! బజారెళ్ళి ఆ బూటు బాగుచేయించి మూలబెట్టు" అంది— గుర్నాధాని కదే శాస్త్రి అన్నట్టు.

"అలాగే అక్కగారూ!" అని గుర్నాధం బాత్‌రూంలో జొరబడి, షాంపూసీసా ఖాళీచేసి తలంటు పోసుకుని, మురికి గుడ్డలకి పూర్తి బార్‌సోపు పట్టించి, తన లాగూ చొక్కాలు తొడుక్కుని, డబ్బులడిగి తీసుకుని, బూటు పుచ్చుకుని బజారు బయల్దేరాడు. వెళ్ళేప్పుడు కృష్ణమూర్తి సైకిల్ కనబడింది.

"సైకిలేసుకెళ్తా బావగారూ!" అంటూ ముచ్చటపడ్డాడు.

కృష్ణమూర్తి మౌనంగా అతనివేపు అర్థం లేని చూపొకటి విసిరాడు.

"మౌనం అర్ధాంగీకారం" అని తెలిసిన గుర్నాధం సైకిలేసుకుని ఝామ్మనెళ్ళిపోయేడు.

బూట్ల రిపేర్ షాపుముందు సైకిలు నిల బెట్టి, లోపలికెళ్ళి అర్జంటుగా బాగుచేస్తేగాని వీల్లేదన్నాడు. వాడు చార్జెస్ ఎక్కువచెప్పాడు. అయినా సరేనని వాడిపీకలమీద కూర్చున్నాడు.

వాడు రిపేరు చేసిచ్చేసరికి పూర్తిగా చీకటి పడిపోయింది. రిపేరయిన బూటుచూసుకుని సంతృప్తిచెంది, డబ్బులిద్దామని పాంటుజేబిలో చెయ్యిపెడితే డబ్బులేదుగాని, జేబులో పెద్ద చిల్లిమాత్రం వుంది. పోయిన డబ్బునూ, చిల్లి గల పాంటుకూ అష్టోత్తర శతనామావళి చదివి, "డబ్బు రేపిస్తాను, బూటిచ్చెయ్య"మని రిపేరర్‌ని బ్రతిమాలాడు. వాడు వీల్లేదు పొమ్మన్నాడు.

మనసులో వాడ్నొక పదిబూతులు తిట్టుకుని బయటకొచ్చాడు సైకిల్ దగ్గరకు. దాన్లైట్ మాయమైంది.

తనకిన్ని కష్టాలు ఒకేరోజున తెచ్చిపెట్టి నందుకు తన ఇష్టదైవానికి సహస్రనామావళి

చదువుతూ, సైకిలెక్కి ఇంటికి బయలదేరాడు. ఒక ఫర్లాంగయినా వెళ్ళకముందే పోలీసొకడు పట్టుకున్నాడు. పేరూ అడ్రసూ చెప్పమన్నాడు. బందర్లోలాగ తెలుగులో దబాయించబోయాడు. లాభంలేక పోయింది. ఇంగ్లీషులో బ్రతిమాల బోయాడు. భాష కుదర్లేదు. ఇహ గత్యంతరం లేక కృష్ణమూర్తి పేరూ అడ్రసూ చెప్పాడు. (వేరే దురుద్దేశమేమీలేదు. కృష్ణమూర్తిఇక్కడి వాడేగదా! కాస్త ఇన్ఫ్లూయన్స్ వుండి వుంటుంది. కేసులోంచి తేలిగ్గా బయటపడగలడు అనే నమ్మకం పాపం!)

పోలీసు వివరాలు రాసుకుని, మర్నాడు పొద్దున్నే 7 గంటలకల్లా సైదాపేట కోర్టుకు రమ్మని ఆర్డరేసి పోయాడు.

మళ్ళీ సైకిలెక్కకుండా కాళ్ళీడ్చుకుంటూ వచ్చి ద్వితీయ వృత్తాంతం చెప్పాడు దంపతులకి.

"సారీ బావగారూ! సారీ అక్కయ్యగారూ" అని కళ్ళవెంట నీళ్లు కూడా పెట్టుకున్నాడు.

క్షమించి వూర్కోడంతన్నా వాళ్లేమీ చేయలేకపోయారు.

కృష్ణమూర్తి స్వయంగా వెళ్ళి బూటు విడిపించుకొచ్చాడు.

మర్నాడు వుదయమే కోర్టు వెళ్ళాడు.

"నిన్న రాత్రి 7 గంటల వేళ సైకిలుకు లైటు లేకుండా తొక్కావా?" అనడిగాడు మేజిస్ట్రేటు.

"ఎస్ సార్!" అన్నాడు గిల్టీగా.

"నీ వుద్యోగం?"

"ఎ బి సి డి కంపెనీలో క్లర్కు."

"రెండు రూపాయలు ఫైను."

"ఎక్స్క్యూజ్ మీ సార్!.... ఇంకెప్పుడూ" అని ప్రాధేయపడబోయాడు కృష్ణమూర్తి.

"నాన్సెన్స్ 4 రూపాయలు" అన్నాడు కోపంతో మేజిస్ట్రేటు.

చచ్చినట్టు కట్టి బయటపడ్డాడు క్రిష్ణమూర్తి.

* * *

ఇంటి ఖామందు వరండాలో కూర్చుని అప్పుడే వచ్చిన 'హిందూ' పేపరు తిరగేస్తున్నాడు. "నమస్కారమండీ" అనేమాట విని తలెత్తి చూశాడు.

గుర్నాధం ఇకిలిస్తూ నిలబడి వున్నాడు.

"ఎవరు బాబూ నువ్వు?" అడిగాడు ఖామందు.

గుర్నాధం తన వివరాలన్నీ చెప్పేసి, "ఉద్యోగమేదన్నా ఇప్పించండి సార్! మీకు పుణ్యముంటుంది" అన్నాడు.

"నేనేం యిప్పించగలన్నాయనా? ఈ పేపర్లో ఉద్యోగాలకి చాలా ప్రకటనలు పడ్తూంటాయి. చూసి అప్లయ్ చెయ్యి! పది రాళ్లు విసిరితే ఒక్కటయినా తగలకపోతుందా?" అంటూ పేపరందించాడు ఖామందు.

గుర్నాధం బైఠాయించి ఉద్యోగప్రకటనలు వెదకడం మొదలు పెట్టేడు.

"ఒరే రాజీగా!" అని ఇంట్లోకి చూస్తూ పిల్చాడు ఖామందు.

"ఇదిగో వస్తున్నా డాడీ!" అంటూ ఒక ఆడగొంతు వినబడి, ఆ వెంటనే ఒక విగ్రహం కూడా ప్రవేశించింది కాఫీ గ్లాసుతో.

గుర్నాధం తలెత్తి చూశాడు.

18 ఏళ్ళ కన్యావిగ్రహం! వువ్వుల లుంగీ కట్టుకుని, గళ్ళ స్లాక్ తొడుక్కుని పొట్టి జుట్టు విరబోసుకుని వుంది. మెళ్లో ముత్యాల హారం. ఆ పిల్లకూడా గుర్నాధంవంకే కళ్ళార్పకుండా చూస్తూ నిలబడిపోయింది. ఖామందు ఆమె చేతుల్లో గ్లాసందుకుని "అలా చూస్తావేరా లక్ష్మీకొడకా! అతను మనవాడేలేవే! మన కృష్ణమూర్తి బావమరది!....మరోగ్లాసుడు కాఫీ పట్రా పంచదారవేసి" అన్నాడు కూతురితో.

"అలాగే డాడీ" అంటూ లోపలికెళ్ళిందా పిల్ల.

"మా అమ్మాయయ్యా గుర్నాధం! పేరు రాజేశ్వరి. బి. ఏ. చదువుతోంది. లేకలేక పుట్టిన ఒక్కగానొక్క పిల్లకావడంవల్ల దాన్ని మొగాదిలాగే పెంచుతూ, కొడుకులులేని కొరత తీర్చుకుంటున్నా నన్నమాట" అన్నాడు ఖామందు.

"బావుందండీ! చాలా బావుంది! 'లక్ష్మీ కొడకా' అని పిలవడం మరీ ముద్దుగా వుంది. "తొత్తుకొడకా" అనే మాటకూడా ట్రైచేసి చూడండి మోతగా వుంటుంది" అంటూనవ్వాడు గుర్నాధం.

"పిచ్చాడా? ఆమాట వదిలి పెడ్తానటయ్యా! అదేకాదు! 'గాడిద కొడకా' అనికూడా పిలుస్తూంటాను. ఇవి కాదుగానీ, మరేదయినా కొత్తమాట సూచించు" అన్నాడు ఖామందు.

"ఆలోచించి చెప్తానండి" అన్నాడు గుర్నాధం.

ఇంతలో రాజేశ్వరి వచ్చి, గుర్నాధానికి కాఫీయిస్తూ "ఏ వూరండీ మీది?" అనడిగింది.

"బందరండి" అన్నాడు గుర్నాధం.

"హబ్బ! బందరా!....డాడీ....నాకు బందర్లడ్డూలు తినాలనిపిస్తోంది" అంది చొల్లుకార్చేతూ.

"ఛ! గాడ్దికొడకా! ఇప్పటికిప్పుడు బందర్లడ్డెక్కడ్నించొస్తాయి?" అని ముద్దుగా మందలించాడు ఖామందు.

"పోన్లెండి పాపం! పాప ముచ్చట పడ్తూ వుంది. కావాలంటే నేనుచేసి పెడ్తాను"అన్నాడు గుర్నాధం.

ఖామందు అదిరిపడ్డా డాశ్చర్యంతో.

"ఏమిటీ? నీకు పిండివంటల్లోకూడా ప్రవేశముందా?"

"ఓ యస్! పిండివంటలు, పెళ్ళివంటలు, తద్దినం వంటలు—ఏవయినా సరే! బస్తీమే సవాల్!" అన్నాడు గుర్నాధం మీసం మెలిపెడుతూ.

"ఒర్నీ అసాధ్యం కూల! శుభం! మరి బందరు లడ్డూలతో మొదలుపెట్టు నీ కార్యక్రమం" అన్నాడు ఖామందు.

"అలాగేనండి! పాపకేం కావాలో అదల్లా చేసి పెడతాను....ఓకే?" అంటూ రాజేశ్వరి వంక చూశాడు.

"థాంక్యూ" అంటూ రాజేశ్వరి అతన్ని మనసులో మెచ్చేసుకుంది.

అప్పటివరకూ లోపల నిలబడి వింటున్న ఖామందు భార్య పార్వతి గుమ్మంలోంచి తల బయటపెట్టి భర్తతో "రాబోయే తద్దినం కాస్త గట్టెక్కించమని చెప్పండతనితో" అంది.

"మీ తద్దినం గురించి మీరేం భయపడకండమ్మా! నేనున్నానుగా" అభయ హస్తం చూపించాడు గుర్నాధం.

అక్కణ్నుంచి పన్లు చకచక జరిగాయి.

సాయంత్రానికి బందరు లడ్లు తయారయ్యాయి.

ఖామందు కృష్ణమూర్తినీ, అతని భార్యనీ కూడా ఆహ్వానించాడు. గుర్నాధమే అందరికీ లడ్లు ప్లేటల్లో పెట్టిచ్చాడు—(ఖామందుకి తప్ప) అద్భుతంగా కుదిరాయి లడ్లు. లొట్టలేసుకు తింటూ గుర్నాధం పనితనాన్ని తెగపొగడ్డం మొదలెట్టారందరూ.

కృష్ణమూర్తికి చిన్న జోక్ వెయ్యాలనిపించింది.

"ఏమోయ్ గుర్నాధం! ఇల్లు కట్టుకోవాలనుకుంటున్నాం! గృహప్రవేశానికి నువ్వుతప్పకుండా రావాలి. కాస్త వంటాగింటా" అంటూ సాగదీశాడు.

"అమ్మమ్మ! అదేంమాట బావగారూ! అసలు మీ యింటికి మొదట ఎసరు పెట్టేదే నేను" అన్నాడు గుర్నాధం.

"ఆ చేత్తోనే మా అమ్మాయి పెళ్ళికూడ కాస్త వెళ్ళమార్చు నాయనా! బాగా ఘనంగా చేద్దామనుకుంటున్నాం" అంది ఖామందు భార్య పార్వతమ్మ.

"అదేం మాటండీ! అసలు నేను లేకుండా మీ అమ్మాయి పెళ్ళి జరగడమే?" అన్నాడు గుర్నాధం నవ్వుతూ.

అంతా గొల్లుమని నవ్వారు.

రాజేశ్వరి మళ్ళీ నాలుగు లడ్లు పెట్టించుకు తింది.

కూతురు తృప్తిగా తినడంచూసి ఖామందు గారి కానందమయింది.

"ఏరా తొత్తుకొడకా! ఇవాళ లడ్లయ్యాయి! రేపేమిటి?" అనడిగాడు కూతుర్ని.

"రేపా?....రేపూ....ఇవాళివి పంచదారతో





చేశారుగా . రేపు బెల్లంతో . . బెల్లంతో మీ యిష్టమొచ్చినది చేసెయ్యండి గుర్నాధంగారూ" అంది రాజేశ్వరి గుడ్లుతిప్పుతూ.

"ఓయస్! చూడండి మన తడాఖా" అన్నాడు గుర్నాధం.

పార్టీ ముగిసింది.

అక్కణ్ణించీ గుర్నాధం కార్యక్రమం ఒక రకంగా ఏర్పాటయింది. పొద్దున్నే కృష్ణమూర్తి ఇంట్లో కాఫీ తాగడం—ఖామందు గారింటిలో పేపర్లో ఉద్యోగ ప్రకటనలు చూడ్డం—కృష్ణమూర్తి కాతాలో పోస్టుకవర్లూ, (కొట్లో యివీ దొరుకుతాయి మరో పైసా అదనంగా) తెల్ల కాగితాలూ తెచ్చుకుని అప్లికేషన్లు పెట్టడం—మధ్యాహ్నం భోంచేసి నిద్రపోవడం—4 గంటలకు లేచి టిఫిన్ కాఫీలారగించడం — కాలేజీ నుంచి రాజేశ్వరి రాగానే వాళ్ళింట్లో జొరబడి బాతాఖానీ, కారంబోర్డు, మాగజైన్లు వగైరాలతో కాలక్షేపం—రాత్రి 9 గంటలకు భోజనం-తర్వాత ఫాన్‌లో నిద్ర. శని ఆదివారాలలో ఖామందు గారింట్లో పిండివంటలు చేయటం వారి ప్రశంసలు పొందడం—

ఒకనాడు కృష్ణమూర్తి భార్య విడిచిన చీరె దండెంమీదనుంచి కింద పడిపోయింది. గుర్నాధం సిగరెట్టు కాలుస్తూ అప్లికేషన్లు రాస్తున్నాడు. సిగరెట్ చివరకి వచ్చింది. దాన్ని ఎటు విసిరేస్తున్నాడోకూడా తెలియకుండా విసిరాడు. అది చీరమీదపడి తగలబెట్టింది.

కమల భర్తతో చెప్పుకు కుళ్ళికుళ్ళి ఏడ్చింది. అతనామెను శాంతంగా వుండమని ఓదార్చాడు.

మరోనాడు ట్యూబ్‌లైటు వెలగలేదు. దాన్ని మళ్ళీ వెలిగిద్దామనే ప్రయత్నంలో పగలగొట్టేశాడు గుర్నాధం.

"చేతకాని పనులు నీ కెందుకయ్యా?" అని మాత్రం మందలించగలిగాడు కృష్ణమూర్తి. ఇంకోనాడు హెయిరాయిల్ చేతిలోకి వంచుకుంటుండగా కొంత క్రింద ఒలికిపోయింది.

ఒలికిపోయినదాన్ని తుడిచేయడం మర్చిపోయాడు గుర్నాధం. కుక్క వంటింట్లో దూరబడిందనే హడావిడిలో పరుగెత్తి కాలు హెయిరాయిల్ మీదవేసి జారిపడి చట్ట విరగగొట్టుకుంది కమల! దాంతో, వాపులూ, తీపులూ వైద్యాలూ....

కొత్తాకొట్లో లెక్క మొక్కబడి జుట్టులా పెరిగిపోతోంది.

కృష్ణమూర్తి దంపతులుకి కనిగాణ్ణి భరించడం చాలా కష్టమయిపోతోంది. వెళ్ళిపొమ్మని చెప్పలేరు. గట్టిగా తిట్టలేరు. ఏమీ తోచక మొదట్లో చూపించిన ఆప్యాయత తగ్గించి ముభావంగా వుండసాగారు. కాని గుర్నాధం మాత్రం అడిగయినా సరే తన కోరికలు నెరవేర్చుకుంటున్నాడు. వాళ్ళకి లోపల మరింత మండిపోతోంది.

ఖామందుకీ, పార్వతికికూడా రోజులు గడుస్తున్నకొద్దీ గుర్నాధం పెద్ద తలనొప్పిగా తయారయ్యాడు. పరీక్షలు దగ్గరకొస్తున్నా రాజేశ్వరి చదువుకు నామం పెట్టేసి గుర్నాధంతో కాలక్షేపం చేసేది. కూతుర్ని మందలించి చూశారు. లాభం లేకపోయింది. చూసిచూసి ఒకరోజు గుర్నాధాన్ని షికారుకు పిల్చుకుపోయి "బాబూ! అమ్మాయి పరీక్షలు దగ్గరకొస్తున్నాయి. ఇప్పట్నుంచే చదవకపోతే లాభంలేదు. నీతో కాలక్షేపం చెయ్యకుండా బాగా చదివి మంచి మార్కులు తెచ్చుకోమని బుద్ధిచెప్పు నాయనా" అంటూ బ్రతిమాలాడు ఖామందు. అంటే తనని వాళ్ళింటికి రావద్దని చెప్తున్నాడని అర్థమయింది గుర్నాధానికి.

"అలాగే సార్! తప్పకుండా చెప్తాను" అని ఒప్పేసుకుని, రాజేశ్వరితో ఆ మాటే చెప్పేశాడు ఇష్టంలేకపోయినా.

బలవంతంగా చదవడం మొదలు పెట్టింది రాజేశ్వరి.

గుర్నాధం సాయంకాలం బజారు షికార్లు మొదలు పెట్టాడు.

నాలుగు రోజులు గడిచాక ఒక రోజురాత్రి 8 గంటలకు రాజేశ్వరి పరుపు కింద నాలుగు మాగజైన్లు కనబడ్డాయి పార్వతమ్మకు. తీసి చూసింది. అసహ్యమైన బొమ్మలూ, అంతకన్నా అసహ్యమైన భాష!

రాజేశ్వరికి తెలియకుండా భర్తను పిల్చి చూపించింది. ఆయన మనస్సు కెలికినట్లయింది. భార్యను వంటింట్లోకి పంపి, రాజేశ్వరిని పిల్చి నిగ్గదీసి అడిగితే గుర్నాధం ఇచ్చాడని చెప్పింది. ఉగ్రుడైపోయడు.

కృష్ణమూర్తి పడక్కుర్చీలో పడుకుని, దూలాలు చూస్తూ ఈ గుర్నాధంగాడ్నెలా వదిలించుకోవాలీ అని ఆలోచిస్తున్నాడు.

ఖామందు హడావిడిగా వచ్చారు "కృష్ణమూర్తీ! మీ చుట్టమేడీ?" అంటూ.

"ఎక్కడికో వెళ్ళినట్టున్నాడండీ, ఏం?" అన్నాడు కృష్ణమూర్తి.

"ఏమిటి బాబాయిగారూ?" అంటూ వచ్చింది కమల.

ఆడదాని ఎదట తన బాధ వెళ్ళబోసుకుని అల్లరైపోవడం యిష్టంలేక "ఏం లేదమ్మా" అని, కృష్ణమూర్తిని చూసి "కాస్త డాబామీదికెల్దాం రావయ్యా" అంటూ పిల్చికెళ్ళాడు.

డాబా మీద ఖామందు తన బాధంతా వెళ్ళబోసుకుని "నువ్వు వెంటనే మీ వాడ్ని తరిమేస్తావా లేక వాడ్ని చావగొట్టమంటావా?" అనడిగాడు.

కృష్ణమూర్తికి భయం వేసింది. "బాబ్బాబు ఆ పని మాత్రం చెయ్యకండి. మా చుట్టాల దగ్గర నా పరువు పోతుంది. ఎలాగో రేపు రాత్రి సర్కార్లో వాడ్ని పంపించేస్తాగా! నా మాట నమ్మండి! ఒట్టు" అని ప్రమాణం చేశాడు కృష్ణమూర్తి.

ఖామందుకి నమ్మకం చిక్కాక శాంతించి, "అబ్బబ్బ! ఈ పీడ ఎంత తొందరగా వదిలితే అంత తొందరగా తిరుపతి వెళ్ళొద్దామని పిస్తోందయ్యా" అన్నాడు.

కృష్ణమూర్తి వెంటనే గుర్నాధంవల్ల తనకొలిగిన బాధలన్నీ వివరంగా చెప్పి, "మీకే కాదు! నాకూడా అలాగే అనిపిస్తోంది. ఇద్దరం కలిసే వెళ్దాంలెండి. రండి

పోదాం" అన్నాడు కృష్ణమూర్తి.
ఇద్దరూ డాబా దిగిపోయారు.
డాబామీద ఒక గోడ పక్కగా నిలబడి వీళ్ళ సంభాషణంతా విన్న గుర్నాధం ఒక నిట్టూర్పు విడిచి తల పంకించాడు.
తెల్లారింది.
గుర్నాధం డ్రెస్సు వేసుకుని, సంచి చేత్తో పట్టుకుని "బావగారూ! నేను వెళ్లొస్తా" అన్నాడు కృష్ణమూర్తితో.
కృష్ణమూర్తి తన కళ్ళనీ చెవుల్నీ తానే నమ్మలేకపోయాడు. ఆశ్చర్యంగా 'ఆఁ' అని నోరు తెరిచి అలాగే వుండిపోయాడు.
"ఏమిటీ? అప్పుడే?" అంటూ వచ్చింది కమల.
"అవునక్కయ్యగారూ! వెళ్ళాలి. ఎన్నాళ్ళని మిమ్మల్నిబ్బంది పెట్టనూ? ఇహ ఇక్కడ వుద్యోగం దొరకదు. అక్కడే ఏదయినా ట్రై చేస్తా" అన్నాడు గుర్నాధం.
"ఛ ఛ! మాకేం యిబ్బందయ్యా?....ఐనా ఇప్పుడేనా? రాత్రి సర్కారుకు వెళ్ళచ్చుగా" అన్నాడు కృష్ణమూర్తి మనసులో ఆనందంతో ఉక్కిరిబిక్కిరవుతుండగా.
"ఇంకా రాత్రిదాకా ఎందుకూ? ఇప్పుడు జనతా ఎక్కానంటే రాత్రి కింటికి చేరుకుంటాను" అన్నాడు గుర్నాధం.
"సరే అలా అయితే! శుభం! వెళ్ళిరా" అంటూ గుర్నాధంతోబాటు వీధిలోకొచ్చి "మరి నే వుంటా! అప్పుడప్పుడూ వస్తూండు, ఉత్తరాలు రాస్తూండూ" అన్నాడు కృష్ణమూర్తి మాటవరసకి.
"అలాగే అలాగే" అంటూ గుర్నాధం వెళ్ళిపోయాడు.
ఆ తర్వాత వచ్చిన శనివారమే రెండు దంపతులూ తిరపతెళ్ళి మొక్కు తీర్చుకొచ్చాయి.
మూడు నెలలు గిర్రున తిరిగాయి.
ఖామందు కృష్ణమూర్తి దగ్గరకు గుండెలు బాదుకుంటూ వచ్చాడు—
"నాకొంప మునిగిపోయింది కృష్ణమూర్తీ" అంటూ.

కృష్ణమూర్తికంతా అయోమయం. "ఏమైందండీ!" అన్నాడు.
"నా పరువు ప్రతిష్ఠ మంటగలిసిపోయాయి. ఇంక నేను తలెత్తుకు తిరగలేను. ఏ నుయ్యో గొయ్యో చూసుకోవలసిందే" అంటూ గొల్లు నేడ్చాడు ఖామందు.
"మీరు వూరికే అధైర్యపడకండి బాబూ! ఏం జరిగిందో చెప్పండి" అన్నాడు కృష్ణమూర్తి ఓదార్చుతూ.
"మా రాజిగాడు కడుపుతో వున్నాడు నాయనోయ్."
కృష్ణమూర్తి షాక్ తిన్నాడు. ఒక్క నిముషం అలాగే వుండిపోయి,
"ఎవరట?" అనడిగాడు రహస్యంగా.
"ఇంకెవ్వరు? ఆ దిక్కుమాలిన ముండాకొడుకు....మీ బావమరిది గుర్నాథంగాడేట" మళ్ళీ ఏడుపు.
కృష్ణమూర్తికి మరో షాక్.
"వాడు వెళ్ళిపోయాడు గదండీ! మళ్ళీ ఎప్పుడొచ్చాట్ట?"
"మనం తిరపతెళ్ళిన రోజునే తగలడ్డాట్ట తండ్రీ! పరీక్షలు గదాని మా రాజిగాడ్ని వదిలి పెట్టి వెళ్ళాం. లేకపోతే ఇంత ఘోయిత్యం జరిగేది కాదు నాయనోయ్" అంటూ మళ్ళీ రాగాలు పెట్టాడు.
కృష్ణమూర్తికి బాధ కలిగింది. గుర్నాధం గాడ్ని చిత్రవధ చెయ్యాలనిపించింది. అంతలోనే ఖామందుని చూస్తే జాలేసింది—కాస్త ఆలోచించాడు.
"బాబూ! అధైర్యపడకండి. మనం వాళ్ళ వూరు వెళ్దాం. మనమ్మాయిని చేసుకోమని బ్రతిమాల్దాం. ఇంతకన్నా మరో గత్యంతరం లేదు మనకి. ఏమంటారు?" అన్నాడు కృష్ణమూర్తి.
"నీ ఇష్టం నాయనా! నా మానం, మర్యాదా నా బిడ్డ బ్రతుకూ ఎలా కాపాడతావో నీదే భారం" అంటూ చేతులెత్తి దణ్ణం పెట్టాడు ఖామందు.
వెంటనే ఇద్దరూ బందరు ప్రయాణమై వెళ్ళారు.

గుర్నాధం బందర్లో లేడు। హైద్రాబాద్‌లో ఏదో హోటల్లో సర్వరుగా ఉంటున్నాడని గుర్నాధం తల్లి పిచ్చమ్మ చెప్పింది. అద్ర సిచ్చింది. కృష్ణమూర్తి ద్వారా విషయమంతా విని బాధపడి కొడుకుని తిట్టిపోసింది. వాడి కాళ్ళూ చేతులు విరగ్గొట్టయినాసరే పెళ్ళి జరిపించమంది.

కృష్ణమూర్తీ, ఖామందూ హైద్రాబాద్‌లో గుర్నాధాన్ని కలిశారు. కాళ్ళూ గడ్డమూ పట్టుకుని అతి దీనంగా బ్రతిమాలి, బహు కష్టం మీద పెళ్ళికి వప్పించారు—అయితే ఒక్క షరతు.

ఖామందుగారు తన యావదాస్తినీ పెళ్ళికి ముందే గుర్నాధం పేర వ్రాసేయాలి.

ఒప్పుకున్న ప్రకారం ఖామందు షరతును పాటించారు.

పెళ్ళి ఏ గుట్టూ బయటపడకుండానే బ్రహ్మాండంగా మద్రాసులో జరిగింది—

ఆ మర్నాడు ఖామందు కృష్ణమూర్తి దగ్గర కొచ్చి "నాయనా కృష్ణమూర్తి। నువ్వు వారం రోజుల్లో నీ పోర్షను ఖాళీచేసెయ్యాలి" అన్నాడు.

కృష్ణమూర్తి అదిరిపోయాడు. అనుకోని పిడుగు। "అదేమిటండీ?" అన్నాడు దీనంగా.

"ఏం చెయ్యమంటావు నాయనా। మా అల్లుడు మాతో 'కలిసి వుండట్ట. నీ పోర్షను లోనే విడిగా కాపురం పెట్టుకుంటాట్ట। లేకపోతే కంటి క్కానబడకుండా పోతానంటున్నాడు" అన్నారు ఖామందు.

కృష్ణమూర్తి బిక్క మొహం పెట్టి ఆయన వంక చూడసాగాడు.

"అలా చూస్తావేం నాయనా? తప్పదు మరి. వాడు నీ పాలిట శనిగాడు-అందుకే ఇన్ని కష్టాలు నీకు। నా పాలిట ఆషాఢభూతిగాడు। నన్ను సర్వం దోచుకున్నాడు గదా। ఏం చేస్తాం? అంతే ఈ జీవితాలు" అంటూ సాగదీశాడు ఖామందు.

ఆ మర్నాడే మళ్ళీ ఇంటిపేటకు బయల్దేరాడు కృష్ణమూర్తి. □

---

మి నీ క థ :

# ఆమె కథ

"ఏమైనా పత్రికలు తెండీ" పోస్టుమాన్ భార్య శ్రీలక్ష్మి.

"ఎందుకూ పేరు గొప్ప వూరు దిబ్బ. పెద్ద ఎలక్ట్రికల్ సూపర్‌వైజరు. కరెంటు బిల్లు పాతిక రూపాయిలు-మీటరు కనెక్షన్ తప్పించండీ అంటే ధైర్యం చాలదు" ఆమె పేరు సతీసావిత్రి.

"పోలీసుజ్జోగం చేసి రెండు మేడలు కట్టించేడు మా నాన్న. ఎందుకు మీరూ వున్నారు" అప్పలస్వామి పెళ్ళాం వరలక్ష్మి.

"నాలుక్కార్డులు పట్రండీ ఏదో ఇంటిదగ్గరుండి పూరికే కూర్చోవడ మెందుకు చిన్న తరహా పరిశ్రమ ప్రారంభిస్తాను" సివిల్ సప్లయ్ ఆఫీసరు గుమస్తా భార్య సుగుణ.

"అందరికీ ఇంచక్కా వుద్యోగాలు. నా అమ్మడు మాత్రం రోడ్లంట" ఎంప్లాయిమెంటు గుమాస్తా భార్య పార్వతి.

"భద్రాచలం వెడదామని వుందండి. ఎవరితోనయినా చెప్పి ఫస్టుక్లాసు కంపార్టుమెంటు ఎక్కించేసారా ఆ పుణ్యమంతా మీదేనండి" టికెట్ కలెక్టర్ భార్య సత్యవతి.

"అందరి కథలూ అంటూ డబ్బిచ్చి మరీ అచ్చేసుకుంటారు. నా చెల్లెలి కథ అచ్చెయ్యమంటే వెయ్యరు. వారానికో నాలుగయినా వుత్తరాలు రాస్తోంది బావగారికి చెప్పి ఎలాగయినా తన కథ అచ్చేయించమని" కళ్ళనీళ్ళు పెట్టుకుంది నాగమణి. ఆమె ఎడిటరు భార్య మరి.

సో బ్రదర్... జీవితంలో మనిషి నిషాకి ఎక్కడ సోపానం వేస్తాడో ఏ ఒక్క జంట కథైనా తీసుకో నీకే అర్థమౌతుంది.

—జి. జి. కె రావు.




ఇంటి లోపల అంతటా నిశ్శబ్దంగా వుంది.

ఇంటి ముందర కూడా ఏ అలికిడీ లేదు.

వరసలో పచ్చగా నిలబడిన పూల మొక్కలు మాత్రం బృందగానం చేస్తున్న వసకన్యల్లాగ వున్నాయి.

మనసు వూహాగానం చెయ్యకపోతే జీవితం ఇంకెంత శూన్యంగా వుండేదో. మనసు పూస్తున్న రంగులతో, పాడుతున్న నేపథ్య సంగీతంతో రజనికి రోజులు విసుగు విరామం లేకుండా గడిచిపోతున్నాయి.

పొద్దున్న పని పూర్తి అయింది.

వరండాలోకి వచ్చి కుర్చీలో కూర్చుంది.

ఒక్క క్షణంపాటు ప్రపంచం అంతా నిశ్శబ్దంగా అయినట్లనిపించింది.

అంతలో మనసు మళ్ళీ తన పని ప్రారంభించింది.

పక్క ఇల్లు ఖాళీగా వుంది నెల రోజుల నుంచీ.

వరండాలోకి వస్తే అంతా శూన్యంగా అనిపిస్తోంది.

పక్క యింట్లో చెట్లు ఎండిపోతున్నాయి. తలుపులు మూసే వుంటున్నాయి. ఎప్పుడు

తెరుచుకుంటాయా అని ఎదురు చూస్తున్నట్లు నిశ్శబ్దం ఆ యింటి ముందు కాపలా కాస్తోంది.

పిల్లల నవ్వులు లేవు. ఆటల కేకలు లేవు.

నెల(కిందటిదాకా ఎంత కాలక్షేపంగా వుండేది!

వరండాలోకి రాగానే రాధమ్మ నవ్వు పలకరించేది.

స్కూలునుంచి వస్తూ వాళ్ళమ్మాయి గేటు తీసుకుని ముందు తమ ఇంటికే వచ్చేది. గ్లాసుడు మంచినీళ్ళు తాగి, ఒక జామకాయ తీసుకుని వెళ్ళేది. ఈలోగా కబుర్లతో అర గంట గడిచేది. ఆ అరగంటలోనే రాధమ్మ "ఉమా, ఓ ఉమా" అంటూ ఆరుసార్లు పిలిచేది.

"వస్తున్నానమ్మా" అంటూనే అరగంట గడిపేది ఉమ.

ఇంటికి వచ్చినట్లేగా, ఎందుకో ఆవిడికి అంత తొందర.

తల్లి(ప్రాణమంటారు అందుకే కాబోలు. అట్లాగుంటుంది కాబోలు! తనకేం తెలుసు!

ఎందుకు తెలీదు!

భగవంతుడు పిల్లల్ని ఇవ్వకపోయినా మనసు ఇచ్చాడు కదా. పిల్లల ఆటలూ వాళ్ళ నవ్వులూ చూస్తుంటే మనసు చిగుళ్ళు వేస్తుంది. పాపల బుగ్గమీద కన్నీళ్ళు చూస్తే గుండెలకి హత్తుకోవాలనిపిస్తుంది.

"నీకు నేనున్నానురా కన్నా! ఛీ ఛీ ఏడవ కూడదు" అనాలనిపిస్తుంది. కానీ ఎవరికి ఎవరు?

అట్లాగ చేస్తే తల్లులందరూ తనని విడ్డూరంగా చూడరూ!

తనదంటూ ఒక పిల్లను పెంచుకుంటే... ఎక్కడో పుట్టిన చెట్టు అంటుతొక్కి మన దొడ్లో పాతుకున్నట్లు....

మరి అది (బతికి అతుకుతుందా?

ఎవరున్నా లేకపోయినా తనకి (ప్రిన్స్ వున్నాడు చాలు. పిచ్చినాన్న! దాని రంగు, నిగనిగ, కంటిమెరుపు, చూపులో తెలివి ఏ కుక్కకి వుంది!

పక్కఇల్లు ఖాళీగా వుండటం వాడికి నచ్చటం లేదు.

తలుపులవేపు చూస్తూ వుంటాడు.

ఉమ రోజూ బిస్కట్లు పెట్టేది.

మళ్ళీ ఆ తలుపులు తెరుచుకోవాలి.

ఒక సుధ లేదా రోజా లేదా ఓ బేబీఎవరో వస్తేకాపీ తనకి (ప్రిన్స్‌కి తోచదు.

* * *

ఒకరోజు, దాని తరవాత ఇంకో రోజు.... మరో రోజు....ఇట్లాగ వొంటిమీదికి నలభై ఏళ్ళు వచ్చేశాయి అనుకుంది రజని వరండాలోకి వచ్చి ఆ కుర్చీలో కూర్చోగానే.

తర తరాలుగా ఎండకీ వానకీ తట్టుకుని నిశ్చలంగా కనిపించే కొండలు గుర్తువచ్చాయి. తను కూడా ఒక కొండ. కొండలకి పిల్లలు పుట్టవు. తను మనిషి కొండ. కొండ కళ్ళు తెరుచుకుని చుట్టూ చూసినట్లుగా చూసింది.

ఆకుల్ని మించిన పూలు పూసిన బోగన్విలా కొమ్మలు గాలికి బాగా వూగుతున్నాయి. ఉయ్యాల లూగుతున్నాయ్.... సయ్యాటలాడుతున్నాయ్.

నది(ప్రవాహంలా నిముషాలు కదిలిపోతున్నాయ్.

పక్క ఇంటి తలుపులు ఇంకా మూసుకునే వున్నాయ్.

ఈ (ప్రపంచం కూడా తలుపులు మూసుకుని నిద్ర పోతోంది.

ఈ (ప్రపంచాన్ని చూస్తుంటే కోపంగా వుంది, చిరాకు వేస్తోంది.

నిన్న పనిమనిషి చెప్పిన సంఘటన విన్నప్పటినుంచి ఒంటరిగా కూచోటానికి భయం కూడా పోయింది, కోపంతో. ఎవడొస్తాడోరానీ ఏం చేస్తాడో చూస్తాను అంటోంది మనసు.

పక్కవీధిలోనే.... సాయం(తంవేళ .... భర్త ఇంటికి రాలేదింకా. ఎదురు చూస్తోంది ఇల్లాలు. చేతిలో పాలగ్లాసు ఎదురుగా మూడేళ్ళ

పిల్ల. మారాం చేస్తూ పాలుతాగుతోంది. ప్రశ్నలతో వేధిస్తోంది తల్లిని.

భర్త ఆఫీసునుంచి ఇంటికి వచ్చాడు. భార్యవేపు చూసి పలకరింపుగా నవ్వి బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు.

"నాన్న వచ్చేశారు. కాఫీ యివ్వాలి. త్వరగా తాగమ్మా" అంటోంది ఆవిడ.

అంతలోనే....

అంతలోనే ఎదుట వచ్చి నిలబడ్డారు ముగ్గురు ఆగంతకులు.

మొహాలకి ముసుగులున్నాయ్. చేతిలో ఆయుధాలున్నాయి.

తెల్లబోయింది.... ఇదేమిటి? ఎవరు? ఎందుకు?

అంతలోనే....

"దొంగలు జాగ్రత్త!" మనోకేంద్రంనుంచి హెచ్చరిక.

చప్పున పాపని దగ్గరగా లాక్కుంది.

"ఎవరు మీరు? ఏం కావాలి?"

"మాట్లాడకు. ఆ నగలన్నీ ఇయ్యి....ఊ.... త్వరగా."

గొంతు దగ్గిరికి కత్తితెచ్చి పెట్టాడొక ముసుగు మనిషి.

చేతుల గాజులు మెల్లగా తియ్యటం మొదలు పెట్టింది.

"త్వరగా" మెళ్ళో చెయ్యిపెట్టి గొలుసు తీసేశాడు ఇంకొకడు.

చేతి గాజులు ఇచ్చేసింది.

అదే సమయంలో బాత్‌రూంలోంచి బయటికి వచ్చాడు భర్త....తెల్లబోయాడు ఎదుట దృశ్యం చూసి....ఒకడుగు ముందుకు వేశాడు.

భార్య ఆదుర్దాపడుతూ భర్తకి కంటితో సౌజ్ఞ చేసింది వెళ్ళిపొమ్మని.

ఒక చోటెక్కడో అడ్డు వచ్చిన భర్తని కత్తితో పొడిచేశారుట....అతడు బాత్‌రూమ్ లోకి వెళ్ళి తలుపు చాటున నిలబడ్డాడు.

నగలన్నీ ఒలుచుకుని వాళ్ళు వచ్చినట్లే మాయమయ్యారు.

బాత్‌రూమ్ లోంచి భర్త వచ్చాడు. ఆవిడ ఫెయింట్ అయింది. భార్యని గుండెకు హత్తుకుని "ప్రాణాలు దక్కాయి చాలు" అన్నాడు భర్త.

---

## 'మ్యూజిక్‌రూమ్'



ఓ పాతికేళ్ళ రాంబాబుకి లాటరీలో యాభై వేలు వచ్చాయి. ఆ డబ్బుతో ఓ మాంచి ఇల్లు కొని ఆ ఇంటిని తన మిత్రుడికి చూపిస్తున్నాడు. ఇంటిచుట్టూ చూపించాక ఇంట్లోని ఒక్కొక్క గదే చూపిస్తూ—'ఇది డ్రాయింగ్ రూమ్, ఇది బెడ్‌రూమ్, ఇది డైనింగ్ హాలు. ఇది కిచన్'-అంటూ చివరికి ఓ గదిలోకి వచ్చి 'ఇది మ్యూజిక్ రూమ్' అన్నాడు రాంబాబు. ఆ వచ్చిన మిత్రుడు గదంతా తిలకించి, "ఓ పియానోగాని, గిటార్‌గాని, రికార్డు ప్లేయర్ గాని, కనీసం రేడియోగాని లేదే? ఇది మ్యూజిక్‌రూమేవిటి??" అని ఆశ్చర్యపోతూ అడిగాడు.

"ఈ గదిలోకి పక్కింటి అమ్మాయి గొంతు తియ్యగా వీణ మీటినట్లు వినిపిస్తుంటుంది" అన్నాడు రాంబాబు తన్మయత్వంగా.

—నాని.

అది నిన్నటి సంఘటన.

ఒక్కొక్కచోట ప్రాణాలుకూడా దక్కటం లేదు. మానభంగాల సంగతి అడక్కూడదు.

ఏమిటీ అన్యాయం! ఏమిటీ పరిపాలన! దౌర్జన్యాన్ని అరికట్టేవాళ్ళు లేరా?

ఇంత రక్షణ సిబ్బంది, పోలీసు బలగం వున్నాయి.

ఆధునిక ఆయుధాలు పరికరాలు వున్నాయి.

దేశరక్షణకోసం మంత్రులు, ఆఫీసర్లు వాళ్ళకి బోలెడంత జీతాలూ ఇంకా ఎన్నెన్నో వున్నాయి.

ఐనా పట్టపగలు పౌరుల్ని బందిపోట్లు దోచుకుంటుంటే అడిగేవాడు ఆదుకునేవాడు లేడు.

ఎందుకీ పోలీసు దళం....ఎందుకీ ఎలక్షన్లు!

ఎంత కష్టపడాల్సి వస్తోంది డబ్బు నిలవ చెయ్యటానికి!

"మీకేం పిల్లలా జెల్లలా?" అంటారు.

ఇటు తనవైపు వాళ్ళకి, అటు ఆయనవైపు వాళ్ళకీ తమ డబ్బు మీదే ఆశ. తరచూ వచ్చి పోతూ వుంటారు. మర్యాదలకి ఏ కొంచెం లోటు వచ్చినా సహించలేరు. పైగా ఆయన సంపాదనంతా ఏమైపోతోంది అంటారు.

ఈనాడు ఏ వస్తువు ధర తక్కువగా వుంది!

జబ్బులపాలు గాకుండా సరైన భోజనం చేయాలంటే సంపాదన ఇంటి అద్దెకి తిండికి సరిపోతోంది. పిల్లలుగల వాళ్ళేం చేస్తున్నారో అని తను ఆశ్చర్యపడుతూనే వుంటుంది. ఈ గాజుల జత చేయించటంకోసం, నెలకి ఇరవై చొప్పున చిట్‌ఫండ్ కట్టి మూడేళ్ళు కూడబెట్టింది....అదీ ఐదేళ్ళ క్రిందటగనక.... చేయించుకోగలిగింది. ఇది పోతే మళ్ళీ ఇప్పుడు చేయించుకోగలదా!

గొలుసు పెళ్ళికి చేయించారు నాన్న.... ప్రావిడెంట్ ఫండ్ లోన్‌లోంచి డబ్బుతీసి. ఎవడైనా వచ్చి లాక్కుపోటానికి వాడికేం హక్కుంది!

తిండిలేక, ఉద్యోగాలు లేక బందిపోటులు తయారవుతున్నారంటారు. దానికి బాధ్యత ప్రభుత్వంది కానీ ప్రజలేం చేస్తారు? నిరపరాధులు! వాళ్ళే ప్రభుత్వంచేతిలో నలుగుతున్నారు.

ప్రజలమీదనా తమ కక్ష సాధించటం! మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టు.

ఇది ఇట్లాగ చూస్తూ ఊరుకోవటమేనా?

మైట్ ఈజ్ రైట్ అన్న ఆదిమ మానవుల దశకి చేరుకుంటున్నామా మళ్ళీ. దొంగలు దోచుకుంటుంటే ఎవరూ సాయంరారు. ఎవరిప్రాణం వారికి తీపి.

పోలీసులకి ఫోన్ చేస్తే ఈ స్టేషన్ మీ ఏరియాలో లేదు అంటారు.

ఏం జరిగినా చూస్తూ ఊరుకోవటమేనా?

ఇంతకంటె అడవిలో వుండటం నయం.... మన జాగ్రత్తలో మనం వుంటాం.

ఎంత నిస్సహాయత! ఇట్లాగ వుండకూడదు....వుండకూడదు..

మరి ఎట్లాగుండాలి?

ఆలోచనలో పడిపోయి కళ్ళు మూసుకుంది రజని....మనసు రంగు రంగుల ఊహాలోకం చిత్రించటం ప్రారంభించింది.

తనొక గుర్రంమీద వుంది. నడుముకి కత్తి, తూటాలు. చేతిలో పిస్టల్, భుజానికి విల్లు. గుర్రం పట్నపు రోడ్లమీద పరుగు పెడుతోంది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా వున్నాయ్.

"పిరికివాళ్ళలాగ ఇళ్ళలో దాక్కోకండి. బయటకి రండి. ఆత్మరక్షణే కాదు, సామూహికంగా ఒక్కటై ఎదురించటం నేర్చుకోండి. ఈ ప్రభుత్వం ఏం చెయ్యలేదు. ఓట్లు అడుక్కోవటం, పన్నులు వసూలు చేసుకోవటం మాత్రమే తెలుసు దానికి. ప్రజల అవసరాలు నెరవేర్చటం తెలీని పనికి మాలిన ప్రభుత్వం ఇది. భక్షించటం తప్ప రక్షించటం తెలీని.... మనల్ని మనమే రక్షించుకోవాలి...."

అందరూ ఇళ్ళలోంచి బయటికి వస్తున్నారు. ఏదో ఒక ఆయుధం ధరించారు. స్త్రీలు గుర్రాలెక్కి పహరా ఇస్తున్నారు. ఆనందం ఉత్సాహం ధైర్యం పొంగిపోతున్నాయ్.

పకడో....మారో అంటూ కేకలు.... కేకలు....ముసుగు మనుషులు పారిపోతున్నారు....

చటుక్కున కళ్ళు తెరిచింది రజని.... ప్రిన్స్ గేటు దగ్గర నిలబడి మొరుగుతోంది. పక్క ఇంటి గేటు తీసుకుని లోపలికి వెడుతున్నారు....భార్యా భర్తలు కాబోలు. ఆయన తాళం తీస్తున్నారు....మూసిన తలుపులు తెరుచుకున్నాయ్....

ఇద్దరూ లోపలికి వెళ్ళారు....నిశ్శబ్దం బయటికి పారిపోయింది.

లోపలనుంచి చప్పుళ్ళు, మాటలు వినిపిస్తున్నాయ్.

ఐతే వీళ్ళు వచ్చేస్తున్నారన్న మాట.... ఎప్పుడొస్తారో!

"రెండు గ్లాసుల మంచినీళ్ళిస్తారా?" ఆవిడ మధ్యగోడ దగ్గర నిలబడి అడుగుతోంది.

"తెస్తానుండండి...." గబగబ లోపలికి వెళ్ళి తెచ్చి యిచ్చింది.

మాటలు సాగాయి. ముగ్గురు పిల్లలుట. ముచ్చటగా ముగ్గురు కాబోలు.

చిన్నప్పుడు బొమ్మలాట లాడేవారు. ఎప్పుడూ తన బొమ్మకి 'కృష్ణ' అనే పేరు పెట్టేది. బొమ్మలపెళ్ళి చేసేవారు. ఎవరింటికి వాళ్ళు వెళ్ళాక తను ఒంటరిగా వున్నప్పుడు యశోద అయ్యేది. కృష్ణుడికి తల్లి అయి కృష్ణ లీలలన్నీ ఆడేది.

మట్టి తిన్నావా? నోరు చూపించు!

ఏమిటీ మాయ? పసివాడి నోటిలో పధ్నాలుగు భువనాలా? తండ్రీ....నమస్కారం.... ఈ దృశ్యం నేను భరించలేను....నువ్వు నా చిన్నారి కృష్ణుడివై నా వొళ్ళోకి రా! నీకు జోల పాడతాను.

వెన్నంతా ఏమయింది కృష్ణా! దొంగిలించావా? వుండు నీ పని చెప్తా....

ఈ చెట్టుకి కట్టేస్తాను.

ఎన్నో ఆటలు....గుండెలనిండా వాత్సల్యం పొంగులు.

ఆయన చూపులకి వచ్చి పిల్ల నచ్చిందన్నారు. పెళ్ళి జరిగింది. ఏళ్లు గడిచాయి. పిల్లలు మాత్రం పుట్టలేదు. వాత్సల్యం ఎంత వెర్రిగా చిందులేసినా వెన్నదొంగ తన ఇంటికి రాలేదు. ఎదురు చూసి చూసి ఆశ అణగారి పోయింది.

"మళ్ళీ పెళ్ళి చేసుకో" అని సలహాలు ఆయనకి.

"పోనీ చేసుకోండి" అంది తను కూడా సగం బాధ సగం ఉక్రోషంతో.

"నీకూ కూడా మతి పోయిందా? ఇదేం బొమ్మలాటా?" అన్నారు.

మనసులో అనురాగం సముద్రమైంది.

తనకి పిల్లలు అక్కర్లేదు... ఈన చాలు.

బొమ్మలాటే నయం. మనం ఇష్టం వచ్చినట్లు ఆడుకోవచ్చు.

జీవితం అట్లాగకాదు. మనని శాసిస్తుంది. లొంగిదీస్తుంది. నిస్సహాయుల్ని చేసేస్తుంది. తనకింక పరవాలేదు. ఎవరూ అక్కర్లేదు.

ఆయన తనని దూరం చెయ్యడు....తనకి దూరం కాడు.

అతడే తన కృష్ణుడు. బాలకృష్ణుడు .... మోహనకృష్ణుడు....గీతాకృష్ణుడు.

అతడిలో కృష్ణుణ్ణి చూసినప్పటినుంచి తనకి కన్నీళ్ళు లేవు, నవ్వుల రువ్వులే కానీ.

"ఎందుకు రజనీ నీకు నవ్వువస్తుంది ఎప్పుడూ" అనేది రాధమ్మ.

నవ్వు అనేది ఆనంద మనే పువ్వు విసిరే పరిమళం.

అతడిలో కృష్ణుణ్ణి చూసినప్పటినుంచి తనకి కర్తవ్యమే తప్ప సమస్యలు లేవు.

ఆవిడ ఎప్పుడు లోపలికి వెళ్ళిందో....వచ్చి గ్లాసులు ఇచ్చింది.

"ఎల్లుండి వస్తున్నాం ఇంటికి. వెంటనే బొంబే వెళ్ళాలి. కొత్త ఇల్లు వదిలి వెళ్ళటం ఎట్లాగా అని బెంగగా వుంది. కాస్త మా ఇల్లు కూడా మీరే చూడాలి" అంది.

"ఏం భయం లేదు. చూస్తాం. మా ప్రిన్స్ వున్నాడుగా. తెలిసినవాళ్ళెవరూ ఈ చాయలకి రారు" అంది ఆవిడతో.

వచ్చేస్తున్నారుట! రండి....త్వరగా వచ్చెయ్యండి. ఈ నిశ్శబ్దాన్ని తరిమెయ్యండి.... అంటోంది మనసు.

* * *

రాత్రి గడిచింది.

ఇంక భయంలేదు అనుకోటానికి లేదు.... ఈ కాలం పగలుకూడా భయమే. ఏ మనిషిని చూసినా భయమే. నలుగురు కలిసి వస్తున్నా భయమే.

మన దేశంలో మనం కాందిశీకుల్లా బ్రతుకుతున్నాం.

సూర్యుడు పైకి వస్తున్నాడు. ఆకులన్నీ పచ్చగా మెరుస్తున్నాయి. ప్రిన్స్ ఎండలో పడుకున్నాడు. వాడి జుట్టు నిగనిగలాడుతోంది.

తన కుర్చీ ప్రిన్స్‌కి దగ్గరగా వేసుకుని కూర్చుంది రజని.

వంట గదిలో వున్నంతసేపూ ముందు వైపేధ్యాస....పక్క ఇంటిమీద....ఏ చిన్న చప్పుడైనా అనుమానమే....ఎవరూ ప్రవేశించలేదుకదా అని.

పక్క ఇంటి కొత్త స్నేహితురాలి పిల్లలు కృష్ణయ్యలు కారు. నరకాసురుళ్ళలాగున్నారు. ముద్దువచ్చే అల్లరికాదది. ప్రిన్స్‌మీదికి రాళ్ళు వేస్తారు.

వాళ్ళకి లేని వస్తువు లేదు. భర్త రెండు చేతులా సంపాదిస్తున్నాడు.

కారు, ఫ్రిజ్, నగలు, చీరలు, బీరువాలు, రత్నకంబళాలు....నల్ల బజారంతా ఆ ఇంట్లోనే వెలిగిపోతోంది.

దొంగలు పడితే అక్కడే పడాలి.

అందుకేనా అంత భయం! ఎంత భయం! ఎంత మమకారం వుంటే అంత భయం. అన్నీ తన కప్పగించి వెళ్ళిందావిడ. నిజంగా కాపాడగలదా....ఎవరేనా వస్తే, పోతే పోనీ....కష్టార్జితమేమీ కాదు. అంతా ఈజీ మనీయే!

బందిపోటుతనం చేసి ఆ డబ్బంతా ఏం చేస్తారో?

నిజంగా తమ పొట్టకోసమా?

ఉహు నిజంగా ఆకలి తీర్చుకోడానికైతే ఇంత ధైర్యం, సాహసం రావు.

సగం ఆకలి....సగం కసి....ఆకలిమంటలు రగిల్చిన కసి. అన్యాయంపై పగ! తను సుఖంగా వుండకపోతే ఈ ప్రపంచంలో ఎవరూ సుఖంగా వుండటానికి వేల్లేదు.

దోచుకుంటున్నారు సరే....ఆ డబ్బంతా ఏం చేస్తున్నట్లు!

బీదలకి పంచి పెడుతున్నారా? వాళ్ళే భాగ్యవంతులై మళ్ళీ అర్భకుల్ని పీడిస్తుంటారా?

ఇక్కడ దోచి ఎక్కడో పూడిస్తే సమానత్వం సిద్ధిస్తుందా?

ఈ దోపిడీలకి అసలు ఒక సిద్ధాంతం వుందా?

అక్రమాలు పోవాలంటే అన్యాయాలు వుండకూడదు.

అన్యాయాలు జరగకుండా వుండాలంటే సమానత్వం కావాలి.

సమానత్వం రావాలంటే డెమొక్రసీ వుండాలి.

డెమొక్రసీ నిలవాలంటే జనం చదువుకుని వుండాలి.

అయ్యో! స్వతంత్రం వచ్చిననాడు మనం ఎలుగెత్తి చాటిన మొదటి స్లోగన్ ఇదే కదూ. ఈ ముప్పై ఏళ్ళూ ఏం చేశావు దేశమా?

అయ్యో జనతా! ఎప్పుడు అక్షరాలు నేరుస్తావూ!

ఎప్పుడు బుద్ధిమంతుడివౌతావు! ఎప్పుడు పరిపాలన చేస్తావూ!

ఎప్పుడు సుఖాన్ని పండించి సంతోషాన్ని పంచిపెడతావూ! ఎప్పుడు?

ఇప్పుడు....

అంతా చెప్పేవాళ్ళే కానీ వినేవాళ్ళు లేరు.

ఆజ్ఞాపించేవాళ్ళే కానీ ఆచరించేవారు లేరు.

అంతా పల్లకీ ఎక్కుతామనే వారే కానీ మోసేవారు లేరు.

జెట్‌లాగ అందరూ ఎక్కి కూచున్నా ఎవ్వరూ మొయ్యకుండానే అతి వేగంగా ప్రయాణం చెయ్యగల ప్రభుత్వ యంత్రాంగం ఏదైనా వుందా?

అప్పుడు ఒక్క స్క్రూ వొదులైనా జెట్ నేలకూలి అంతా మరణిస్తారు కాబోలు!

ఒకరు మోసిన సుఖం మనకి వద్దు.

మోస్తే అందరం మోద్దాం దేవుడి ఊరేగింపు లాగ.

లేకపోతే కదలకపోయినా సరే అందరం ఎక్కి కూచుందాం!

హహ్హహ్హ... ఇప్పుడు అట్లాగే వున్న ట్లుంది పరిపాలన....హహ్హహ్హ . .

ఎందుకంత నవ్వుతావూ అనేది రాధమ్మ....

ఏం చెయ్యనూ, ఇవన్నీ నీకు చెప్పలేను రాధమ్మా.

నా ఆలోచనలకి నాకే నవ్వు వస్తుంది. నా ఆలోచనలకి నాకే ఏడుపు వస్తుంది.

నేను స్పందించే మనసున్న మామూలు మనిషిని.

ఎన్నెన్నో చెయ్యాలని ఊహలున్నా కాలు గడపదాటని మామూలు మనిషిని.

ఎవరో వస్తారు ఏదో చేస్తారని ఆశపడే మామూలు మనిషిని.

ఇక ఇంతే....అని నిరాశలో కృంగిపోయే మామూలు మనిషిని....

మెల్లమెల్లగా రజని ఆలోచనలు దాటి ఊహాలోకంలోకి జారుకుంది.

నల్లని ఆకాశంలో నక్షత్రాలు మెరిసిపో తున్నాయి.

అంతటా నిశ్శబ్దం. ఊపిరి సలపనివ్వని నిశ్శబ్దం.

అనంతంగా నిరీక్షిస్తున్నట్లు అనుభూతి. ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ ఎక్కడో చిటుక్కుమంది.

రజని అటు చూసింది. ప్రిన్స్ కూడా అటు చూసింది మెడసాచి, చెవులు నిక్కబొడిచి.

ప్రిన్స్ ఇప్పుడు నాలుగడుగుల ఎత్తు నందిలా వుంది.

ఒకటి....రెండు....మూడు....నలుగురు... వచ్చేస్తున్నారు! వాళ్ళు వచ్చేస్తున్నారు. చేతిలో రైఫిల్స్, కళ్ళకి గంతలు. సరాసరి పక్క ఇంటిలోకి వెళ్ళారు.

ఒకడు బయట నుంచున్నాడు. ఇంకొకడు తాళం తీశాడు. ఇద్దరు లోపలికి వెళ్ళారు. సామాన్లు కదులుతున్నాయ్. చప్పుళ్ళు....కదలి కలు....దోచేసుకుంటున్నారు... దోచుకోనీ .... దోచుకుపోనీ....అంతా అన్యాయార్జితమే.

ఉహూ! తనకి అప్పగించారా ఇల్లు. చూస్తూ ఊరుకోలేదు. ఫోన్ చేసినా పోలీసులు రారు. వచ్చినా అప్పటికి దొంగలు తమ పని పూర్తి చేసుకుని వెళ్ళిపోతారు.

వెళ్ళాలి! వాళ్ళ ఎదుటపడి ఇది అన్యాయం అనాలి.

అడిగేవాళ్ళు లేకనే ఈ దొంగతనాలు దోపి డీలు. అడిగితే ఏం జవాబిస్తారు? అడిగేస్తాను. ఒక ఇల్లు దోస్తే మీకు ఏమొస్తుంది? బ్రతు కంతా గడిచిపోతుందా? ఐతే నా నగలన్నీ ఇచ్చే స్తాను.

ఇట్లాగ దేశంమీద పడి ప్రజల్ని దోపిడీ చేస్తే సమానత్వం సిద్ధిస్తుందా?

హామీ ఇవ్వండి! ఈ దేశంలో ప్రతి స్త్రీ దగ్గరవున్న బంగారాన్నంతా మీకు ఇప్పిస్తాను!

అడుగుతాను. అడిగి తీరుతాను. ఏం జవాబు చెప్తారు?

రజని లేచింది. గోడ అంత ఎత్తు ఎదిగి నట్లుగా వుంది. చేతులు కత్తులుగా మారినట్లు చూపులు కార్చిచ్చు కక్కుతున్నట్లుగా వుంది.

ఒక అడుగువేసింది. భూమి వణుకుతోంది! మరొక అడుగు....

రజని ఉలికిపడింది. నల్లని పరదాలు జారి పోయాయి. వర్ణచిత్రాలు చెరిగిపోయాయి.

ప్రిన్స్ నిలబడి మొరుగుతోంది. తను కుర్చీ లోనే కూర్చుని వుంది.

ఎవరో ఇద్దరు మనుషులు లక్ష్యపెట్టకుండా లోపలికి వచ్చేశారు. ఒకడు అక్కడే ఆగి పోయాడు. రెండవవాడు రజనికి దగ్గరగా వచ్చే శాడు. కత్తి పైకి తీశాడు. రజని కూచునే వుంది.

"మేడమ్....ఆ గొలుసు ఇలా ఇస్తారా!" అతడి చేతిలో కత్తి తనకి దగ్గరగా వస్తోంది.

అకస్మాత్తుగా ప్రిన్స్ వాడిమీద పడింది. కత్తి ఎగిరిపోయింది. వాడిని కరిచింది. రెండవ వాడి మీదికి దూకింది. ఇద్దరూ గేటువేపు పరి గెత్తారు. ఇంకా వాళ్ళని వెంబడిస్తోంది ప్రిన్స్.

రజని ఊపిరి పీల్చుకుంది .... అమ్మో దొంగలు! నిజంగా దొంగలు!

షబాష్ ప్రిన్స్! దొంగ వెధవలు అష్ట

వంకర్లు తిరిగి పారిపోతున్నారు.

షబాష్....నా కొడుకువైనందుకు గర్వంగా వుంది!

ప్రిన్స్ మెట్ల కింద నిలబడింది. గర్వంగా.... విజయగర్వంతో... కాంతితో వెలిగిపోతోంది. వీళ్ళని అణిచేవాళ్ళు లేకనే....

ఎదిరించేవాళ్ళు లేకనే అన్యాయం విజృంభించింది.

ఎదిరిస్తే ఎవరూ నిలబడలేరు.

చలిచీమలచేత చిక్కి చావదె పెనుపాము!

నీటి కణాలు కలిస్తే వరద వాగులై ముంచెత్తుతాయి.

ప్రెషర్ రావాలి... ప్రెషర్ కావాలి.

మళ్ళీ ఏమిటా చప్పుడు ... రివాల్వర్ చప్పుడు.. అయ్యో పారిపోయి గేటు దగ్గర ఆగి వెధవ. . రివాల్వర్ పేల్చాడు. ప్రిన్స్ ఒరిగిపోతోంది....అయ్యో!

రజని పరిగెత్తుకు వెళ్ళింది. రక్తానికి కళ్ళు చెదిరిపోతున్నాయి.

ప్రిన్స్ దగ్గర కూలిపోయింది.

అయ్యో ప్రిన్స్... నా ప్రిన్స్... ఆ కళ్ళలో ఇంకా ఆ గర్వమే....ఇంకొకరికి ఉపయోగ పడ్డానని ఆ వెలుగు. ప్రిన్స్ దొంగల్ని చూసి తోక ముడుచుకోలేదు నువ్వు....నీ డ్యూటీ నువ్వు చేశావు . నీ యజమానురాలికోసం. నాకు దుఃఖంగా వుంది ప్రిన్స్... ఇంత దుఃఖంలోనూ గర్వంగా వుంది. నీ షివల్రీ చూసి గర్వంగా వుంది. మనుషుల్లో చచ్చిపోయినా ఇంకా నీలో వుంది. అందుకే నన్ను రక్షించావు. నన్ను రక్షించటానికి నీ ప్రాణాలు బలి ఇచ్చావ్....

ఎలాగ తెలిసిందో... అందరూ వచ్చేస్తున్నారు....ఎదురిళ్ళలోంచి, ఆ పక్క ఇళ్ళలోంచి. అప్పుడెవరూ రాలేదు. ఇప్పుడు ఎక్కడెక్కడి నుంచో ఎవరెవరో....వచ్చేస్తున్నారు.

"దొంగని కరిచేసిందిట కుక్క."

"నగలు సామాన్లేవీ పోలేదుట."

"కుక్క దొంగల్ని పట్టేసిందిట!"

"ప్రిన్స్ కుక్కకాదు. నా కొడుకు. మీరంతా వెళ్ళిపొండి. నన్ను మనసారా ఏడవనివ్వండి. మీరంతా వెళ్ళిపొండి. చూశారుగా. కుక్క చచ్చిపోయింది. ఇంక వెళ్ళండి. ఏం ఊరేగిస్తారా? వెళ్ళండి, రథం తీసుకురండి" అట్టహాసం చేస్తోంది మనసు.

ఎవరో రజని భుజంమీద చేయి వేశారు.

"ఎంత గండం గడిచింది!" రజని విని పించుకోలేదు. ప్రిన్స్‌నే చూస్తోంది.

రక్తం కారుతోంది ప్రిన్స్‌లోంచి.

రెండేళ్ళనించీ పెంచి గూడుగట్టిన మమకారం చితికి కారిపోతోంది.

నీకూ నాకూ ఋణం తీరిపోయింది ప్రిన్స్.. నువ్వు వెళ్ళిపోతున్నావ్... నీ ప్రాణాలు బలి ఇచ్చి గర్వంగా వెళ్ళిపోతున్నావ్ .... నాకేం మిగిలింది . బాధ . మనసులో శూన్యం.... ఏం మిగిలింది. ఈ బంగారం . ఈ పిచ్చి బంగారం

రజని రెండు చేతుల్ని దగ్గరగా చేసి చూస్తోంది. ఎండలో బంగారం తళతళా మెరుస్తోంది.

"మీ వారికి ఫోన్ చేశా. ఆయన వస్తున్నారు. మీరు లోపలికి పదండి ముందు... కుక్క చచ్చిపోయింది" అందొకావిడ రజనికి చేయూతనిస్తూ.

రజని లేచి లోపలికి వెడుతోంది. వెళ్ళలేక వదలలేక వెడుతోంది.

"ఔను. కుక్క చచ్చిపోయింది. మనిషిలో విశ్వాసం చచ్చిపోయింది. విశ్వాసానికి అంతిమ యాత్ర ఊరేగించండి. మనిషి జంతుదశను దాటిపోయాడు. ఒకప్పుడు సాంఘిక భద్రత కోసం నీతి నియమం పెట్టుకున్నాడు. కొన్నాళ్ళు సాగింది. ఇప్పుడు సాగటం లేదు. విశ్వాసం, నీతి, నియమం మనిషికి బ్రతుకు నివ్వటం లేదు. బలి తీసుకుంటున్నాయ్. అందుకని మనిషి వీటికి అతీతుడైపోతున్నాడు నీతి నియమం తెంచేసి పారిపోతున్నాడు . .. ఈ మనిషికి ఇప్పుడేది దిక్కు... ఏది దిక్కు! ఏది దిక్కు!" అంతరాళంలో ఘోష ..ఆకాశాన్ని అంటుతున్నట్లుగా వుంది రజనికి. □

# సినిమా

## బంగారు చెల్లెలు !

అన్నాచెల్లెళ్ళ అనుబంధాన్ని అతి పవిత్రంగా చూస్తుంది మన సమాజం. చెల్లెలి బంగారు భవిష్యత్తుకోసం తపనచెందని అన్నలు అరుదుగా వుంటారు. చెల్లెలి జీవితాన్ని కాపాడేందుకు ఒక అన్నపడ్డ తపన, వేదన, అందుకోసం అతనుచేసిన త్యాగం వివరించే ఓ ఆసక్తికరమయిన కథకు చలనచిత్రరూపంగా 'బంగారు చెల్లెలు' తయారయింది. శోభన్‌బాబు, మురళీమోహన్, జయసుధ, శ్రీదేవి, యం. రంగారావు, మాడా, సారధి, ప్రభాకరరెడ్డి మొదలయినవారు నటించిన ఈ చిత్రాన్ని బోయిన సుబ్బారావు దర్శకత్వంలో టి. త్రివిక్రమరావు నిర్మించారు.

## బాలచందర్‌తో రంజిత్ కుమార్ చిత్రాలు !

చిత్రనిర్మాత కానూరి రంజిత్‌కుమార్ తమ తదుపరి ప్రయత్నంగా తెలుగు, తమిళ భాషలలో ఒకేసారి ఒకచిత్రాన్ని నిర్మిస్తున్నారు. కె. బాలచందర్ దర్శకత్వం వహించే ఈ చిత్రానికి యం. యస్. విశ్వనాధం సంగీతాన్నీ, బి.ఎస్. లోకనాధ్ కెమెరా, గణేష్‌పాత్రో మాటలు, ఆచార్య ఆత్రేయ పాటలూ సమకూరుస్తున్నారు.

## కొత్త పంపిణీ సంస్థ !

ఆంధ్ర ప్రాంతంలో చలనచిత్రాలు పంపిణీ చేసేందుకు మరోకొత్త సంస్థ 'లక్ష్మిచిత్ర' పేరుతో విజయవాడలో ప్రారంభమయింది. మొదట లక్ష్మీఫిలింస్ హైదరాబాదు శాఖద్వారా తదుపరి తెలంగాణా ప్రాంతానికి పంపిణీ సంస్థ శ్రీ లక్ష్మిచిత్రద్వారా చిత్రరంగానికి సన్నిహితుడయిన హరికృష్ణ యీ నూతన సంస్థకు సారధి.

---

'నరుడా ఏమి నీ కోరిక ?'

జయలలిత, నాగేశ్వరరావు





'ప్రెసిడెంట్ పేరమ్మ'లో నూతన ప్రసాద్, కవిత

## బాపు తెచ్చిన సంపద!

'సీతాకళ్యాణం' చిత్రంద్వారా తెలుగు చిత్రాలకు విలువతెచ్చిన బాపు, ఎంతోమంది అంతర్జాతీయ చిత్ర విమర్శకుల ప్రశంసలను మనకు కానుకగా తెచ్చారు ఆ చిత్రం ద్వారా.

## ఆ ప్రశంసలలో కొన్ని :

"నేను చూసిన మహోన్నత సుందర కళాఖండాలలో ఇదొకటి. రచయిత ముళ్ళపూడి వెంకటరమణ, కె. వి. మహాదేవన్, సుశ్రావ్యమైన శాస్త్రీయ సంగీతం—కె.ఎస్. ప్రసాద్ ఛాయాగ్రాహకుడు, తాంత్రిక ఛాయాగ్రహణంలో భారతీయ "రేహారీహాసన్" అన తగ్గ రవి నగాయిచ్ సమిష్టికృషిలో "రామాయణం" లోని మనోహరమయిన అంశాలను దృశ్యకావ్యంగా మలచగలిగారు బాపు. ఆనాటి దేశకాల పరిస్థితులకు అనుగుణంగా ఉత్తమాభిరుచులతో చిత్తశుద్ధితోచేసిన ఈకృషి అపూర్వం. హాలీవుడ్ "బైబిల్" చిత్రాల స్థాయిలో నవరసభరితంగా రూపొందింది. ఇంతటి అత్యుత్తమ చిత్రాన్ని నేనిదివరకెన్నడూ చూసివుండలేదు."

—డెరెక్ మాల్కోమ్ 'ది గార్డియన్' లండన్

సర్వాంగ సుందరంగా మలచబడిన "సీతాకళ్యాణం" చిత్రాన్ని పౌరాణిక ఇతివృత్తాలకు తగిన రసపుష్టితో భారతీయ దర్శకుడు బాపు రూపొందించారు. సాంకేతికంగానూ యెంతో వున్నతంగానూ వుంది.

—బెర్ల్ వెరైటీ, చికాగో.



'అందాల రాశి'లో రతి, లత

గ్రహణం, టి చలపతిరావు సంగీతం నిర్వహిస్తున్నారు. కథ, మాటలు సి. యస్. రావు సమకూర్చిన ఈ చిత్రానికి నిర్మాత ఏ. వి. సుబ్బారావు.

## సైన్స్ ఫిక్షన్ !

శ్రీ వెంకటసాయి పిక్చర్స్‌వారి రంగుల చిత్రం, దక్షిణభారతమున చిత్రపరిశ్రమలో తొలి సైన్స్ ఫిక్షన్ చిత్రం "సృష్టి రహస్యాలు"

మనస్థత్వాలు గల పేరెంట్స్ యీ చిత్రంలోని ముఖ్యపాత్రలు. వైజ్ఞానికంగా, సామాజికంగా, ఆధ్యాత్మికంగా మానవుడు నిత్యజీవితంలో ఎదుర్కొనే సమస్యలకు సైన్సు ఆధారంగా చదువురాని వారికికూడా చక్కని సలహాలు తెలిసేలా యీ రంగులచిత్రం "సృష్టి రహస్యాలు" తెల్పుతుంది. ఈ చిత్రములో చక్కని విజ్ఞానంతోబాటు మంచి ఫ్యామిలీ సెంటిమెంట్ కథకూడా వుంది. ప్రతివారు చూచి తెలుసుకునే అనేకమయిన సైన్స్‌కు సంబంధించిన పాయింట్స్‌ను యీ చిత్రంలో చిత్రీకరించారు.

తెలుగు తమిళ భాషలలో ఒకేసారి నిర్మిత మవుతున్న యీ రంగుల చిత్రంలో ముఖ్య భూమికల్ని జగ్గయ్య, సుధాకర్, రవికాంత్, అర్జున, గంగ, మమత, ఆంజిలీనాయుడు, విజయలక్ష్మి, మద్దాలి సుశీల, ఆశాలత, కమల కుమారి నిర్వహించగా డాక్టర్ సమరం ఓ డాక్టర్ పాత్రను పోషించారు.

ఈ రంగుల చిత్రానికి సమర్పణ, కథ మాటలు డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు సంగీతం పెండ్యాల, కెమెరా వి. వి. రామ్ చౌదరి, ఎడిటర్ వెంకటేశ్వర్రావు, ఆర్ట్ లీలాకృష్ణ, ప్రొడక్షన్ జయంత్‌బాబు, అసిస్టెంట్ డైరెక్టరు. జి. వి ప్రసాద్, స్క్రీన్‌ప్లే దర్శకత్వం ప్రతాప్, నిర్మాత. కె. రాంబాబు.

## హరిజన్ !

పరీక్షలయిపోయాయి. కాలేజీలో చదువు కొంటున్న యువకులు తమ గ్రామానికి తిరిగి వచ్చారు. వారు సహజంగా పొలంపనులకు వెళ్ళరు. తోటి స్నేహితులతో కలసి యెలా కాలక్షేపం చేయాలా అని యెదురు చూస్తారు. గంటల తరబడి కబుర్లు చెప్పుకుంటూ కూర్చుం



'అమ్మ ఎవరికైనా అమ్మ'లో శ్రీప్రియ

టారు. లేదా పేక ఆడతారు. డబ్బుతో కాకుండా సరదాగా ఆడుకుంటున్నారు ఆవేళ. అక్కడ అందరూ వున్నత కులాలకు చెందిన యువకులే కూర్చుని ఆడుతున్నారు. ఈ యువకులు అస్పృశ్యతనుపాటించరు. కానీ హరిజనులంటే చులకన భావం వారి మనస్సులో ప్రతిష్టితమై వుంటుంది. హరిజన యువకుడు అనంత్ అటుగుండా వెళుతుంటే అతణ్ని సైతం పేకాడటానికి రమ్మని సత్యం ఆహ్వానించాడు. వారితో కలిసి పేకాడటం అనంత్‌కు యిష్టంలేదు. ఐనా తన మిత్రుని ఆహ్వానాన్ని త్రోసిపుచ్చలేకపోయాడు. అన్యమనస్కంగానే వెళ్ళి వారితో కలిసి ఆడసాగాడు.

ఆ ఆటలో ఒక నియమంవుంది. ఓడిపోయిన వ్యక్తికి మసితో నామాలు పెడతారు. ముందుగా అనంత్ ప్రక్కన కూర్చునివున్న యువకుడు ఓడిపోతాడు. ఆ ఆట నిబంధనప్రకారం అనంత్ అతనికి మసి రాయబోతాడు ఆ యువకుడు తీవ్రంగా నిరోధిస్తాడు. అనంత్ నివ్వెరపోతాడు. ఎవ్వరూ ఏమీ మాట్లాడరు. అనంత్ తన ప్రయత్నాన్ని విరమించుకొంటాడు. మరో ఆట మొదలవుతుంది ఈ సారి అనంత్ ఓడిపోతాడు. ఇప్పుడు అందరు కలసి అనంత్‌కు మసిని రాస్తారు. సత్యం వారించబోతాడు. అయినా ఎవ్వరూ విరమించుకోరు.

అనంత్ ఖిన్నుడవుతాడు. తనను తన కులాన్ని వారంతా ఎంత చులకనగా చూస్తారో ప్రతి సందర్భంలోను తనసెంతటి తక్కువగా పరిగణిస్తారో అతనికి అర్థమవుతుంది ముఖం నిండా నల్లటి చారలు — ఈ అవమానాన్ని బాదను మనసులోనే దిగమ్రింగి అతనక్కడ నుండి నిశ్శబ్దంగా నడిచిపోతాడు.

ఈ దృశ్యం న్యూ పర్స్పెక్టివ్ వారి "హరిజన్" చిత్రంలోనిది. ఇందులో అనంత్‌గా హృదయరాజా, సత్యంగా కృష్ణారావు నటిస్తున్నారు. దర్శకత్వం రవీంద్రన్ నిర్మాత సి. నరసింహారావు, కెమెరా మధు అంబట్, సంగీతం పద్మనాభన్.

## సీడ !

దర్శకుడు దాసరి సినిమా కళను ఒక అపూర్వ సాధనగా మలచుకున్నారు. అదే ఆయన ప్రత్యేకత. సామాజిక సత్యాలను



'కటకటాల రుద్రయ్య' శతదినోత్సవ సందర్భంలో
శివాజీ గణేశన్, కృష్ణంరాజు, దాసరి, జితేంద్ర

అతి చక్కని కథాచిత్రాలుగా రూపొందించడం వారిలో గమనిస్తారు ప్రేక్షకులు. ఇప్పుడు తెలుగుచిత్ర బేనర్‌పై "నీడ"....వారి క్రొత్త ప్రయోగం.

కాలం కటువైనది. దానికి దయా దాక్షిణ్యాలుండవు. అలాంటి కాలగమనానికి కనువిప్పు కలిగించేదే—నీడ—చిత్రం. "నీ ఇంటికి నువ్వు ఒక దీపానివి. దాని నీడవు నువ్వే. అందుకే అందరికీ నీ వెలుగు అందించు. నీ నీడను మాత్రం నిలవ నియ్యకు." అనే నిజాన్ని నీడలో చూపుతున్నారాయన. ప్రతి వ్యక్తినీ వెన్నుతట్టి మేలుకొలుపే ప్రయోజనాత్మక చిత్రం నీడ.

దీనిలో పాటలు ఆటలుండవు. అలవాటైన స్టెప్పులు, హీరోయిజం, స్టంటులు కనిపించవు. భావప్రకటనకు భాషే ప్రధానమనే డైలాగులు వినిపించవు. అత్యవసర స్థితిలో మాత్రం యీ డైలాగులు వాడబడుతున్నాయి. సన్నివేశానికి అవసరమయిన మూడ్స్ పెంచడానికి, కథాగమనానికి వేగాన్ని, బలాన్ని కలిగించేందుకు మాత్రమే సంగీతం వుపయోగిస్తున్నారు. కె.యస్. మణి, భాస్కరరాజు, రమేష్ నాయుడు, బాలు తెరవెనుక అలంకారికులు. నిర్మాత రామినేని.

## ఐ. వి. శశి దర్శకత్వంలో "కాళి"

"హర్ నైట్స్" (అంగడిబొమ్మ మాతృక) చిత్రంద్వారా తెలుగు ప్రేక్షకులకు సుపరిచితులయిన ప్రఖ్యాత మళయాళ దర్శకుడు ఐ. వి. శశి తెలుగులో హేమ్-నాగ్ ఫిలింస్‌వారు నిర్మిస్తున్న భారీ సినిమాస్కోప్ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్నారు.

రజనీకాంత్, చిరంజీవి అన్నదమ్ములుగా నటిస్తోన్న యీ చిత్రంలో యింకా సత్యనారాయణ, కాంతారావు, నూతన నటి రీనా, ఫటాఫట్ జయలక్ష్మి, వెన్నిరాడై నిర్మల ప్రధాన పాత్రలు ధరిస్తోన్నారు. అంగడిబొమ్మ ఫేమ్ సీమా యిందులో కథానాయిక పాత్ర ధరిస్తున్నది.

అండర్‌వాటర్ ఫోటోగ్రఫీ కార్ చేజెస్

మొదలయిన ఆకర్షణలుగల యీ వినోదాత్మక చిత్రానికి గొల్లపూడి సంభాషణలను, అశోక్ కుమార్ ఛాయాగ్రహణాన్ని, ఇళయరాజా సంగీతాన్ని, వీటూరి పాటలను, మోహన్ కళను నిర్వహిస్తున్నారు.

## గాలివాన!

సురేంద్ర ఆర్ట్స్ తొలిచిత్రం 'గాలివాన' ఆనందమోహన్ దర్శకత్వంలో ఆరంభం అయింది. ఆంధ్రదేశంలో విరివిగా అశేష ప్రదర్శనలు ఇచ్చిన ఆర్. వి. యస్. రామస్వామి రచించిన 'గాలివాన' నాటకం ఈ చిత్రానికి ఆధారం. చిత్రం మాటలు నాటకరచయితే కూర్చారు. నాలుగు పాటలను కోపల్లె శివరాం రాశారు. సంగీత దర్శకులు పెండ్యాల. చిత్రంలో అధికభాగం 'గాలివాన' నాటకాన్ని వివిధప్రాంతాలలో నటించిన నటుల్ని యెన్నిక చేశారు. పరిశ్రమనుంచి బోసుబాబు, విజయ కృష్ణ, నేవల్ రవి, సత్యచిత్ర, కుమారి ఝున్సీ, కుమారి సత్యవాణి ఎన్నిక అయారు. రంగస్థలం నుంచి ఎన్నికచేయబడ్డ నటులు బి. నారాయణ, హనుమంతరావు, శ్రీధరాచార్య, ఆర్. వి. యస్. రామస్వామి, నందకిశోర్, ఏ. రామ్మూర్తి, కృష్ణ, ఓ. రామ్మూర్తి, శ్రీకాంత్ వగైరా.

## ఎవరో చూస్తున్నారు!

మద్రాసు ఫిలిం టెక్నాలజీలో దర్శకత్వ శాఖకు తర్ఫీదు పొందిన యువ ఛాత్రకుడు శ్రీ సి. రుద్రయ్య, కుమార్ ఆర్ట్స్ పతాకంపై "ఎవరో చూస్తున్నారు" వర్ణచిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈపూర్తి వినోదాత్మకచిత్రంలో కమల్ హాసన్ కథానాయకుడుగా ఒకప్రత్యేక తరహా పాత్రను పోషిస్తున్నారు. కథానాయకిగా అంగడి బొమ్మ ఫేమ్ సీమ, తతిమా పాత్రలలో సరిత, కాంతారావు, కె. వి. చలం మొదలయినవారు నటిస్తున్నారు.

శ్రీ సి. రుద్రయ్య దర్శకత్వం వహించిన మొదటిచిత్రం అవళ్ అప్పడితాన్, తమిళంలో విజయవంతం కావడమే కాకుండా, యేడవ

యువచిత్రవారి కొత్తచిత్రం ప్రారంభం: కథానాయిక సుజాత, లక్ష్మీఫిలింస్ రాఘవేంద్రరావు, దర్శకుడు దాసరి చిత్రంలో వున్నారు



పండుగను చాలా సామాన్యంగానూ, విలక్షణం గానూ చేశారు. పత్రికా ప్రతినిధులు, కరుణా మయుడు యూనిట్‌లోని కొంతమంది కళా కారులు, సాంకేతిక నిపుణులూ పాల్గొన్న ఆ సభకు నటుడు జగయ్య అధ్యక్షత వహించగా, తారకరామ ఫిలింస్ జగన్మోహనరావు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. మద్రాసు ఫిల్మ్ జర్న లిస్ట్స్ అసోసియేషన్, ఆఫీస్ బేరర్స్ మోహన్ కుమార్, కాగడా శర్మ, అర్జునరావు, వేమూరి సత్యనారాయణ, డాక్టర్ మల్లిఖార్జునరావులను వేదికపైకి పిలిపించి పుష్పమాలాలంకృతుల్ని చేసి వారిని గౌరవించాడు విజయచందర్. అధ్య క్షులు జగ్గయ్య కరుణామయుడు నిర్మించడంలో విజయచందర్ అమితమైన సాహసాన్ని, అత్యంత నిజాయితీనీ ప్రదర్శించాడనీ, చిత్రం విజయవంతం కావడం చాలా ఆనందదాయక మనీ, విజయచందర్‌ని అభినందిస్తూ చెప్పారు. కరుణామయుడు చిత్రానికి రచన చేసిన జాన్సన్, పత్రికా ప్రతినిధులను ఇంత తరచుగా కలుసు కొంటూ వారితో ఇంత చక్కటి అనుబంధాన్ని పెంచుకోగలిగిన సంస్థ రాధాచిత్రేనని చెబుతూ జర్నలిస్టులకు కృతజ్ఞతలు తెలిపారు.

విజయచందర్ మాట్లాడుతూ కరుణా మయుడు చిత్ర విజయం తర్వాత ప్రజల మధ్యకు వెళ్ళినప్పుడు తనకు కలిగిన అను భూతులనూ, తన అనుభవాలనూ సుదీర్ఘంగా వివరించారు. తొలి చిత్రంలో జర్నలిస్టుగా నటించిన (మరో ప్రపంచంలో సిరిసిరి పాత్ర) తనకు జర్నలిస్టు వృత్తి అంటే చాలా గౌరవ మనీ, ఆ వృత్తిలోని వారు చేస్తున్న కృషికి లభించే ఫలం చాలా తక్కువగా వుంటోందనీ, తన శాయశక్తులా వారికి సహాయపడేందుకు తాను ముందుకొస్తున్నానని చెబుతూ ఫిలిం జర్నలిస్టు అసోసియేషన్ (మద్రాసు)కు మూడు వేల రూపాయల చెక్కు బహూకరించారు.

'కరుణామయుడు' చిత్రం గురించి కాగడా శర్మ ప్రసంగించారు. విజయవంతమైన చిత్రాన్ని నిర్మించినందుకు, నటుడిగాకూడా విశేషవిజయం సాధించినందుకూ, విజయచందర్‌ను అభినం దిస్తూ జర్నలిస్టు అసోసియేషన్ తరపున ఆ



'గాలివాన'లో ఒక దృశ్యం

సంస్థ అధ్యక్షుడు మోహన్‌కుమార్ విజయ చందర్‌ను పూలమాలాలంకృతుల్ని చేశారు.

ఈ సందర్భంలోనే విజయచందర్ హీరోగా, బాపు దర్శకుడిగా, ముళ్ళపూడి రచయితగా మే నుంచి ప్రారంభించి తీయబోతున్న చిత్రం గురించి ప్రకటించారు ఆ చిత్ర నిర్మాతలలో ఒకరైన ఆర్. దశరథరామరెడ్డి.

రామచిత్ర పతాకంపై నిర్మితమయే ఈ చిత్రంలో విజయచందర్ ద్విపాత్రాభినయం చేస్తారు. ఇతర నటీనటుల వివరాలు త్వరలో ప్రకటిస్తామని చెప్పారు నిర్మాతలు. జూన్ చివ రికి ఈ చిత్రం షూటింగ్ పూర్తి చేసుకొని, ఇతర దేశాలలో 'కరుణామయుడు' వ్యాపారా నికి సంబంధించి, విదేశయాత్రకు వెళ్తున్నాడు విజయచందర్.

ఈలోపుగానే 'కరుణామూర్తి' పేరుతో తమిళంలోనూ, 'కరుణానిధి' పేరుతో హిందీ లోనూ 'కరుణామయుడు' చిత్రాన్ని డబ్‌చేసి విడుదల చేయబోతున్నారు. రాధాచిత్ర పతాకం పై తదుపరి చిత్రంగా భారీ ఎత్తున 'గౌతమ బుద్ధ' వర్ణ చిత్రాన్ని నిర్మించే ప్రయత్నాలు కూడా కొనసాగిస్తున్నాడు విజయచందర్.

—యస్వీనారాయణ

# శ్రీశ్రీ నిర్వహించు పదబంధ ప్రహేళిక

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | 3 | ■ | 4 | 5 | | 6 |
| | ■ | 7 | | | | | ■ | |
| 8 | 9 | ■ | | ■ | | ■ | 10 | |
| 11 | | | ■ | 12 | ■ | 13 | | |
| ■ | | ■ | 14 | | | ■ | | ■ |
| 15 | | | ■ | | ■ | 16 | | 17 |
| 18 | | ■ | 19 | ■ | 20 | ■ | 21 | |
| | ■ | 22 | | | | 23 | ■ | |
| 24 | | | | ■ | 25 | | | |

## ఆధారాలు

మే '79

### అడ్డం

1. నర్తనశాల.
4. ఈ పత్రం లేతది.
7. చరిత్ర పరిశోధకులకు ఉపకరిస్తుంది.
8. ఈ యింటికి మరో రెండు.
10. ఇది కానిది.
11. ఒక తిథి (8 మైనస్ 1)
13. దీని భర్త దీన్ని మోస్తున్నాడు.
14. చిక్కు.
15. 3 లో గేయం.
16. భారత భూపతి.
18. వైశ్యుల లెక్కలో ఒకటి.
21. ఆమ్రేడిస్తే పరుగెత్తడం.
22. ఇంతే జీవితం.
24. స్తన శల్యం లాంటిది.
25. చెట్టుమీద చెట్టు.

### నిలువు

1. మాట, పాట.
2. నడిచే నాలుగో వంతు.
3. దీని వెన్న చంద్రుడు.

4. కష్టపడి విప్పి, తర్వాత తలలు కలిపితే ఇది లభ్యమవుతుంది.

5. లాగు.

6. కలువ, కొలను.

9. వేగు.

10. ఎవరివి వాళ్ళవి.

12. అలనాటి ఆంధ్రావని.

15. ఆద్యంతాలు.

17. —పదతారేమో, జాగ్రత్త?

19. బురద నెరిసిందా?

20. ఈ నిప్పు 3 లో వుందంటారు.

22. గడ్డికి నేస్తం?

23. ఒకనాటి గొప్ప ఆయుధం.

## ఏప్రిల్ పదబంధ ప్రహేళికకు సమాధానం:

అడ్డం: 1. పొట్లపాదు, 4. సంపాదన, 7. కందుకకేళి. 8. నాదం, 10. రగ్గు 11. వదనం 13. వసారా. 14. గుటుక్కు. 15. నమాజు. 16. సికత. 18. దినం. 21. ముడి. 22. హిమవాలుక. 24. బహుమతి. 25. ముద్దుబిడ్డ.

నిలువు: 1. పొగనావ. 2. పాకం. 3. దురుదు. 4. సంకేతం. 5. పాళి. 6. నయాగరా. 9. దందహ్యమానం. 10. రసాత్మకము. 12. కిటుకు. 15. నదిహుబ్బు 17. తడిగుడ్డ. 19. సుమతి. 20. పులుము. 22. హిమ. 23. కద్దు.

## నిబంధనలు గమనించండి!

పదబంధ ప్రహేళిక కొట్టివేతలు, దిద్దుబాట్లూ లేకుండా పూర్తిచేసి ఏప్రిల్ 27 వ తేదీలోపు మాకు చేరునట్లు పంపండి. తెల్లకాగితం మీద గళ్ళు గీసి పూర్తిచేసి పంపిన ఎంట్రీలు చెల్లవు. ఎంట్రీలు పంపువారు వారి పూర్తి చిరునామా ఎంట్రీపైనే రాసి పంపాలి. ఆల్ కరెక్ట్ ఎంట్రీకి రు. 50/- బహుమతి. ఒకటికి మించి ఆల్ కరెక్ట్ ఎంట్రీలు వొచ్చినప్పుడు బహుమతి సొమ్ము విజేతలకు సమానంగా పంచబడుతుంది. ఆల్ కరెక్ట్ ఎంట్రీ ఒకటీ రాకపోతే బహుమతి సొమ్ము పై నెల బహుమతి సొమ్ముకు కలిపి అందజేయబడుతుంది.

## ఏప్రిల్ ప్రహేళిక : బహుమతులు పొందినవారు

1. ఎ.వి. సుబ్రహ్మణ్యం, గార; హైదరాబాదు నుండి 2. టి. ఉమాదేవి, 3. టి. వసంత కుమారి, 4. ఆరోహన. 5. ఎమ్. అన్నపూర్ణ. 6. ఎన్.సి.హెజ్. జగన్నాధాచార్యులు, కొత్తగూడెం. 7. పి. సరస్వతి, మలికిపురం. మద్రాసు నుండి 8. బి.వి.వి.ఆర్. సుబ్బారావు, 9. జెహరాసాహితి, 10. వి. గోపాలకృష్ణ. 11. అలపర్తి వెంకటసుబ్బారావు, నందివెలుగు నల్లగొండ నుండి 12. ఆర్. శ్రీమన్నారాయణశర్మ, 13. ఎస్.కె. రామారావు, 14. వంగల రంగాచార్యులు. 15. ఎ. లక్ష్మీపల్లి కార్తికేయి, శ్రీకాకుళం. వీరందరికీ జాక్‌పాట్ బహుమతి రు. 150/- పంచి పంపిస్తున్నాము.

FREE!! # ఎక్కడికి పారిపోగలరు? ఉచితం!!

"ఆహా! గువ్వవలె నాకు రెక్కలున్న యెడల నే నెగిరిపోయి నెమ్మదిగా నుందునే!" అని భక్తుడొకడు బాధలు భరించలేక విలపించాడు.

తెల్లవారితే ఒక మధ్యతరగతి కుటుంబంలోని ఎన్ని కష్టాలు, ఎన్ని విపత్తులు ఎన్ని ఆపదలు! వీటన్నితో విసిగి వేసారి రెక్కలు కట్టుకొని ఎక్కడికైనా పారిపోతే బాగుండునని తలంచు చున్నాడు.

మిమ్మలను కలవర పెట్టేదేమిటి? ఎవ్వరికీ తెలియలేదని చేసిన పాపం వలన నీ మనస్సాక్షి మలినమయిందా! మనస్సు మలినమైనదని దైవ సన్నిధి నుండి పారిపోకండి. మీకు ఆ తలంపు పుట్టక మునుపే ఆయన గ్రహించగలడు. ఆయన మీ నడతను పరీక్షించును.

ఇంక మిమ్ములను వ్యాకులత పెట్టేదేమిటి? చింతా! వ్యాకులతా? సందేహమా జయమా? ఆశాభంగమా! అన్నిటినీ కన్నీళ్ళతో క్రీస్తు పాదముల యొద్దకు తీసుకొని రండి. ఆయన చక్కపరచని చిక్కులు లేవు. అర్థం చేసుకోని సమస్యలు లేవు. విడిపించని బంధాలు లేవు. ఆయన కసాధ్యమైన దేదియూ లేదు. విశ్వసిస్తే ఆయన సమస్తము చేయకలడని నమ్మండి. "ప్రయాస పడి భారము మోయుచున్న సమస్తమైన జనులారా! నా యొద్దకు రండి. నేను మీకు విశ్రాంతి కలుగచేతునని" ప్రభు ఈనాడు కూడా తెరిచిన బాహువులతో పిలచు చున్నారు.

మానవులకు కావలసినది కష్టాలలో నుండి పారిపోయి విశ్రాంతి పొందటం కాదు. వారికి కావలసినది కష్టాలలో నిందలలో హింసలలో చెక్కుచెదరని ప్రశాంతి. ఈనాడే ఆ ప్రభు మీ ప్రార్థన వినగలడనే విశ్వాసముతో ప్రార్థించి ఫలితం మీరు కూడా 'ఎందుకు' పొందకూడదు?

—చదలవాడ చంద్రమతిదేవి

ఉచితం!!

భగవత్స్వరూపుడైన ఏసుక్రీస్తు జీవిత చరిత్ర ఆయన బోధలు తెలిపే అందమైన ఉచిత పుస్తకం గాని, ఆకర్షణీయమైన డిప్లొమా పొందదానికి ఉచితంగా లభించే బైబిలు కోర్సు గాని కావాలనుకుంటే మీ చిరునామా ఈరోజే తెల్పండి. పోస్టు ఖర్చులు మేమే భరించి మీకు ఉచితంగా పంపుతాము.

ఉచితం!!!

ఇదీ అడ్రస్:

ఎన్. జాన్ డేవిడ్
పోస్టు బాక్సు-12
చిలకలూరిపేట
గుంటూరు జిల్లా.

A.M.G.

Gospel Message
Inserted by A.M.G.




# కథల పోటీ

## మొత్తం పదమూడు బహుమతులు

ప్రథమ బహుమతి : **750 రు.**

ద్వితీయ బహుమతి: **400 రు.**

తృతీయ బహుమతి: **300 రు.**

ఇంకా....ప్రశంసార్హమైన మరో పది కథలకు ఒక్కొక్క-
దానికి రూ. **116** చొప్పున ప్రత్యేక బహుమతులు

## నిబంధనలు గమనించండి !

1. కథలు 16 పేజీలు మించకుండా (ముద్రణలో) ఉండాలి. (సుమారు పేజీకి 30 లైన్లతో 16 పేజీల ఫుల్‌స్కేపు పేజీలు మించకుండా).
2. అనువాదాలూ, అనుసరణలూ అంగీకరింపబడవు. రచనలు తమ స్వంత-మనే హామీ పత్రాన్ని విధిగా పంపాలి.
3. ముఖ్యగమనిక: రచయితలు తమ చిరునామాను కథవున్న పేజీలలోగానీ, ఆ పేజీల వెనకగానీ కాకుండా, మరో కాగితంపై వ్రాసి జతచేయాలి.
4. రచయితలు కలం పేరుతోబాటు తమ అసలు పేరును విధిగా తెలియచేయాలి.
5. ప్రచురణార్హముగాని కథలు తిప్పిపంపగోరువారు కథలతోపాటు తగినన్ని తపాలా బిళ్ళలంటించిన స్వంత చిరునామాగల కవరు జతచేసి పంపాలి.
6. పోటీకి రచనలు పంపే కవర్లపై 'జ్యోతి కథలపోటీకి' అని విధిగా రాయాలి.
7. పోటీలో బహుమతి పొందని కథలలో ప్రచురణార్హమైనవాటిని ప్రచురణకు స్వీకరించే హక్కు మాకుంటుంది.
8. పోటీ విషయంగా జ్యోతి సంపాదకులదే తుది నిర్ణయం. —ఎడిటర్

రచనలు పంపేందుకు ఆఖరు తేదీ

**15 మే 1979**

Edited&Published by V. Leelavathy Raghavaiah, at 17B Rajaram Colony Kodambakkam, Madras-600024,& Printed by D. Hanumantha Rao at Kranti Press, 12, Francis Joseph Street, Madras-600001.